# చతుర కతలు

## అర్హత

ఏం చెయ్యాలో తోచక తన ఐ.పి.యస్ బుర్రని బద్దలుకొట్టుకుంటున్నాడు రవీంద్ర. నాలుగురోజులుగా అదే సమస్య. ఎలా పరిష్కరించాలో అర్థంకాక నిద్రాహారాలకు ధూరమై మరీ ఆలోచించినా తరుణోపాయం దొరకడంలేదు. అపాయింట్ మెంటార్డర్ను పంపించి తీరాల్సిన డెడ్‌లైన్ దగ్గరపడింది. ఆ టెన్షన్‌తో కనిపించినవాళ్లనల్లా కరిచేస్తున్నాడు. అయ్యగారి ఆగ్రహానికి కారణం తెలియని కింది సిబ్బంది భయపడి చస్తున్నారు. ఇక ఇంట్లోవాళ్ల సంగతి సరేసరి.



సిబ్బందిలో ముసలికానిస్టేబుల్ 'నిప్పు అప్పలసామి' కి రవీంద్ర దగ్గర కాస్త చనువుంది. వయసులో పెద్దరికంతోపాటు డ్యూటీలో సిన్సియారిటీ పాటించే 'నిప్పు అప్పలసామి' అంటే రవీంద్రకు అభిమానం.

"నిప్పు" అన్నది అప్పలసామి ఇంటిపేరు కాదు. డిపార్ట్‌మెంట్ అతని సిన్సియారిటీకి ముద్దుగా పెట్టుకున్న పేరు. ఆ చనువు ఆసరాగా తీసుకుని సంగతి తెలుసుకోమని నిప్పు అప్పలసామిని ముందుకు తోశారు అంతాకలిసి.

రవీంద్ర తాను ఎదుర్కొంటున్న సమస్య చెప్పాడు. యస్.ఐ పోస్ట్‌కి సెలెక్షన్లు జరుగుతున్నాయి. ఉన్న పోస్టులు రెండు. వచ్చిన అభ్యర్థులు రెండువేలు. వాళ్లకు రాత పరీక్షలు, ఈత పరీక్షలు, నడవడం, పరిగెత్తడం, ఎగరడం, దుమకడం, బరువూ-తేలిక, లావూ-సన్నం, షూటింగ్-ఈటింగ్ ఇలా రకరకాల పరీక్షలు చేసి వడబోత మీద వడబోతలు పోస్తే పన్నెండుమంది నిగ్గు తేలారు. ఇక వాళ్లనుండి ఇద్దరిని ఎంపిక చేయాలి.

రాజకీయనాయకుల రికమండేషన్లు,



చతుర... 3

డిపార్ట్‌మెంట్‌లో ఇతర పెద్దల రికమండేషన్లు, లంచం ఇచ్చుకోగల సామర్థ్యం ఉన్న వాళ్లు.. అందరూ సరిసమానంగా నిలిచారు. ఇప్పుడు ఏంచెయ్యాలి అన్నది అర్థం కావడంలేదని రవీంద్ర బేలగా అప్పలసామి ముందు చెప్పుకున్నాడు. "ఇంతేనా బాబూ సమస్యా! అభ్యర్థుల బయోడేటా నేనోసారి చూడొచ్చా? " అని అడిగాడు అప్పలసామి.

"ఇదిగో కంప్యూటర్‌లో పూర్తి సమాచారం ఉంది చూడు" అన్నాడు రవీంద్ర.

కంప్యూటర్ సమాచారాన్ని ఒక్కసారి చూసి "మూడో నంబరు, ఏడో నంబరు అభ్యర్థులకు అపాయింట్‌మెంట్ ఆర్డర్ పంపండి సార్! మీకేవిధమైన ఆక్షేపణా ఉండదు" అన్నాడు అప్పలసామి.

"వాళ్లేమన్నా నీకు కావలసిన వాళ్లా? " అడిగాడు అంత తొందరగా వారిద్దరినీ రికమండ్ చెయ్యడంతో అనుమానంగా.

"నిప్పుకు చెద పట్టదు సార్! అప్పలసామిని మీరెరగరా? "

"అయితే ఏ అర్హత చూసి ఎంపిక చేశావో చెప్పు" అన్నాడు రవీంద్ర.

"మూడో నంబరు అభ్యర్థి తన బయోడేటాలో తాను కవిత్వం రాస్తానని చెప్పుకున్నాడు. మనం నేరస్తులనుంచి నిజం రాబట్టటానికి థర్డ్ డిగ్రీ కన్నా ఇతని కవిత్వం తోటి నిజం రాబట్టచ్చు. అది నిస్సందేహంగా అతని ప్రత్యేక అర్హతే!"

తెల్లబోయి చూస్తున్న రవీంద్రతో ఇంకా ఇలా చెప్పాడు "అలానే ఏడో నెంబరు అభ్యర్థి కథలు రాస్తానన్నాడు. మనం ఎన్‌కౌంటర్లు చేసినప్పుడు ప్రెస్‌వాళ్లు పిచ్చిపిచ్చి ప్రశ్నలతో తికమకపెట్టినా మంచి కథనంతో అందరినీ నోరు మూయించడానికి పనికివస్తాడు. అంచేతనే వాళ్లిద్దరినీ ఎంపిక చేశాను. అంతేసార్!" అన్నాడు నిప్పు అప్పలసామి తెల్లని గుబురుమీసాల వెనక నవ్వును దాచుకుంటూ.

రవీంద్ర ఒక్కసారి హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు. అప్పలసామి ఎంపిక తనకీ నచ్చింది. అతనిని అభినందించి అపాయింట్‌మెంట్ ఆర్డర్లు వాళ్లిద్దరికీ వెంటనే పంపమని ఆదేశించాడు రవీంద్ర.

**– రతన్‌బాబు**

---

# టిట్ ఫర్ టాట్

స్వామికి ఆరోగ్యం బాగోలేదని తెలిసి చూడ్డానికి వెళ్లాను. అక్యూట్ డయాబెటిక్స్ మూలంగా కిడ్నీ చెడిపోయిందట. తరచు డయాలిసిస్ అవసరమవుతోంది. నా చిన్ననాటి స్నేహితుడతను.

సంపన్న కుటుంబంలోంచి వచ్చిన స్వామి, తండ్రి మరణానంతరం బంధువులన్నవాళ్లు మోసంతో ఆస్తంతా కాజేయడంతో సామాన్యుడిలా మిగిలిపోయాడు. తల్లిని తీసుకుని కడుపు చేతపట్టుకుని ఉత్తరాదికి వెళ్లిపోయాడు. పాతికేళ్ల తరువాత ఆమధ్యే ఒంటరిగా తిరిగొచ్చాడు. మైనస్ తల్లి, ప్లస్ అనారోగ్యంతో.

అన్నేళ్లూ అందరికీ దూరంగా గడపడంతో, బంధువుల్ని చూడాలన్న వెర్రికోర్కె కలిగింది స్వామికి. ఎవరెక్కడున్నారో తెలీదు. అందుకే పత్రికలలో ప్రకటన వేయించాను నేను. వాడి వివరాలిస్తూ, వాడి పరిస్థితి వివరిస్తూ, వాడి కోర్కెను హైలైట్ చేస్తూ, వాడి బంధువులు ఎక్కడున్నా తక్షణమే రావలసిందిగా కోరుతూ.

ఆ తరువాత ప్రతిరోజూ ఆశతో ఎదురు చూస్తూనే వున్నాడు స్వామి - ఎవరైనా వస్తారని. కనీసం ఓ ఉత్తరపు ముక్క కూడా రాలేదు ఎక్కణ్ణుంచీను.

వాడి నిరాశ చూస్తే జాలివేసింది నాకు. బాగున్నప్పుడు రాబందుల్లా దోచుకున్న బంధువర్గం, వాడిప్పుడు బాధల్లో వున్నాడని తెలిసి సానుభూతి తెలుపకపోగా, కావాలని





వెలివేయడం బాధనిపించింది. ఆగ్రహం కూడా కలిగింది.

అందుకే స్వామికి తెలీకుండా మరో వార్తను ప్రచురింపజేశాను పత్రికలలో. 'స్వామికి ఆమధ్య లాటరీలో కోటి రూపాయలు వచ్చాయి. తెలిసిన బంధువులంటూ లేని కారణంగా తన తదనంతరం ఆస్తంతా అనాథశరణాలయాలకు రాసేయాలని నిశ్చయించుకున్నాడతను' - ఇదీ దాని సారాంశం.

అంతే!.. మూడో రోజునుంచే తీర్థప్రజలా న్నట్లు తెలిస్తే స్వామి వూరుకోడన్నాను. ఆ సంగతి అతనితో ముందుగా చెప్పనవసరం లేదంటూ, తాము స్వచ్ఛందంగా, అతనిమీది అభిమానంతో ఆ సహాయం చేస్తున్నట్లు కాగితం కూడా రాసిచ్చారు వాళ్లు - లాటరీ సొమ్ము రాగానే అంతకు పదింతలు స్వామి నుంచి రాబట్టుకోవచ్చునన్న దురాశతో.

నా పన్నాగం ఫలించింది. ఆ సొమ్ముతో స్వామికి కిడ్నీ ట్రాన్స్‌ప్లాంటేషన్ సక్సెస్‌ఫుల్‌గా జరిగిపోతుంది. ఆ తరువాత వారికి నిజం తెలిసినా ఫరవాలేదు. వారు అనుభ



స్వామి ఇంటికి రాసాగారు మనుషులు అతని బంధువులమని చెప్పుకుంటూ.

అయోమయంగా చూస్తున్న స్వామిని నోరుమెదపవద్దని చెప్పి, కథ నడిపించడానికి పూనుకున్నాను నేను.

"లాటరీ సొమ్ము చేతికందడానికి కొంత సమయం పడుతుంది. ఆలోపున కిడ్నీ ట్రాన్స్‌ప్లాంటేషన్‌కి మూడు లక్షలు బ్యాంక్ నుంచి అప్పు తీసుకోవాలనుకుంటున్నాడు స్వామి" అని చెప్పాను అందరితోను. ఆ సొమ్ము తామే సర్దుతామని పోటీపడ్డారంతా. వారివద్ద సొమ్ము అప్పుగా తీసుకు విస్తూన్నది స్వామి పిత్రార్జితమే కనుక వారి దగ్గర సొమ్ములు వూరికే తీసుకున్నారన్న ప్రసక్తిలేదు. వాళ్లు రాసిచ్చిన పత్రాలు కారణంగా లీగల్ యాక్షనూ సాధ్యంకాదు.. టిట్ ఫర్ టాట్!

స్వామి అభ్యంతరం చెప్పబోతే బలవంతంగా వాడి నోరు నొక్కేశాను.

- తిరుమలశ్రీ



# చతుర

సంపుటి:26 సంచిక:2 మార్చి 2003 302వ సంచిక

ఆమె ప్రయాణం అనంతం. గమ్యం అగమ్యగోచరమైనా, తొణికిసలాడే నిండైన ఆత్మవిశ్వాసం ఆమె ఆయుధం. మానవత్వమనే ఆమె బతుకుపుస్తకంలో పదాలన్నీ వ్యథలే అయినా... సువర్ణాక్షరాలుగా లిఖించాల్సినవవి. ఆమె ఒక అద్భుతం.

తల్లితండ్రుల గారాబుపట్టిగా పుట్టి... భర్తకు, అత్తమామలకూ కూడా ప్రాణప్రదంగా మెట్టినింట్లో మసిలిన ఆమె జీవితంలో ఎదురైన వింత సంఘటనలు, విచిత్ర మనస్తత్వాలు ఎలాంటివి?

ఆమె వాటిని ఎదుర్కొన్న వైనం... ఏమిటి? హృదయపు లోతులను స్పృశించే

సూరేపల్లి విజయ రచన

# అగమ్య

ఈ నెల చతుర సమగ్ర నవల.

వె లుతురులో దారి వెతుక్కునే వ్యక్తి కన్నా, చీకటిలో దారిని అన్వేషించే వ్యక్తే ధీశాలి. కష్టాలు ఎదురైనా, కడగండ్లు వెన్నంటి వున్నా, కష్టాలను ఇష్టాలుగా భావించి కన్నీళ్లను ఆనందబాష్పాలుగా మార్చుకుంటే...

విషాదం ఘనీభవించినా, విచారం గూడుకట్టుకున్నా, కన్నీటి మేఘం వర్షించినా, కలతల నిద్ర కలతపెట్టినా మనిషి ప్రయాణం ఆగదు, గమనం ఆగదు.

★ ★ ★

ధాత్రిని రాత్రి కమ్ముకున్న వేళ. ఊరంతా నిద్రపోతోంది. ఆ చిన్న ఇంట్లో అతను కంగారుగా అటూఇటూ తిరుగుతున్నాడు. అతని మొహంలో అలసటకన్నా, కంగారే ఎక్కువ కనిపిస్తోంది.

లోపల గదిలో మంత్రసాని వుంది. ఆ గదిలోనుంచి భార్య ప్రసవవేదన అతని గుండెని మెలిపెడుతోంది.

'దేవుడా! సృష్టిలో మనిషిని ఒక్కసారే పుట్టిస్తావని అంటారు. కానీ స్త్రీకి ప్రసవవేదనపెట్టి, మళ్లీ పునర్జన్మనిచ్చేలా చేస్తున్నావు. నా భార్యకు ఈ వేదననుంచి విముక్తి కలిగించు. నా భార్యకు సుఖప్రసవం అయ్యేలా చూడు' అని అతను దేవుణ్ణి వేడుకుంటున్నాడు.

బయట తుంపరగా మొదలైన వర్షం కుంభవృష్టిగా మారుతోంది.

ఆ చిన్న వూళ్లో ఆసుపత్రి కూడా లేదు. మంత్రసాని మీదే భారం వేశాడు. ఈలోగా మంత్రసాని బయటకు వచ్చింది. ఆమె మొహంలో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది.

"ఏమైందమ్మా? " అతను కంగారుగా అడిగాడు.

"బిడ్డ అడ్డం తిరిగిందేమోననిపిస్తోంది. ఎందుకైనా మంచిది, గవర్నమెంటాసుపత్రికి తీసుకు వెళ్దామా? " అడిగింది.

"ఇప్పుడా, ఈ వర్షంలోనా? కనీసం బండి కూడా లేదు" అతను కంగారు పడిపోయాడు.

మళ్లీ మంత్రసాని లోపలికి పరిగెత్తింది. అంత వర్షంలోనూ అతని మొహానికి చెమటపట్టింది. లోపల్నుంచి భార్య పడుతోన్న నొప్పుల తాలూకు కేకలు వినిపిస్తూనే వున్నాయి.

ఒక్కసారిగా ప్రకృతి ఊపిరి పీల్చుకున్నట్టు వర్షం ఆగిపోయింది. లోపల్నుంచి పసిబిడ్డ ఏడుపు వినిపించింది. అప్పటివరకూ అణిచిపెట్టుకున్న ఆందోళన మటుమాయమైనట్టు అనిపించింది.

మంత్రసాని బయటకువచ్చి "ఆడబిడ్డ... తల్లీ బిడ్డా క్షేమం" అని చెప్పింది.

అతను మంత్రసాని చేతులు పట్టుకుని "నా భార్యని, బిడ్డని కాపాడావు. నీ రుణం ఎలా తీర్చుకోవాలి? " అన్నాడు కృతజ్ఞతాపూర్వకంగా ఆమెవైపు చూస్తూ.

"మీరు విద్య నేర్పే గురువు. నా బిడ్డకు అక్షరంముక్కలు నేర్పిస్తున్నారు" అంది వినయంగానే మంత్రసాని.

★ ★ ★

"పాప ఎలా వుంది? " అడిగింది ఆమె.

భార్యవంక ప్రేమగా చూసి, ఆమె తల నిమిరి "అచ్చు నా పోలికే" అన్నాడు.

"నిజమా? ! ఆడపిల్లకు తండ్రి పోలికవస్తే అదృష్టమట. పైగా మీ తెలివి కూడా వస్తుందట" భర్తచేతిని చెంపకు ఆన్చుకుని అందామె.

భావనారాయణ భారంగా నిట్టూర్చి "ఈ ప్రపంచంలో ఎవరి తలరాత ఎలా వుంటుందో ఆ పైవాడికే తెలియాలి. మన బిడ్డ నుదుట ఆ దేవుడు ఏ రాత రాశాడో" అన్నాడు.

★ ★ ★

బారసాల జరుగుతోంది.

"అమ్మాయికి ఏం పేరు పెడతారు? " అడిగింది భర్తను ప్రభావతి.

భావనారాయణ ఒక్కక్షణం ఆలోచిం





చాడు. అతనికి కూతురికి ఏం పేరు పెట్టాలో అర్థంకాలేదు. అప్రయత్నంగా అతని నోట్లోనుంచి ఓ పేరు వచ్చింది 'అగమ్య'అని. అతనే ఉద్దేశంతో ఏ క్షణాన ఆ పేరు పెట్టాడో... అగమ్య జీవన గమనాన్ని ఆ పేరు ఎటు మళ్లిస్తుందో ఆ క్షణం తెలియదు.

★ ★ ★

చిన్నతనంనుంచి అగమ్య పద్ధతిగా పెరిగింది. చదువులో ఏకాగ్రత, పనిలో శ్రద్ధ, పెద్దవాళ్ల దగ్గర వినయం - ఇవన్నీ ఆమెకు స్వతహాగా అబ్బిన విషయాలు.

పదేళ్ల వయసులోనే ఓరోజు తల్లికి జ్వరం వచ్చింది. పొయ్యిమీద అన్నం మాడుతోంది. తల్లి లేవలేకపోతోంది. తనే వెళ్లి పొయ్యి ఆర్పి చిన్నచేతులతో అన్నం గిన్నె దించింది.

ఇంట్లో తల్లికి చిన్నచిన్న పనులు చేసిపెట్టడం, తండ్రికి చొక్కా అందించడం, టీ కాచివ్వడంలాంటి పనులన్నీ అగమ్య చకచకా చేస్తోంటే భావనారాయణ కూతురి పనితనాన్ని చూసి ముచ్చటపడిపోయాడు.

ఓరోజు ఓ సంఘటన జరిగింది.

అగమ్య నాలుగో క్లాసు చదువుతోంది. ఇల్లు దూరంగా వుండడంతో పొద్దున్నే టిఫిన్‌బాక్స్ స్కూల్‌బ్యాగులో పెట్టివ్వడం అలవాటు.

ఓ అమ్మాయి మధ్యాహ్నం అన్నం తినకుండా స్పృహతప్పి పడిపోయింది. ఆ అమ్మాయి ఉదయం ఇంట్లో కూడా ఏమీ తిని రాలేదు.

అగమ్య తన బాక్స్‌లో వున్న అన్నం ఆ అమ్మాయికి పెట్టింది. మాస్టారు వచ్చి ఈ విషయం అగమ్య తండ్రి భావనారాయణకి చెప్పాడు.

స్కూల్లో అగమ్యతోపాటు చదువుకునే అమ్మాయి తల్లి వచ్చి భావనారాయణ పాదాలమీద పడిపోయి "మీ అమ్మాయి నా కూతురికి అన్నం పెట్టింద"ని చెప్పి కంట తడిపెట్టింది.

భావనారాయణ కూతుర్ని తన ఒడిలో కూచోబెట్టుకుని కళ్లు తడి అవుతుండగా కూతుర్ని ముద్దాడి "ఎంత ఎదిగిపోయావురా! మానసిక పరిపక్వత వచ్చినవాళ్లకు కూడా మనసొప్పని పని నువ్వు చేశావు. అన్నం పరబ్రహ్మ స్వరూపం. ఈరోజు అన్నంపెట్టి ఒకరి ప్రాణాన్ని రక్షించావు. ఆ దేవుడు నీకు మేలు చేస్తాడు తల్లీ" అంటూ ముద్దాడాడు.

అగమ్య తల్లి ప్రభావతి కూతురికి దిష్టి తీసింది.

అగమ్య చిన్నతనంనుంచే తన వ్యక్తిత్వాన్ని ప్రోది చేసుకుంటూ వచ్చింది. ఆమెని ఇష్టపడనివారు వుండరు. ఒక్కమాటలో చెప్పాలంటే అగమ్య అజాత శత్రువు. అందరి తలల్లో నాలుకలా వుండిపోతుంది.

కూతుర్ని మందలించాలన్నా, పరుషంగా మాట్లాడాలన్నా తల్లిదండ్రుల్లో ఎవరికీ ఆ అవకాశం దొరకలేదు.

కాలం ఆగదు. అదో ప్రవాహం. అందులో రోజులు, నెలలు, సంవత్సరాలు పరిగెడుతూనే వుంటాయి.

★ ★ ★

ఆకాశానికి, భూమికి మధ్య చీకటి పరదాలు వేలాడుతున్నాయి. రాత్రి పదకొండు దాటింది. కిటికీగుండా బయటకు చూస్తోంది అగమ్య. బయటినుంచి చలిగాలి రివ్వున దూసుకువస్తోంది. కిటికీ ద్వారా లోపలికి ప్రవేశించిన ఆ చలిగాలి ఆమె శరీరాన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

చలికాలం కావడంవల్ల ఆ కాలనీలో చాలామంది ఎప్పుడో ముసుగు తన్నేశారు.

రాత్రి ఆమెకు భిన్నరూపాల్లో కనిపిస్తుంది. ఆమె ఆలోచనల్లో రాత్రి వైరుధ్యభావాలను ఆవిష్కరిస్తుంది. ప్రపంచాన్ని నిద్రపుచ్చేది రాత్రి. చీకటి తప్పులు చేయించేది రాత్రి. విశ్రాంతినిచ్చేది రాత్రి. విధ్వంసాలని సృష్టించేది రాత్రి. ఈ నిశివేళలో ఎన్ని

అద్భుతాలు?! ఎన్ని ప్రమాదాలు?! మరెన్ని ప్రమోదాలు?! అన్నింటికీ ఈ రాత్రి సాక్షీభూతం. అన్నింటికీ ఈ రాత్రి సాక్షి సంతకం.

మౌనంగా వున్నట్టే వుంటుంది. ప్రపంచాన్ని నిశ్శబ్దమయం చేస్తుంది.

ప్రతిరోజూ ఈ టైంలో కాలేజీ పుస్తకాలు చదువుకునే అగమ్య ఈరోజు తన దృష్టిని పుస్తకాలమీద నిలపలేకపోతోంది.

కళ్లముందు తన స్నేహితురాలు, మానస కనిపిస్తోంది. ఆరోజు మధ్యాహ్నం కాలేజీలో అన్యమనస్కంగా వుంది మానస. లంచ్‌బెల్ తరువాత తను అడిగింది.

మానస కళ్లు ఎర్రబడి వున్నాయి.

"మానసా... ఏమైంది?" అని ఆమె పక్కనే కూచుంటూ అడిగింది.

"ఏ...ఏంలేదు" చెప్పింది మానస.

"ఏమీ లేకుండా వుండదు. ఏదో వుంది" అంది అగమ్య.

"ఛ ఛ... ఏమీలేదని చెప్పానుగా" అంది తల దించుకునే.

"నువ్వు తల దించుకొని మాట్లాడుతున్నావంటే ఏదో తలవంపు పని చేసినట్టే...ఏదో తప్పు జరిగింది" అంది అగమ్య.

"అగమ్యా"

"చెప్పు మానసా... మనమధ్య పెద్ద ఫ్రెండ్షిప్ లేకపోవచ్చు కానీ కొన్నాళ్ళుగా కలిసి చదువుకుంటున్నాం. ఆమాత్రం నాకు చెప్పకూడదని నువ్వు అనుకుంటే నీ ఇష్టం" అంది నిష్ఠూరంగా అగమ్య.

"సారీ అగమ్యా" అంది తలొంచుకునే మానస.

"లవ్ ఫెయిల్యూరా?" అడిగింది సూటిగా అగమ్య.

"నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగింది మానస.

"ఈ వయసులో అమ్మాయి బాధ పడుతుంటే అది చదువుకు సంబంధించిన సమస్య అయి వుండదు. ఆర్థిక సమస్య అనుకుందామా? అంటే వెల్ సెటిల్డ్ ఫ్యామిలీ... మిగిలిన సమస్య లవ్ ఎఫయిర్?" చెప్పింది అగమ్య.

ఒక్కక్షణం అగమ్య ఎనాలిసిస్‌కు ముచ్చటేసింది. సమస్యను అన్ని కోణాలనుంచి ఆలోచించే అగమ్య అంటే మానసకే కాదు, ఆ క్లాసులో ఆ ఆమాటకొస్తే కాలేజీలో చాలామందికి ఇష్టమే.

"రాజేష్ తెలుసుకదా" అంది మానస.

"అప్పుడప్పుడు నీ కోసం బైక్ మీద వస్తూ వుంటాడు. ఓసారి బావనవుతానని మరోసారి మామ వరుస అని చెబుతాడు, అతనే కదూ"

"అవును" చెప్పింది మానస.

"పెళ్ళి చేసుకోనని అంటున్నాడా?" అడిగింది అగమ్య.

"వాళ్ళింట్లో ఒప్పుకోవడంలేదుట"

"అందుకని... నీకు సారీ చెప్పాడా?"

"అవును, నువ్వు చూసినట్లే మాట్లాడుతున్నావు?"

"ఇలాంటి సమాధానాల కోసం మనం బుర్రబద్దలు కొట్టుకోవలసిన అవసరంలేదు"

"అతన్ని తప్ప నేను మరొకర్ని పెళ్లి చేసుకోలేను" చెప్పింది వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

"వాళ్ల పేరెంట్స్ ఎందుకు ఒప్పుకోవడంలేదట?"

"ఆల్రెడీ అతనికో సంబంధం చూశారట"

"పోనీ అంతగా అతను నిన్ను వద్దని అనుకుంటున్నప్పుడు నువ్వుమాత్రం అతడి కోసం వెపర్లాడ్డం ఎందుకు? వదిలెయ్. నీకు అందం, చదువు, డబ్బు అన్నీ వున్నాయ్"

"అతనంటే నాకు ఇష్టం"

"ఆ ఇష్టం అతనికి కూడా వుండాలి"

"ఇప్పుడతను నన్ను ఇష్టపడకపోయినా, నేను పెళ్లి చేసుకోక తప్పదు"

"ఎన్నో నెల?" కూల్‌గా అడిగింది అగమ్య.





విస్మయంగా చూసి తలవంచుకుని చెప్పింది మానస "మూడోనెల"

మానస భుజంమీద చేయేసింది అగమ్య. అప్పుడు తన్నుకొచ్చింది దుఃఖం. అగమ్య ఒడిలో తలపెట్టి ఏడ్చింది. అది పబ్లిక్ ప్లేసని, ఎవరైనా తమని గమనించే అవకాశం వుందని తెలిసి కూడా.

"మానసా... వూర్కో. నువ్వు తొందరపడి వుండాల్సింది కాదు. ఇప్పుడు ఆ తొందరపాటును సరిదిద్దుకోవాలి. రాజేష్‌తో నేను మాట్లాడుతాను" ధైర్యం చెప్పింది అగమ్య.

"నేను ఎంతగానో కన్విన్స్ చేసి చూశాను. అతను వాళ్ళ పేరెంట్స్‌కు భయపడుతున్నాడు. నాకు చావు తప్ప మరో మార్గం లేదు" ఏడుస్తూనే అంది మానస.

"ఈ ప్రపంచంలో సమస్యలకు చావు ఒక్కటే మార్గం అని నువ్వనుకుంటే ఈపాటికి ప్రపంచ జనాభా వేలసంఖ్యని దాటివుండేదికాదు. సమస్యల నుంచి విముక్తి పొందడానికి 'చావు'ను ఆశ్రయించడం కాదు. సమస్యల మూలాలను ఛేదించాలి. సమస్యను ఎదుర్కోవాలి. రాజేష్ విషయం నాకు వదిలేయ్" అంది అగమ్య.

మానసకు ఇంకా అపనమ్మకంగా వుంది. తనెంత ఏడ్చి ప్రాధేయపడ్డా తను నిస్సహాయుడ్ని అన్న రాజేష్ ఇప్పుడు అగమ్య చెబితే వింటాడా?

అగమ్య మానసతో చెప్పింది "ముందు మొహం కడుక్కో... కాస్త తిను... బిహేవ్"

★ ★ ★

రాజేష్‌ని ఎలా టాకిల్ చేయలా అని ఆలోచిస్తోంది అగమ్య.

చాలా సున్నితమైన సమస్య. ప్రేమ అనే పదం గుర్తొస్తేనే ఆమెకు చిత్రమైన నవ్వు పెదవులపై కదలాడుతుంది.

నిద్ర రావడంలేదు. కళ్ళముందు మానస దీనంగా నిలబడిన సన్నివేశమే కనిపిస్తోంది. అయిదు నిమిషాలపాటు అలానే కళ్ళు మూసుకుండిపోయింది అగమ్య. ఏ పన్నెండింటికో అలా నిద్రలోకి జారుకుంది.

రాజేష్ సోఫాలో కూచొని ఆవాళ్టి డైలీపేపర్ చదువుకుంటున్నాడు. అతనికి చికాగ్గా వుంది. మానస వ్యవహారం అతడ్ని ఆ చికాక్కు గురిచేస్తోంది.

రాజేష్ తల్లి కిచెన్‌లో టిఫిన్ ప్రిపేర్ చేస్తోంది.

తండ్రి జగన్నాథం ఏవో ఆఫీసు ఫైల్స్ వెతుక్కుంటున్నాడు.

సరిగ్గా అప్పుడు ఆ ఇంట్లో ఎంటరైంది అగమ్య.

ఇంట్లోకి ఓ అపరిచిత అమ్మాయి రావడం చూసి జగన్నాథం ఆశ్చర్యంగా అగమ్యవైపు చూసి.

"ఎవరమ్మా... నువ్వు?" అని అడిగాడు. అతనిలో చిన్న అనుమానం. కొడుకు ప్రేమించానని చెబుతున్న అమ్మాయి కాదు కదా? ఒకవేళ ఆ అమ్మాయే అయితే ఎలా మాట్లాడాలి?

"నమస్తే..." రెండు చేతులు జోడించి అంది.

అప్రయత్నంగా "నమస్తే" అన్నాడు జగన్నాథం.

"నా పేరు అగమ్య" చెప్పింది అగమ్య.

"మీరు ఏంపని మీద వచ్చారు?" జగన్నాథం అడిగాడు. అప్పటికే రాజేష్‌లో తడబాటు.

"నేను ఏంపనిమీద వచ్చానో మీ అబ్బాయిని అడగండి" అంది అగమ్య.

"మా అబ్బాయినా? మీరేం పనిమీద వచ్చారో మావాడికి ఎలా తెలుస్తుంది?" జగన్నాథం అయోమయంగా అన్నాడు.

"నేను మానస స్నేహితురాలిని. మానస అంటే ఎవరో మీకు తెలిసే వుండాలి. మీ అబ్బాయి ప్రేమించిన అమ్మాయి"

"ఓహో... ఆవిడ తరపున రాయబారానికి వచ్చావా?" అడిగాడు కాస్త కటువుగానే.

"రాయబారానికి కాదు. పెళ్ళి విషయం మాట్లాడ్డానికి వచ్చాను" అంది అగమ్య.

"మా అబ్బాయిని ఆ అమ్మాయికి ఇచ్చి పెళ్లిచేస్తానని నేను అన్లేదే"

"కానీ ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటా నని మీ అబ్బాయి అన్నాడు"

"వాడు మగాడు... సవాలక్ష అంటాడు" జగన్నాథం అడ్డంగా వాదించబోయాడు.

వెంటనే తీవ్రంగా స్పందించింది అగమ్య.

"మగాడైతే... సవాలక్ష అనాలని రూల్ వుందా? ప్రేమ పేరుతో మోసం చేయాలని ఎక్కడైనా రాసివుందా? ఆ అమ్మాయిని ప్రేమించే ముందు మీ అబ్బాయి అమాయ కుడా? "

అగమ్య ఆవేశం చూసి కాస్త బెదిరిపో యాడు జగన్నాథం... అయినా బింకంగా అన్నాడు.

"మా అబ్బాయికి వేరే సంబంధం చూశాం"

"కేవలం పరిచయం వరకే మీ అబ్బా యితో, ఆ అమ్మాయి సాన్నిహిత్యం ఆగి పోతే వచ్చే నష్టం ఏమీలేదు కానీ ఇప్పుడా అమ్మాయి ప్రెగ్నెంట్" చెప్పింది అగమ్య.

జగన్నాథం ఒక్కక్షణం షాక్ అయ్యాడు.

అయినా వెంటనే తన ఉలికిపాటును కప్పిపుచ్చుకుంటూ "అయితే ఏమిటి? " అన్నాడు.

"మీ అబ్బాయివల్ల ఆ అమ్మాయి పెళ్ళి కాకుండానే తల్లి కాబోతోంది. మీ అబ్బాయి చేసిన తప్పుకు ఆ అమ్మాయి జీవితం నాశనం కాకూడదు"

"అది ఆ అమ్మాయి కాలుజారే ముందు ఆలోచించాలి" అన్నాడు, ఏమనాలో తోచక జగన్నాథం.

"ఆ తప్పులో మీ అబ్బాయి ప్రమేయమూ వుంది. తప్పు ఇద్దరు కలిసి చేసినప్పుడు శిక్ష ఆ అమ్మాయి ఒక్కతి మాత్రమే అనుభవిం చాలని చెప్పడం పాశవికం" అంది అగమ్య.

"అయితే ఇప్పుడేమంటావ్? "

"మీ అబ్బాయికి, మానసకి పెళ్ళి చేయండి. మీ పెద్దరికం నిలుపుకోండి"

"పెళ్ళి చేయకపోతే..."

"కాలేజీ అమ్మాయిలంతా మా స్నేహితు రాలికి మద్దతుగా మీ ఇంటిముందు నిరహా రదీక్ష చేస్తారు" కటువుగానే చెప్పింది అగమ్య.

ఒక్కక్షణం ఆ మాటలతో బెదిరిపో యాడు.

"కానీ ఆల్రెడీ మా అబ్బాయికి మరో సంబంధం చూశాం. వాళ్లు నిశ్చయ తాం బూలాలు కూడా పుచ్చుకున్నారు"

"పెళ్ళిపీటల మీదే ఎన్నో పెళ్ళిళ్లు ఆగిపో తున్నాయి. దీనివల్ల ఆ అమ్మాయికి జరిగే నష్టంకన్నా పెళ్ళి కాకుండా తల్లి కావడంవల్ల నా స్నేహితురాలికి జరిగే నష్టమే ఎక్కువ" స్థిరంగా చెప్పింది అగమ్య.

జగన్నాథం కొడుకు వంక చూశాడు.

అగమ్య రాజేష్ దగ్గరికి వచ్చింది.

"చూడండి రాజేష్... ప్రేమ ప్రేమించుకు నేటప్పుడు ఒక ఆకర్షణే కావచ్చు. ఒక్కట య్యేప్పుడు ఒక శారీరక అవసరమే కావచ్చు కానీ ఒక్కసారి మనసు, శరీరం రెండూ కలి శాక అది శాశ్వత బంధం అవుతుంది. మి మ్మల్ని నమ్మి మానస తన సర్వస్వం అర్పిం చింది.

మానసకు ఒకవేళ అన్యాయం అంటూ జరిగితే నేనే కాదు. కాలేజీలో ఎవ్వరూ చూస్తూ ఊరుకోరు. మీరే నిదానంగా ఆలో చించండి.

మానసను ఇష్టపడే కదా ప్రేమించారు. పోనీ ప్రేమించే ముందు మీ వాళ్ళను సంప్రదించారా? ఒకవేళ మీ ఇంట్లో వాళ్ళు ఒప్పుకోకపోతే, నేను నిన్ను చేసుకోలేనని మానసకు చెప్పారా?

శారీరకంగా మీరూ మానస ఒక్కటయ్యే ముందు మీకు మీ అమ్మా, నాన్నలు, మీ ముందు వున్న సమస్యలు గుర్తుకు రాలేదా? మిమ్మల్ని ప్రేమించి, మీ కోసం తనని తాను అర్పించుకున్న అమ్మాయిని వదిలేసి, ఇప్పుడు మరో అమ్మాయిని చేసు

కోవడం భావ్యమా? "

అగమ్య మాటలు వింటూ తలదించుకు న్నాడు. అగమ్య మాటలో లాలన వుంది. హెచ్చరిక వుంది. జరగబోయే వాస్తవం వుంది. జరగవలసింది ఏమిటో చెప్పే కమాండ్ వుంది.

జగన్నాథం ఒక్కక్షణం ఆలోచించాడు. ప్రస్తుత పరిస్థితుల్లో అతనికే మార్గమూ కన్పించలేదు.

"చూడండి జగన్నాథంగారూ... నేను మీతో గొడవ పెట్టుకోవడానికి రాలేదు. వాస్తవ పరిస్థితి వివరించి, మీ అబ్బాయివల్ల మోసపోయిన అమ్మాయికి న్యాయం జరిపించమని అడగడానికి వచ్చాను. ఇదే పరిస్థితి మీ అమ్మాయికి ఎదురయితే మీ రియాక్షన్ ఎలా వుంటుంది?

మీకు డబ్బుకు లోటు లేదు. మీక్కావలసింది మీ అబ్బాయి హేపీగా వుండడమే. ఆ హేపీనెస్ అతనికి తను ప్రేమించిన అమ్మాయి ద్వారా లభిస్తున్నప్పుడు మీరెందుకు అతని సంతోషాన్ని హరించాలని ప్రయత్నిస్తారు? "

అగమ్య మాటల్లోని 'వాడి'లో వున్న లాజిక్ జగన్నాథానికి అర్థమవుతూనే వుంది. అగమ్యని వేలెత్తి చూపలేని పరిస్థితి, ఆమె వాదనను కొట్టిపారేయలేని స్థితి.

ఒక నిశ్చయానికి వచ్చాడు జగన్నాథం.

"చూడమ్మా అగమ్యా... చిన్నదానివైనా చక్కగా మాట్లాడావ్. నీ మాటలు, నన్ను నువ్వు కన్విన్స్ చేసిన తీరు బాగా నచ్చాయి.

లాజికల్‌గా ఆలోచిస్తే నువ్వు చెప్పిందే కరక్ట్. మొండిగా నేను ఆర్గ్యూ చేయదల్చుకోలేదు. తప్పును సరిదిద్దుకుంటున్నాను. నా తొందరపాటు నిర్ణయాన్ని ఒప్పుకుంటున్నాను" మనస్ఫూర్తిగా అన్నాడు.

"థాంక్యూ సార్... ఇందులో నా గొప్పతనం కన్నా, మీ గొప్పతనం ఎక్కువగా కనిపిస్తోంది. వాస్తవాన్ని గమనించారు. నిజాయితీగా మీ తప్పును ఒప్పుకున్నారు. ఇంత తొందరగా మీవైపునుంచి సమ్మతి లభిస్తుందని నేను అనుకోలేదు" సంతోషంగా, కృతజ్ఞతా పూర్వకంగా చెప్పింది అగమ్య.

"నిన్ను పెళ్ళిచేసుకునేవాడు అదృష్టవంతుడు అగమ్యా. పరిస్థితిని సమీక్షించి మంచి చెడ్డలను విశ్లేషించే నీలాంటి వ్యక్తి భార్యగా దొరికితే, ఆ మగాడు ఖచ్చితంగా అదృష్టవంతుడే" అన్నాడు జగన్నాథం.

ఒక్కక్షణం అగమ్య మొహం ఎర్రబడింది ఆ కాంప్లిమెంట్‌కు.

★ ★ ★

మానస, రాజేష్‌ల పెళ్ళి సింపుల్‌గా రిజస్టర్ ఆఫీసులో జరిగింది. అగమ్యే పూనుకొని, మానస తల్లిదండ్రులను ఒప్పించింది.

అప్పగింతల కార్యక్రమాలు పూర్తయ్యాక మానస అగమ్య దగ్గరికి వచ్చింది.

కిందికి వంగి అగమ్య పాదాలకు నమస్కారం చేయబోయింది.

"ఏయ్ మానసా... ఏమిటిది? " కంగారుగా అంది తన కాళ్ళను వెనక్కి తీసుకుంటూ అగమ్య.

"అగమ్యా...నాకు తల్లి స్థానంలో వుండి, మేలు చేశావు. తండ్రిగా బాధ్యత స్వీకరించి నా పెళ్ళి చేశావు. ఓ సోదరుడిలా నా గురించి ఆలోచించావు. ఓ తోబుట్టువులా శ్రద్ధ తీసుకున్నావు. నీకు కృతజ్ఞతలు ఎలా చెప్పాలో అర్థంకావడంలేదు" చెమర్చే కళ్ళతో అంది మానస.

"మానసా... నేను కృతజ్ఞతలు ఆశించే మనిషినికాను. నా పరిధిలో నేను చేయగలిగిన సాయం చేశాను, దట్సాల్" అంది అగమ్య.

"లేదు అగమ్యా, నీ స్థానంలో నేను వుంటే ఇలాంటి రిస్కులు తీసుకునేదాన్ని కాదు. నాకెందుకు పోనిమ్మని పూర్కునేదాన్ని" రెండు చేతులు జోడించి అంది మానస.

"వదిలేయ్ మానసా... ఇప్పుడన్ని ప్రాబ్లమ్స్ సాల్వ్ అయ్యాయి. బీ హేపీ,







విష్ యు హేపీ మ్యారీడ్ లైఫ్" మానస చేతిని స్నేహపూర్వకంగా నొక్కి అంది అగమ్య.

ఆరోజు రాత్రి తండ్రికి జరిగినదంతా చెప్పింది.

"నా చిట్టితల్లీ, నువ్వేం చేసినా మంచే చేస్తావు. నువ్వసలు నాకు తల్లిగా ఎందుకు పుట్టలేదురా? " కూతురి తల నిమురుతూ అన్నాడు ప్రేమగా భావనారాయణ.

అగమ్య నేలమీద కూచొని తండ్రి ఒడిలో తలపెట్టి కళ్ళు మూసుకుంది నిశ్చింతగా. తండ్రి ఒడిలో నిశ్చింత అనిపిస్తుంది. నాలుగైదు రోజులగా మానసవల్ల ఏర్పడిన టెన్షన్‌నుంచి రిలాక్సవుతూ వుంది.

మానస సమస్య ఇంత త్వరగా సాల్వ్ అవుతుందని అనుకోలేదు.

"ఏరా చిట్టికన్నా అందరి గురించి ఆలోచించే నువ్వు నీ గురించి ఎప్పుడైనా ఆలోచించుకుంటావా? " తండ్రి అడిగాడు.

కళ్ళు తెరిచి తండ్రివైపు చూసి అంది.

"నీకా అనుమానం ఎందుకొచ్చింది నాన్నా? "

"మనిషి భారాన్ని దించి, గుండె బరువును తగ్గించి, మనసులో గూడు కట్టుకున్న విషాదాన్ని నేలరాలి ఆత్మార్పణ చేసుకొని తమ యజమాని బాధల బరువును తగ్గించే కన్నీటిచుక్క చివరికి నేల రాలిపోతూ కూడా తన యజమాని గుండె బరువు తగ్గించినందుకు ఆనందపడిపోతూ వుంటుందిట... ఎక్కడో చదివాను"

"నాన్నా"

"నిన్ను చూస్తోంటే నాకా వాక్యాలు గుర్తుకు వస్తున్నాయి. నిన్ను చూస్తే నాకు ఒక్కోసారి మా అమ్మ గుర్తుకొస్తుందిరా" అన్నాడు కూతురి తలమీద తన తలపెట్టి.

★ ★ ★

అగమ్య కాలేజీకి బయల్దేరింది.

"కాసింత ఎంగిలిపడి వెళ్లమ్మా" కాలేజీ బుక్స్ చేతిలో పట్టుకుని బయటకు వెళ్తోన్న కూతుర్ని ఉద్దేశించి అంది అగమ్య తల్లి.

"ఆకలిగా లేదమ్మా. ఇవాళ ఒకటే క్లాసు, తొందరగా వచ్చేస్తానుగా. వెళ్లొస్తానమ్మా" అంటూ ఓసారి తండ్రి గదిలోకి చూసి

"నాన్నగారూ! నేను కాలేజీకి వెళ్తున్నాను" చెప్పింది అగమ్య.

"మంచిది తల్లీ, జాగ్రత్త. రోడ్డుమీద అటూ, ఇటూ చూసి నడువు. అసలే రోజులు బాగాలేవు" చెప్పాడు తన కళ్లజోడు సవరించుకుంటూ తండ్రి భావనారాయణ.

స్కూల్ హెడ్‌మాస్టర్‌గా రిటైరయ్యాడు. ప్రస్తుతం అతని కాలక్షేపం భగవద్గీతే. కూతురికి సవాలక్ష జాగ్రత్తలు చెబుతాడు. ఎదిగిన ఆడపిల్లను ఓ అయ్య చేతిలో పెట్టే వరకూ జాగ్రత్తగా చూసుకోవాలని అతని ఉద్దేశం.

అందులోనూ అగమ్యది కళ్లు తిప్పుకోలేనంత అందం. కనుముక్కుతీరు, శరీర సౌష్టవం నిండుగా వుంటుంది. ఇట్టే అందర్నీ ఆకర్షించే అందం.

అగమ్య కాలేజీకి బయల్దేరింది.

చదువు ఆమె ఆరోప్రాణం. బాగా చదువుకోవాలనీ, గొప్పపేరు తెచ్చుకోవాలనీ జీవితంలో ఎదగాలని కోరిక. ఆ వయసులో ఆమెకు ఇలాంటి అభిప్రాయం వుండడం తప్పేమీ కాదు.

తన పని ఏమిటో తను చేసుకువెడుతుంది. ఎవరి విషయంలోనూ జోక్యం చేసుకోదు.

సహజంగా ఈ వయసులో వుండే ఆకర్షణ, పరస్పర ప్రేమానుభవాలు ఆమెకు లేవు. ఇల్లు, కాలేజీ... ఈ రెండూ తప్పించి ఆమెకు మరో ప్రపంచం తెలియదు.

"అగమ్యా! నిన్ను చూస్తోంటే నాకు జెలసీగా వుంటుంది" అగమ్య స్నేహితురాలు అంది.

"ఎందుకు? " అగమ్య అడిగిందా స్నేహితురాలిని.

"అందం, చదువు, తెలివి అన్నీ నీ ఒక్కదానికే ఇచ్చాడేమో ఆ దేవుడు"

"అందం అశాశ్వతం. వయసుతోపాటు అందమూ దాని సౌకుమార్యాన్ని కోల్పోతుంది. చదువు, తెలివి అంటావా మనం కాన్‌సెంట్రేట్ చేస్తే ఆటోమేటిగ్గా మనదగ్గరికి నడుచుకుంటూ వచ్చేస్తాయి" తేలిగ్గా అంది అగమ్య.

"నువ్వెన్నయినా చెప్పు నిన్ను చూస్తోంటే జెలసీగా వుంటుంది. అన్నట్టు నీకో విషయం తెలుసా? "

"ఏంటీ? " ఏమాత్రం ఆసక్తి చూపించకుండా అడిగింది

తనపని, తన చదువు తప్ప అనవసర విషయాల్లో ఆసక్తి చూపించకూడదని ఆమె తండ్రి మాటలద్వారా తెలుసుకుంది.

పక్కగదిలోకే కాదు వారి మనసుగదిలోకి కూడా తొంగిచూడకూడదన్నది ఆమె నిశ్చితాభిప్రాయం.

"వారం రోజులుగా నిన్నో అబ్బాయి అబ్జర్వ్ చేస్తున్నాడు"

"నన్నా? " ఆశ్చర్యంగా అడిగింది అగమ్య.

అంతకన్నా ఆశ్చర్యంగా చూసి "బావుంది





నీవెంట ఎవరో అబ్బాయి పడుతున్నాడన్న విషయం నీకు తెలియకపోవడం చోద్యం కాకపోతే మరేమిటే అగమ్యా? అదే నేన యితే నా వెంట ఓ అబ్బాయిపడ్డం చూసి గర్వంగా ఫీలయ్యేదాన్ని"

అగమ్య నవ్వి "ఈ వయసులో ప్రేమలు, వెంటపడ్డాలు అంతా బాగానే వుంటుంది. ఎటూ తేల్చుకోలేని ఆకర్షణ కలిగించే వయసిది" అంది.

"నీదంతా చాదస్తం. అయినా పెద్దవాళ్లు అనాల్సిన మాటలు నువ్వంటావేంటి? "

"పోనీ ఇక ఆ టాపిక్ వదిలేద్దామా? " అంది అగమ్య, ఆ విషయాన్ని మరింత పొడిగించడం ఇష్టంలేనట్లు.

ఆ స్నేహితురాలు అగమ్యవంక విచిత్రంగా చూసింది. అగమ్య ఆమెకు ఓ పజిల్లా కనిపిస్తుంది. ఎప్పటికీ అర్థంకాదు అనిపిస్తుంది.

స్టాఫ్‌రూంలో పాణిగ్రాహి ఒక్కడే వున్నాడు. అతని చేతిలో కాంపిటీషన్ సక్సెస్ మేగజైన్ వుంది. చాలా సాదాసీదాగా వుండే పాణిగ్రాహి, ఆ క్షణం చిత్రమైన ఘర్షణకు లోనవుతున్నాడు.

అతనికి తెలిసి తనకేమీ బలహీనతలు లేవు. ఇల్లు, కాలేజీ, అమ్మానాన్న, తమ్ముడు, చెల్లెలు... బాధ్యత... వాటి చుట్టూ చట్రం బిగించేసుకునే పాణిగ్రాహికి ఒకప్పుడు చదువు టార్గెట్. ఆ తర్వాత బ్రతుకుతెరువు టార్గెట్.

అందరితో కలివిడిగా వుండలేడు. జోకులు వేయడం, కామెంట్స్ విసరడం అతనికి తెలియవు. తెలుగు మేడమ్ అతడికి ముద్దపప్పు అని ముద్దుగా నిక్‌నేమ్ తగిలించింది.

చదువులో బ్రిలియంట్ పాణిగ్రాహి. కాలేజీ రోజుల్లోనే టీచింగ్‌లో కూడా అతనికున్న అపరిమిత బోధనాశక్తి గురించి అందరూ ఏకగ్రీవంగా, గర్వంగా చెప్పుకుంటారు.

ఉదయం ఇంట్లోనుంచి వంచిన తల ఎత్తకుండా బయల్దేరే పాణిగ్రాహి తిరిగి కాలేజీ అటెండెన్స్ రిజిష్టర్‌లో సంతకం పెట్టేప్పుడు కాలేజీలోవున్న గోడగడియారం వంక చూసేప్పుడు మాత్రమే తలెత్తుతాడు.

హిస్టరీ లెక్చరర్ ఓసారి తలెత్తవయ్యా బాబూ అంటే నవ్వి వూరుకున్నాడు.

పాణిగ్రాహికి ప్రేమ ఎలా వ్యక్తపరచాలో కూడా తెలియదు. దానిక్కారణం అతను తెలుగులో పుంఖానుపుంఖాలుగా వచ్చిన ప్రేమ నవలలు చదవకపోవడం ఒక కారణం. ఆర్థిక పరిస్థితి, చిన్నప్పట్నుంచీ పెరిగిన వాతావరణం, తనంతట తనుగా ఏర్పరచుకున్న సెల్ఫ్ డిసిప్లిన్ అతడ్ని అలాంటి నవలలకు దూరంగా వుంచాయి.

మరో బలమైన కారణం సినిమాలు కూడా. మీరెప్పుడు సినిమా చూశారని అడిగితే, అతను తడుముకోకుండా చెప్పగలడు. ఓ కీలుగుర్రం, బాలరాజు, చెంచులక్ష్మి, విప్రనారాయణ... అలాంటి సినిమాలు ఎప్పుడెప్పుడు ఏయే పరిస్థితుల్లో చూశాడో టపీమని చెప్పగలడు.

సినిమాకు వెళ్దామని కొలీగ్ అడిగినా అతను రానని కరాఖండీగా చెప్పగలడు. అలాంటి పాణిగ్రాహికి ఈమధ్య ప్రేమపట్ల ఒక రకమైన అభిప్రాయం కలిగింది.

ప్రేమమీద అభిప్రాయం కలగడం వేరు, ఆ ప్రేమను అనుభవంగా మార్చుకుని, అనుభవైకవేద్యం చేసుకోవడం వేరు.

ఇప్పుడు పాణిగ్రాహి ఆ సమస్యతో సతమతమవుతూ వుండిపోయాడు.

అగమ్య అంటే అతనికి ఇష్టం కలిగింది. అగమ్యమీద ప్రేమ పెంచుకున్నాడు. ఆ ప్రేమ ఎందుకు, ఎలా ఏర్పడిందో అడిగితే ఇతమిద్ధంగా అతను చెప్పలేడు.

అతనిలో చిన్న కంపనం... వేలవేల ప్రకంపనాలైంది. అగమ్యపట్ల ఏర్పడ్డ ప్రేమ అతనికి కొత్తరకమైన అనుభూతిని ఇచ్చింది. పుట్టి బుద్దెరిగాక అతనికి ఇంతగా కావాలను

## సచిత్ర విచిత్రం





# అపురూపమైన మండూకాలు

ఎస్.డి బిజూ అనే అతను మంచి ఫొటోగ్రాఫర్. ఇతనికి కప్పలయందు మంచి ఆసక్తి ఉండడంతో 7 సంవత్సరాలుగా రకరకాల ప్రదేశాలలో తిరిగి 115 రకాల విభిన్నమైన కప్పల ఫొటోలను సేకరించాడు. బొటానికల్ రీసెర్చ్‌కి సంబంధించిన ఇతను ఉద్యోగరీత్యా పశ్చిమ కనుమల్లోకి వెళ్లినప్పుడు మలబార్ గ్లైడింగ్ కప్పలను చూశాడు. ముందు హాబీగా ప్రారంభించి ఆ తరువాత సైంటిస్ట్‌ల పరిశోధనకు ఉపయోగపడగలవని గ్రహించి 450 లొకేషన్స్‌లోని రకరకాల మండూకాలని అతడు ఫిలిమ్‌లో చిత్రించాడు. నీలగిరిలో కొన్ని అపురూపమైన ట్రీఫ్రాగ్స్‌ను కనుగొన్నాడు. ఈ జాతి కప్పలు కొన్ని అంత్య దశలో ఉన్నాయి. అద్భుతమైన కొన్ని కప్పలను కనుగొన్నందుకుగాను ప్యారిస్ మ్యూజియమ్ వారు ఇతనికి ఫెలోషిప్ ఇచ్చి మండూకాలపై ఇంకా రీసెర్చి కొనసాగించమన్నారు. "కప్పలు ఎంతో గొప్పవి. అవి వాతావరణ మార్పులను వేగంగా గమనిస్తాయి" అంటాడు బిజూ.

కున్న విషయం ఇదొక్కటే.

ఆమెను ప్రేమించిన విషయం ఎవరికి చెప్పాలో అర్థంకాలేదు. అప్పటికీ కెమిస్ట్రీ లెక్చరర్ అడిగాడు,

"ఏంటి ఏదైనా లవ్ ప్రాబ్లమా?" అని

ఫిజిక్స్ లెక్చరర్ "ప్రేమ భౌతికమైనది. కొన్ని రసాయనాలవల్ల ప్రేమ కలుగుతుంది" అంటూ సుదీర్ఘంగా మొదలెట్టాడు.

ప్రేమ విషయంలో ఎవరి సలహాలూ తీసుకోవద్దని, ఎవరినీ సంప్రదించవద్దనీ నిర్ణయించుకున్నాడు.

ముందు అగమ్యతోనే విషయం తేల్చుకోవాలి. అగమ్య నిర్ణయం విని తనో నిర్ణయానికి రావాలి. కానీ ఇలాంటి అనుభవం పాణిగ్రాహికి కొత్త. ఎలా ప్రొసీడవ్వాలో, ఎలా కంటిన్యూ చేయాలో, అసలు - ఎలా మొదలుపెట్టాలో కూడా ఆలోచన లేదు.

అరగంటనుంచీ సక్సెస్ పత్రికను ముందేసుకుని రకరకాలుగా ఆలోచిస్తూ వుండిపోయాడు. అరగంట తర్వాత అతని ఆలోచనలు ఒక కొలిక్కి వచ్చాయి.

కాసింత ధైర్యాన్ని కూడగట్టుకున్నాడు. ఎప్పుడూ కామ్‌గా, కామ్‌గోయర్‌గా పేరు తెచ్చుకున్న పాణిగ్రాహి మొట్టమొదటిసారి ధైర్యంచేసి అగమ్యను కలిసి, తన అభిప్రాయాన్ని, ఆమెపట్ల తనకున్న ప్రేమభావాన్ని చెప్పాలని నిర్ణయించుకున్నాడు.

అలా ఓ నిర్ణయానికి రావడంతో అతని మనసు తేలికపడింది. వెంటనే అగమ్య చదివే కాలేజీకి బయల్దేరాడు.

అప్పుడే అగమ్య బయటకు వస్తూ కనిపించింది.

క్లాసు పూర్తయి ఇంటికి వెడుతుండగా "హలో... నమస్తే" అన్న మాటలు విని, ఒక్కక్షణం ఆగి తల వెనక్కి తిప్పింది.

రోడ్డుపక్కనే వున్న ఓ చెట్టుచాటు నుంచి వచ్చాడతను.

"నా పేరు పాణిగ్రాహి. ప్రయివేట్ కాలేజీలో పార్ట్‌టైం లెక్చరర్‌గా పనిచేస్తున్నాను. వారం రోజులుగా మీతో మాట్లాడాలని ప్రయత్నిస్తున్నాను. కానీ వీలు చిక్కడం లేదు" అన్నాడు.

"నాతో మాట్లాడే విషయాలు మీకేముంటాయి? నొసలు ముడివేస్తూ ఆశ్చర్యంగా అడిగింది.

"ఒక్క అయిదు నిమిషాలు మీరు నాకు కేటాయించగలిగితే చెబుతాను. అదిగో అలా సిమెంటు బెంచీ మీద కూర్చుందామా ప్లీజ్"

ఆమెకు ఏం చెప్పాలో అర్థంకాలేదు. అతని మాటల తీరు సంస్కారవంతంగానే వుంది.

"చెప్పండి" అంది రోడ్డు పక్కనే చెట్టుకు ఆనుకొని వున్న సిమెంట్ బెంచీమీద కూచుని. అతను ఒక్కక్షణం ఆగి.

"నా పేరు పాణిగ్రాహి" అన్నాడు.

"ఇందాకే చెప్పారుగా" అందామె.

ఎలా ప్రారంభించాలో తెలియక "అన్నట్టు నేను ప్రయివేట్ కాలేజీలో లెక్చరర్‌గా పన్జేస్తున్నాను. అదీ పార్ట్‌టైం జాబేలెండి. మీరంటే నాకు ఇష్టం"

ఈ మాట చెప్పేటప్పుడు అతను చాలా ఇబ్బంది పడ్డాడని అతని ముఖకవళికలే చెబుతున్నాయి.

అగమ్య మొహం ఎర్రబడింది. బెంచీమీద నుంచి లేవబోయింది.

"దయచేసి అపార్థం చేసుకోవద్దు" అతను కంగారుగా అన్నాడు.

రోషంగా తల పైకెత్తి "లేకపోతే ఏంటండీ మీ ఇష్టానికి మీరు ప్రేమించేయడమేనా?" అంది.

"తప్పే... మీ అంగీకారం లేకుండా ప్రేమించడం తప్పని మీరనుకుంటే క్షమించండి. మిమ్మల్ని ప్రేమించడంలో నాకే దురుద్దేశాలు లేవు. మీక్కూడా నా ప్రపోజల్ నచ్చితే, నేను మీ పెద్దవాళ్ళతో మాట్లా

డతాను.

కేవలం మీ నిర్ణయం కోసమే ఈ ప్రస్తావన తీసుకురావాల్సివచ్చింది. ముందుగా వచ్చి మీ పెద్దవాళ్ళవద్ద నేను ఈ ప్రపోజల్ తీసుకువచ్చాననుకోండి, అప్పుడు కేవలం మీ పెద్దవాళ్ళు నిర్ణయించారనో, వాళ్ళ అభిప్రాయానికి తల ఒగ్గో మీరీ పెళ్ళి చేసుకున్నారనుకోండి అది నాకిష్టంలేదు. అందుకే కేవలం మీ అభిప్రాయం తెలుసుకోవడం కోసమే..." ఆగాడతను.

అగమ్య తననితనే తిట్టుకుంది. అనవసరంగా తనే నోరు జారింది.

అతను తన అభిప్రాయాన్ని స్పష్టంగా, సంస్కారంగా చెప్పాడు. తన వెంటపడి చూపులతో తనని వేధించకుండా... అప్పుడు గమనించింది కను చివరలగుండా. అతను నిలుచునే వున్నాడు.

సిమెంట్ బెంచీమీద ముగ్గురు మించి పట్టరు. ఎంత దూరంగా కూచున్నా ఆ సిట్యుయేషన్ బాగోదు. ఆ విషయాన్ని గమనించినట్టు అతను నిలబడే మాట్లాడ్డం నచ్చింది.

అంతకన్నా అతను కన్విన్స్ చేసిన పద్ధతి నచ్చింది. మీరు లేకపోతే చచ్చిపోతాను లాంటి డైలాగులు చెప్పకుండా స్పష్టంగా చెప్పాడు.

"ఆలోచించండి... ఈ విషయం ఇప్పుడే ఇక్కడే తేల్చమని మిమ్మల్ని తొందరపెట్టను. ఏ విషయమైనా రెండుమూడ్రోజుల్లో చెప్పినా ఫర్లేదు. కానీ ఒక్క విషయం గుర్తుంచుకోండి. మీరు ఈ పెళ్ళికి ఒప్పుకుంటే ఎంతకాలమైనా మీకోసం ఓపిగ్గా ఎదుర్చూడగలను" చివరి మాటలు చెబుతున్నప్పుడు అతని గొంతు వణికింది.

అతని మాటల్లో ప్రేమ.

అతని ప్రేమలో ఆర్ద్రత.

అతని కన్విన్సింగ్‌లో సిన్సియార్టీ స్పష్టంగా కనిపిస్తూనే వున్నాయి.

అగమ్య లేచింది.

"మీరు మా నాన్నతో మాట్లాడొచ్చు" ఒకే ఒక వాక్యంతో తన నిర్ణయం చెప్పి ముందుకు కదిలింది.

★ ★ ★

"ఇంకా అమ్మాయి రాలేదా?" భార్యనుద్దేశించి కేకేసి అడిగాడు భావనారాయణ.

"ఇంకా రాలేదు. ఈపాటికి వచ్చేసి వుండాలి, ఏంటీ అమ్మాయితో ఏదైనా పనిబడిందా?" అడిగింది వంటింట్లోనుంచి భర్త దగ్గరకు వస్తూ ప్రభావతి.

"ఇప్పుడే పోస్ట్‌మెన్ వచ్చి వెళ్ళాడు. ఆ అమెరికా సుబ్బారావు లేడూ"

"ఏదీ...మా పినతల్లి కొడుకు. అదే మా అన్నయ్య సుబ్బారావా?"

"ఆ సుబ్బారావు... వాళ్లబ్బాయికి మన అగమ్యను ఇస్తారేమో కనుక్కోమని అమెరికాలోనే వున్న మా తమ్ముడు పరంధాముడికి ఫోన్‌చేసి అడిగారట. పరంధాముడు నాకు ఉత్తరం రాశాడు ఏ సంగతీ చెప్పమని"

"ఎంత మంచి మాట చెప్పారండీ. మన అగమ్యకు అమెరికా సంబంధమా?" సంతోషంగా అంది ప్రభావతి.

"కాలం కలిసొస్తే నడిచొచ్చే కొడుకు పుడతాడని పూర్కే అన్లేదు ప్రభావతీ" భావనారాయణ ఉద్వేగంతో అన్నాడు.

సరిగ్గా అప్పుడే అగమ్య వచ్చింది.

"రామ్మా...రా... నీ కోసమే చూస్తున్నాం. మాటల్లోనే వచ్చావు నీకు నూరేళ్ళు" అన్నాడు తండ్రి.

"చెప్పండి నాన్నా" అంది బుక్స్ టేబుల్ మీద పెట్టి, తండ్రి పక్కనే కూచుంటూ అగమ్య.

విషయమంతా క్లుప్తంగా చెప్పాడు భావనారాయణ.

అంతా విని మౌనంగా వుండిపోయింది అగమ్య.

ఒక గంటక్రితం అయితే తండ్రి నిర్ణయా

నికి తల ఒగ్గేది. కాని గంటక్రితమే ఓ మని షికి తన అంగీకారాన్ని చెప్పింది.

అప్పటికీ మీరేవిషయం రెండు మూడు రోజుల్లో చెప్పండి అని అతనన్నా, తనే వెంటనే ఓ. కే. చెప్పేసింది. తనవైపు అభ్యం తరమేమీ లేదని తండ్రిని కలవమని చెప్పింది.

భావనారాయణ కూతురి మౌనాన్ని మరోలా అర్థంచేసుకున్నాడు.

వెంటనే ప్రభావతిని కాఫీ తీసుకురమ్మని పురమాయించి.

"ఇప్పుడు చెప్పమ్మా, నీ మనసులో ఎవ రైనా అబ్బాయి వున్నాడా?"

అగమ్యకు తండ్రి దగ్గర చనువు ఎక్కువే. తండ్రి ఓ స్నేహితుడిలా అనిపిస్తాడు. ఓ గైడ్‌లా కనిపిస్తాడు. ఓ ఫిలాసఫర్‌లా మార్గం చూపిస్తాడు.

గంటక్రితం జరిగిన సంఘటన చెప్పింది. "అయినా మీ ఇష్టం నాన్నగారు. కానీ, అతన్ని పెళ్ళిచేసుకోవడానికి నాకేమీ అభ్యం తరం లేదని చెప్పాను. మీకు నచ్చకపోతే నేను చేసుకోను. అది వేరే విషయం. గంట క్రితమే నాకు అభ్యంతరం లేదని చెప్పి, ఇప్పుడు మరో అబ్బాయిని చేసుకోవా లంటే... అతను మీకు నచ్చని పక్షంలో మీ ఇష్టప్రకారమే అమెరికా అబ్బాయిని చేసుకుం టాను" తల వంచుకొని చెప్పింది అగమ్య.

"వద్దు తల్లీ... ఇష్టంలేని పెళ్ళి ఎవరికీ మంచిది కాదు. నాక్కావల్సింది నువ్వు ఓ ఇంటిదానివి కావడం, నీకు నచ్చిన యోగ్యు డైన వరుడ్ని చేసుకోవడం. కాపురం చేయా ల్సింది నువ్వు. అతను అమెరికా వాడైనా, సాదాసీదా వ్యక్తి అయినా నిన్ను ప్రేమగా చూసుకోవాలి కదా. ఆ అబ్బాయిని రేపో సారి నన్ను కలవమని చెప్పు. నేను మాట్లా డుతాను. అప్పటివరకూ ఈ అమెరికా సంబంధం వాయిదావేద్దాం. వెళ్లు... వెళ్ళి కాళ్ళు కడుక్కొని అన్నం తిను"

అగమ్య లేచి తన గదిలోకి వెళ్ళింది. భావనారాయణ భారంగా నిట్టూర్చాడు.

ప్రభావతి తండ్రి, కూతుళ్ళ సంభాషణ విని మౌనంగా అక్కడ్నుంచి తప్పుకుంది.



ప్రభావతి వంటగదిలో హడావుడిగా వుంది.

పాణిగ్రాహి ఒక్కడే వచ్చాడు. క్రితంరోజే అగమ్య తండ్రిని కలవమని అతనికి చెప్పింది.

"నువ్వొక్కడివే వచ్చావేంటి బాబూ... ఇంట్లో పెద్దవాళ్లు?" అడిగాడు భావనారా యణ.

"నాన్న ఆరోగ్యం బాగా లేదండి. అమ్మ ఎక్కువ దూరం నడవలేదు. ఆర్థరైటిస్" చెప్పాడు పాణిగ్రాహి.

"మీ నాన్నగారేం చేస్తున్నారు?"

"పోస్టుమాస్టర్‌గా రిటైరయ్యారండీ... ఒక తమ్ముడు, చెల్లెలు... చాలా చిన్నవాళ్లు. నా తర్వాత పదిహేనేళ్లకు పుట్టారు" చెప్పాడు పాణిగ్రాహి.

"అంటే మా ఫ్యామిలీ అంతా నా మీదే ఆధారపడి వున్నారండీ. నాన్నగారికి వచ్చే పెన్షన్ ఆయన మందులకు సరిపోతుంది" సిన్సియర్‌గా చెప్పాడు పాణిగ్రాహి.

అగమ్య స్వీట్స్ ప్లేటులో పెట్టి తీసుకువచ్చింది.

భావనారాయణ మౌనంగా వుండిపోయాడు.

అరగంట తర్వాత పాణిగ్రాహి వెళ్లిపోయాడు.

ఆ గదిలో భావనారాయణ, అగమ్య, ప్రభావతి మిగిలారు.

"చెప్పమ్మా... నీ నిర్ణయం ఏమిటి? అతనికి బరువు, బాధ్యతలున్నాయి. చిన్న చెల్లెలు, తమ్ముడు అంతా అతనిమీదే ఆధారపడి వున్నారు. పోనీ విడిగా వచ్చి వుంటాడా అంటే అది తనకు ఇష్టంలేదని స్పష్టంగా చెప్పాడు"

"కాబోయే భార్యకోసం తన చెల్లెని, తమ్ముణ్ణీ, తల్లిని, తండ్రిని వదులుకోమని అనడం మనకు మాత్రం భావ్యంగా వుంటుందా నాన్నా. అతను తన అభిప్రాయాన్ని చాలా స్పష్టంగా చెప్పాడు.

ఇప్పుడు అవసరంకొద్దీ 'అలానే' అని చెప్పి రేపు వేరు కాపురం పెట్టకపోతే... అదీగాక కోడలు వచ్చి కొడుకును వేరుచేసిందన్న అపకీర్తి నాకు మాత్రం మంచిదా? నాకు మాత్రం ఏ అభ్యంతరమూ కనిపించడం లేదు. ఆపై మీ ఇష్టం" తన అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పింది అగమ్య.

భావనారాయణ ఆలోచనలో పడ్డాడు. కూతురి ఇష్టాన్ని కాదనలేకపోతున్నాడు. కాసేపు ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాడు.

"నీ ఇష్టప్రకారమే కానీయమ్మా. వచ్చే నెలతో నీ డిగ్రీ పూర్తవుతుంది. అప్పుడు ముహూర్తాలు కూడా వున్నాయి. చదువులో నువ్వెప్పుడూ ఫస్టేకదా. నీకో మంచి ఉద్యోగం చూస్తాను. భార్యాభర్తలు హాయిగా వుండండి. రెండు జీతాలు, వేణ్ణీళ్ళకు చన్నీళ్లూనూ. రేపు ఎటుపోయి ఎటు వచ్చినా నీ ఉద్యోగమే నీకు శ్రీరామ రక్ష అవుతుంది" అన్నాడు.

★ ★ ★

పెళ్ళి చాలా సింపుల్‌గా జరిగింది.

పాణిగ్రాహి తరపునుంచి వచ్చిన బంధువులు చాలా తక్కువ.

భావనారాయణకు కూడా చెప్పుకోదగ్గ బంధువుల్లేరు.

బంధువులు లేరు అంటే, బంధుత్వం వున్నవాళ్ళు లేకపోవడం కాదు.

వాళ్ళవల్ల ఏ ఉపయోగం వుండదనుకొని తమ బంధుత్వాన్ని దాచిపెట్టినవాళ్ళే చాలా మంది.

తమ అవసరాలకు ఎదుటి వ్యక్తులు ఉపయోగపడరని తెలిస్తే వున్న బంధుత్వాన్ని వదులుకోగలగడం...

తమ అవసరానికి ఎదుటి వ్యక్తి ఉపయోగపడతారని తెలిస్తే లేని బంధుత్వాన్ని కలుపుకోవడం...

ఈ నైజం చాలామందికి వర్తిస్తుంది.

ముఖ్యంగా మానవ సంబంధాలను ఆర్థిక సంబంధాలుగా మార్చుకునేవాళ్ళకు!

★ ★ ★

పట్టెమంచం లేదు, పరిమళాలు వెదజల్లే పూలతోరణాలు వేలాడ్డంలేదు. అగరొత్తులు, స్వీట్స్, పాలు... ఇవన్నీ మొదటిరాత్రి షరా మామూలే.

కానీ ఆ గదిలో సింపుల్‌గా నేలమీద పరిచిన చాప, దానిమీద ఓ బెడ్‌షీట్, నీట్‌గా అమర్చిన దిండ్లు.

పాణిగ్రాహితో కలిసి ఆ ఇంట్లో అడుగుపెట్టినప్పుడే అగమ్యకు అర్థమయింది భర్త ఆర్థికస్థితి.

మూడుగదుల ఆ ఇంట్లో కిచెన్ వదిలేస్తే వుండే రెండు గదుల్లో, ఓ గదిలో అత్తా, మామ, ఆడపడుచు, మరిది పడుకున్నారు. మరోగదిలో తాము.

నూటయాభైరూపాయల అద్దెకు అంతకు మించి మంచి ఇల్లు దొరకడం దుర్లభమే!

మొదటి రాత్రి హడావుడి వద్దంది.

రెండు మనసులు, రెండు శరీరాలు కల




వడానికి ఇంత పెద్ద హంగామా, హడావుడి అవసరమా? అన్న ప్రశ్నతో భర్తని సమాధానపరచింది.

"అగమ్యా" తలకింద రెండు చేతులు పెట్టుకొని, వెల్లకిలా పడుకొని పిలిచాడు పాణిగ్రాహి.

"చెప్పండి"

"నీకు బాధగా వుందికదూ"

"ఎందుకలా అనుకుంటున్నారు? "

"కనీసం మొదటి రాత్రిని కూడా అందంగా అమర్చిపెట్టలేని భర్తని చూస్తే ఏ భార్యకైనా ఇలాంటి ఫీలింగే కలగడంలో ఆశ్చర్యం ఏముంటుంది? "

"ఇది మొదటిరాత్రే కానీ మనకు చివరి రాత్రి కాదుకదా. ఏ రాత్రి అయినా మధురంగా వుంటే మనసులు పెనవేసుకుంటే అదే మొదటిరాత్రి అవుతుంది" అంటూ

"మన ప్రేమకు గుర్తుగా ప్రతిరాత్రి మొదటిరాత్రే కావాలి" అని స్పష్టంగా, ప్రేమగా చెప్పింది అగమ్య.

పాణిగ్రాహి మాట్లాడలేదు. భార్యను చూస్తే అతనికి ముచ్చటేస్తుంది. భర్తను అర్థం చేసుకునే భార్యలు ఎందరుంటారు?

పాణిగ్రాహి అగమ్యను దగ్గరకు తీసుకున్నాడు. అతని గుండెలమీద తల పెట్టి పడుకుంది అగమ్య.

అతని గుండెచప్పుడును వింటోంది.

అతనామెను తన గుండెలకు మరింత దగ్గరగా హత్తుకున్నాడు.

ఆమె నిశ్చింతగా కళ్లు మూసుకుంది.

ఆమె వైవాహిక జీవితానికి ఇది శుభారంభం అనుకుంది.

అతనిలో కరిగిపోతూ, అతనిలో మమేకమవుతూ రెండు ఆత్మల, రెండు శరీరాల అపూర్వ సంగమమది.

★ ★ ★

కాలేజీ స్టాఫ్ అంతా పాణిగ్రాహికి అభినందనలు తెలియజేసింది. కాలేజీ తరఫున చిన్న గిఫ్ట్ ఇచ్చారు.

"కంగ్రాట్స్ పాణిగ్రాహిగారు" తెలుగు మేడమ్ అభినందనలు తెలియజేసింది.

"సంవత్సరం తిరిగేలోగా బుల్లి పాణిగ్రాహి మాకు కనిపించాలి" అన్నాడు కెమిస్ట్రీ లెక్చరర్.

సిగ్గుపడిపోయాడు పాణిగ్రాహి.

ఈ అనుభవం అతనికి కొత్తగా వుంది. తనిప్పుడు వివాహితుడు.

తనకో భార్య తోడు వుంది. ఆ ఫీలింగ్ అతనికి అంతులేని ఆనందాన్ని ఇచ్చింది.

ఏ మనిషికైనా మరో మనిషి తన కోసం వున్నదన్న భావం గొప్ప సంతృప్తినిస్తుంది. అందుకు పాణిగ్రాహి మినహాయింపేమీ కాదు.

అతనికి అగమ్య గుర్తుకొచ్చింది.

ఈ టైంలో అగమ్య ఏం చేస్తూవుంటుంది? తన గురించి ఆలోచిస్తూ వుంటుందా? ఆ ఆలోచన కూడా అతనికి మధురంగానే వుంది.

వాస్తవంకన్నా భ్రమలు లేదా పాజిటివ్ ఆలోచనలు ఆనందంగా వుంటాయి.

'పర్మిషన్ తీసుకొని ఇంటికి వెళ్తే' ఆ ఆలోచన రాగానే వెంటనే పర్మిషన్ తీసుకొని ఇంటికి బయల్దేరాడు. దారిలో స్వీట్ షాప్ దగ్గర ఆగి స్వీట్స్ కొన్నాడు. గుడి దగ్గర మల్లెపూల మాల కొన్నాడు.

రకరకాల భావాలు అతన్ని ముప్పిరిగొన్నాయి. అతను ఇంట్లో అగుడుపెట్టేసరికి భార్య ఇల్లు దులుపుతూ చీరకొంగును బొడ్లో దోపి అలసటగా కనిపించింది.

ఆ భంగిమ అతనికి బాగా నచ్చింది. ఆ సమయంలో భర్త రావడం చూసి ఆశ్చర్యపోయింది.

"నేనొకటి చెబితే మరేమీ అనుకోరుగా" అంది అగమ్య అరగంట తర్వాత.

పాణిగ్రాహి ఇంట్లోకి రావడం, అగమ్యను తన గదిలోకి తీసుకువెళ్ళడం జరిగిపోయాయి.

అగమ్య భుజంమీద చెయ్యేసి ప్రేమగా

లాలనగా దగ్గరకు తీసుకున్నాడు.

అగమ్య ఏదో చెప్పబోయింది. ఆమె గొంతుక్కేదో అడ్డుపడినట్టయింది. వెంటనే భర్తకు ఏదో చెప్పాలన్న ప్రయత్నం విరమించుకుంది.

పాణిగ్రాహి స్వీట్ ప్యాకెట్ విప్పి ఓ స్వీట్‌ని అగమ్య నోట్లో పెట్టాడు.

అగమ్య స్వీట్ ప్యాకెట్ టేబుల్‌పైన ఓ పక్కగా పెట్టింది.

భర్త తెచ్చిన పూలు జడలో పెట్టుకుంది.

పాణిగ్రాహి భార్యను దగ్గరకు తీసుకున్నాడు. అగమ్యకు చాలా ఇబ్బందిగా వుంది. అయినా ఆ పరిస్థితిలో ఆమెకు మాటలు కరువయ్యాయి.

"అగమ్యా... నేను నీకు చాలా రుణపడి వున్నాను. నువ్వంటే నాకు చాలా ప్రేమ. అందుకే వెంటనే నిన్ను చూడకుండా వుండలేక వచ్చాను" అన్నాడు పాణిగ్రాహి ఆమె మీదికి ఒరిగిపోతూ.

అగమ్య చేతులు కదిలాయి. అతని ప్రేమ గమనించింది. అతని తపన అవగతమైంది. అతని అవసరమూ గుర్తించింది. అందుకే శయనేష రంభయింది. అరగంట తర్వాత.

ఇద్దరూ... ఎదురెదురుగా కూచున్నారు.

"చెప్పండి. నేనొకటి చెబితే మీరేమీ అనుకోరుగా?" అడిగింది అగమ్య భర్తనుద్దేశించి.

ఆశ్చర్యపోతూ అన్నాడు పాణిగ్రాహి.

"ఏమిటది?"

"ముందు చెప్పండి. మీరు మరోలా భావించరుగా"

"నువ్వేది చెప్పినా సబబుగా వుంటుందని నా నమ్మకం. చెప్పు అగమ్యా" అన్నాడు.

భార్య చెప్పబోయే విషయం ఏమిటో అతనికి ఓ పట్టాన అర్థం కావడంలేదు.

"ఈ ఇల్లు చాలా చిన్నది. అవునుకదా"

"అవును. సారీ అగమ్యా... ఇంతకు మించి నేను ఎక్కువ అద్దె భరించే స్థితిలో లేను. బహుశా జీతం పెంచొచ్చేమో. అప్పుడు మరో పెద్ద ఇంట్లోకి మారిపోదాం" అన్నాడు గిల్టీగా ఫీలవుతూ.

"అయ్యో... నా ఉద్దేశం అది కాదు"

"మరేమిటి?"

"ఇంత చిన్న ఇంట్లో. మనమూ అత్తయ్య, మామగారు, పిల్లలూ వుంటారు. మన ప్రతి కదలిక వారికి తెలుస్తుంది. ఎప్పుడూ కాలేజీ వదిలాక వచ్చే మీరు ఇలా పర్మిషన్ తీసుకురావడం. వచ్చేప్పుడు స్వీట్స్, పూలు తేవడం... అత్తయ్య దృష్టిలోగానీ, పిల్లల దృష్టిలోగానీ పడితే బావోదు.

ప్రయివసీ లేనప్పుడు కొన్నింటిని మనం త్యాగం చేయాలి. నామీద మీకున్న ప్రేమ, అత్తయ్య దృష్టిలో వాళ్ళమీద మీకు సన్నగిల్లిందేమో అన్నట్టు అనిపించకూడదు.

ఈ విషయం ఇందాకే చెప్పాలని అనుకున్నాను. మీరు నొచ్చుకొని అపార్థం చేసుకుంటారేమోనని చెప్పలేదు.

నా ఉద్దేశం మిమ్మల్ని హర్ట్ చేయాలని కాదు. మనకు ఇంకా ఎంతో జీవితం వుంది. ప్రతిరాత్రి మనదే. అందుకని" ఆగి భర్త మొహంలోకి చూసి అంది.

"ఇలా చెప్పడం... మిమ్మల్ని బాధపెట్టి నేనిలా చెప్పడం తప్పని మీరు అనుకుంటే సారీ"

పాణిగ్రాహి కదిలిపోయాడు.

ఎంత సున్నితంగా పరిస్థితిని వివరించింది. ఎందరో భార్యలు... పెళ్ళి అవగానే వేరు కాపురం పెట్టాలనో, విడిగా వుండామనో అంటారు. కానీ ఎవ్వర్నీ నొప్పించకుండా వుండాలని అగమ్య ఆలోచించిన తీరు అతనికి ముచ్చటేసింది.

తన తప్పేమిటోకూడా తెలిసింది. నిజమే... ఎన్నడూ లేనిది స్వీట్స్ తీసుకురావడం, భార్యను గదిలోకి పిలుచుకువెళ్లడం, ఆలోచిస్తుంటే తనకే ఎంబారసింగ్‌గా అనిపించింది.

"సారీ అగమ్యా! తప్పు నాదే. ఇంకెప్పుడూ

ఇలాంటి పొరపాటు చేయను. ప్రామిస్" అన్నాడు సిన్సియర్‌గా.

"ఛ... ఛ... మీరు సారీ చెప్పాల్సిన తప్పేమీ చేయలేదు. పరిస్థితులు మాత్రమే మనకు ప్రతికూలంగా వున్నాయి. నేనే మిమ్మల్ని హర్ట్ చేశాను" అంది.

పాణిగ్రాహి కాలేజికి వెళ్లాలని బయల్దే రాడు.

ఈ సంభాషణ అంతా అగమ్య అత్తగారు, మామగారు వింటూనే వున్నారు.

వాళ్లకు కోడలిమీద మరింత ప్రేమ పొంగింది. గౌరవం కొత్తగా వచ్చిచేరి పెరిగిపోయింది.

అత్తను అమ్మనుకునే కోడలు దొరకడం ఎవరికైనా సంతోషమే.

అగమ్య తనకు కోడలైందన్న సంతోషం కన్నా, కూతురిలా మాట్లాడుతోందన్న సంతోషమే ఆ దంపతులకు మరింత ఆనందాన్ని ఇచ్చింది.

ఆ ఆనందం వేయి ఏనుగల బలంతో సమానం.

★ ★ ★

ఒక కొత్త ప్రయాణం.

ఒక కొత్త మజిలీ.

ఒక కొత్త అధ్యాయం.

ఇంటి పేరు మార్చి వంటిమీద మంగళ సూత్రాన్ని చేర్చి, కొత్త బాధ్యతను అప్పగించి... కాలం నిశ్చింతగా వుంది.

పాణిగ్రాహి కట్నంగా ఏమీ తీసుకోలేదు. భావనారాయణ యాభైవేల రూపాయలు అగమ్య పేరుతో బ్యాంకులో వేశాడు.

అతని ఆర్థిక స్థితి అంతంత మాత్రమే.

అత్తవారింట్లో అడుగు పెట్టడంతోనే అక్కడ పరిస్థితుల్ని అంచనా వేసింది అగమ్య. భర్తకు పెద్దల ద్వారా సంక్రమించిన ఆస్తి ఏమీ లేదు. మామగారి పెన్షన్‌తో వచ్చే డబ్బు అంతంతమాత్రమే.

కేవలం భర్తకు వచ్చే సంపాదనే ఈ కుటుంబానికి జీవనాధారం.

ఈ పరిస్థితుల్లో తను ఉద్యోగం చేయక తప్పదు.

తనకు ఓ ఉద్యోగం చూసి పెడతానన్న తండ్రి మాటలు గుర్తొచ్చాయి.

భర్త కాలేజీకి వెళ్ళాక, ఇల్లంతా నీట్‌గా సర్దింది.

ఆడపడుచును, మరిదిని చూస్తుంటే గమ్మత్తయిన ఫీలింగ్ కలిగింది అగమ్యకు.

పదేళ్ళ మరిది, అయిదేళ్ల ఆడపడుచు. ఏమీ తెలియని అమాయకత్వం వాళ్లలో కనిపిస్తోంది.

పెళ్ళయిన మరునాడే ఆ పిల్లలు తల్లిని "అమ్మా... ఈ ఆంటీ ఎవరు" అని అడిగితే నవ్వొచ్చింది అగమ్యకు.

అత్తగారు సిగ్గుతో తలదించుకుంది. ఈ వయసులో తనకు ఇంత చిన్న బిడ్డలున్నందుకు కోడలు తన గురించి ఏమనుకుంటుందో అన్న బిడియం... ఎంబారసింగ్ ఫీలింగ్.

ఆ పరిస్థితి అర్థమయింది అగమ్యకు. వెంటనే ఆ పిల్లలిద్దర్నీ దగ్గరకు తీసుకొని "ఈరోజునుంచి నేను మీకు వదినమ్మను సరేనా" అంది.

ఆ పిల్లలిద్దరూ బుద్ధిగా తలలూపారు.

ఆ క్షణం అత్తయ్య కంట, మామయ్య కంట కన్నీరు మెరవడం గమనించింది అగమ్య.

"వదినమ్మా... మీ పేరేంటి? " అడిగిందా అమ్మాయి.

"అగమ్య" చెప్పి... "మరి మీ పేర్లు చెప్పరా" అంది.

"నా పేరు అఖిల... వాడేమో మా అన్నయ్య సుందర్... కదురా" అంది పెద్ద ఆరిందాలా.

"వెరీగుడ్... మీరిప్పుడు మంచి పిల్లలు. రోజూ బుద్ధిగా స్కూల్‌కు వెళ్ళాలి. సరేనా" అంది.

అలాగేనన్నట్టు తలూపారిద్దరూ.

స్కూల్ యూనిఫాం వెతికింది. అత్తగారి

అనారోగ్యంవల్ల యూనిఫాం సరిగ్గా లేకపోవడం, వాళ్ళ ఆలనా, పాలనా సరిగ్గా లేకపోవడం గమనించింది.

అప్పటికప్పుడు యూనిఫాం శుభ్రంగా ఉతికింది. ఫ్యాన్ గాలికి బట్టలు ఆరేసి, ఐరన్ చేసింది.

వాళిద్దర్నీ తయారుచేసి స్కూల్లో వాళ్ళని దించమని భర్తకు చెప్పింది.

నీట్‌గా తయారై స్కూల్‌కు వెడుతోన్న తమ్ముడివైపు, చెల్లెలు వైపు చూస్తోంటే అతనికి ముచ్చటేసింది.

అనుకోకుండా అప్రయత్నంగా అతని కంట్లో నీళ్ల తిరిగాయి. మెచ్చుకోలుగా భార్య కళ్ళలోకి చూశాడు.

ఆ పిల్లలిద్దరూ వెడుతూ... ఒక్క క్షణం ఆగి వెనక్కి వచ్చారు.

"ఏంటమ్మా... ఏమైనా మరిచిపోయారా? " అడిగింది మోకాళ్ళమీద కూచుని వాళ్ళిద్దరి బుగ్గలమీదా ముద్దులు పెడుతూ.

"నీకు టాటా చెప్పొచ్చా" అడిగాడు పదేళ్ల సుందర్.

ఒక్కసారి అగమ్య మనసు ద్రవించిపోయింది.

ఇద్దర్నీ గుండెలకు హత్తుకొని గొంతు గాద్గదికం అవుతుండగా చెప్పింది "టాటా"

ఇద్దరూ సంతోషంగా టాటా చెప్పారు.

ఆ దృశ్యం అబ్బురం మాత్రమే కాదు, అనుభూతిగా గుండెలో మిగిలిపోయే అద్భుత అనుభవం.

★ ★ ★

పిల్లల్ని స్కూలుకు పంపి, అత్తమామలకు కావలసినవి టేబుల్‌మీద సర్ది, వాళ్లకు చెప్పి తండ్రి దగ్గరికి బయల్దేరింది.

కూతుర్ని చూడ్డంతోనే భావనారాయణ మొహం సంతోషంతో విప్పారింది.

"రామ్మా...రా... అంతా కులాసాయేనా? అల్లుడుగారు బావున్నారా? మీ అత్తయ్య, మామయ్య బావున్నారా? " అంటూ ప్రశ్నల పరంపర గుప్పించాడు.

తల్లి కూతుర్ని లోపలికి తీసుకువెళ్లింది. కూతురు అత్తారింటికి వెళ్ళి కొన్ని రోజులైనా కాలేదు. అప్పుడే కూతుర్ని చూసి చాలా సంవత్సరాలైన ఫీలింగ్ కలిగింది వాళ్లకు.

భోజనాలయ్యాక, కాసేపు నడుంవాల్చడానికి వెళ్ళింది ప్రభావతి.

తండ్రి వాలుకుర్చీలో కూచున్నాడు.

తండ్రి దగ్గరికి వచ్చింది అగమ్య.

"చెప్పమ్మా" కూతురు ఏదో అడగడానికే వచ్చిందని అర్థమైంది.

ఎలా మొదలుపెట్టాలో అర్థంకాలేదు అగమ్యకు.

"ఏంటి తల్లీ, ఏమైనా డబ్బు కావాలా? " అడిగాడు తండ్రి.

"కాదు నాన్నా... నేను... నేను ఉద్యోగం చేయాలని అనుకుంటున్నాను" చెప్పింది మెల్లగా అగమ్య.

ఒక్కక్షణం కూతురివంక ఆశ్చర్యంగా చూసి చెప్పాడు.

"ఆ రోజు నేను నీకు ఉద్యోగం చూస్తానన్న మాట నిజమే. కానీ నువ్వు దాన్ని సీరియస్‌గా తీసుకుంటావనుకోలేదు. నాకు తెలిసిన ఒకతన్ని అడుగుతాను. అతనికి సిటీలో మంచి పరపతి వుంది. నీకా డిగ్రీ వుంది. వుద్యోగం కోసం నువ్వేమీ దిగులు పెట్టుకోకు"

"ఈ విషయమే మీతో మాట్లాడుదామని వచ్చాను"

ఒక్క క్షణం మౌనంగా వుండిపోయాడు.

"నువ్వు... నువ్వక్కడ సౌకర్యంగానే వున్నావుగా" అడిగాడు భావనారాయణ.

"ఆయన, అత్త, మామయ్యలు నన్ను బాగా చూసుకుంటున్నారు" చెప్పింది మన స్ఫూర్తిగా అగమ్య.

"నాక్కావల్సింది కూడా అదే... అన్నట్టు చెప్పడం మరిచిపోయాను. రేపు నేను, మీ అమ్మ సిటీకి వెళ్తున్నాం. మళ్ళీ ఎల్లుండి తిరుగు ప్రయాణం. అక్కడ నా స్నేహితుడున్నాడని చెప్పానుగా నీ ఉద్యోగం గురించి





కూడా అతనితో మాట్లాడుతాను" చెప్పాడు తండ్రి.

అలాగే అన్నట్టు తలూపింది అగమ్య. మరో అరగంట తర్వాత భర్త వస్తాడని చెప్పి ఇంటికి బయల్దేరింది.

★ ★ ★

రాత్రి పదిన్నర.

ఆ గదిలో పాణిగ్రాహి, అగమ్య ఇద్దరే వున్నారు. అగమ్య వంటింటిపని పూర్తిచేసి చేతులు చీరకొంగుతో తుడుచుకుంటూ వచ్చింది.

అగమ్యవైపు అబ్బురంగా చూస్తుండిపోయాడు పాణిగ్రాహి.

"ఏంటండీ... అలా చూస్తున్నారు?" అడిగింది అగమ్య.

"మనసెరిగిన భార్య దొరకడం నా అదృష్టం. పెళ్ళయిన మరునాడే వేరుకాపురం పెడదామనే వాళ్ళ గురించి నాకు తెలుసు. కానీ నువ్వు... మరిదిని, ఆడపడుచుని నీ పిల్లల్లా చూసుకుంటున్నావు.

ఆ పిల్లల్లో ఆనందం మొదటిసారి చూస్తున్నాను. వదినమ్మా అంటూ వాళ్ళు నిన్ను పిలుస్తుంటే నాకు "అమ్మా" అని పిలుస్తున్నట్టే అనిపిస్తుంది.

సాయంత్రం స్కూలునుంచి వాళ్ళను తీసుకురావడానికి వెళ్ళినప్పుడు, దారి పొడుగునా నీ గురించే చెబుతున్నారు. వాళ్ళ స్కూల్లో మేడమ్స్‌కు కూడా చెప్పారట.

ఒక వదిన, ఒక అమ్మ కలిసి వదినమ్మ అయింది" కళ్ళు చెమరుస్తుండగా చెప్పాడు పాణిగ్రాహి.

"మీరు నన్ను మరీ పొగిడేస్తున్నారు. అయినా ఎప్పుడైతే ఈ ఇంట్లోకి మీ భార్యగా అడుగుపెట్టానో, అప్పుడే మీ బాధ్యతలన్నీ నా బాధ్యతలయ్యాయి" అంది అగమ్య.

అగమ్య రెండు చేతులను తీసుకొని తన చెంపలకు ఆన్చుకుని,

"దేవుడా... అందమైన భార్యనే కాదు అంతకన్నా అందమైన మనసున్న భార్యను నాకిచ్చిన నీకు నేను ఎలా కృతజ్ఞతలు తెలిపేది?" మనస్ఫూర్తిగా అనుకున్నాడు పాణిగ్రాహి.

★ ★ ★

అత్తవారింట్లోకి అడుగుపెట్టిన వారంరోజుల్లోనే ఆ ఇంట్లో కలిసిపోయింది. ఆడపడుచు, మరిది దగ్గరయ్యారు. అత్తమామలు మరీ దగ్గరయ్యారు.

ముందుగా ఇంట్లోకి అవసరమయ్యే బడ్జెట్ వేసింది. మామగారికి వచ్చే పెన్షన్ డబ్బులు ముట్టుకోకూడదని డిసైడయింది. అదే విషయం భర్తతో చెప్పింది.

"మామగారి డబ్బులు మామగారి దగ్గరే వుండనీయండి. ఆయన మందులకు, అవసరాలకు ఉపయోగపడతాయి"

"కానీ, నాకొచ్చే డబ్బుతో ఇల్లు గడవడం?"

"ఖాళీ సమయంలో ట్యూషన్ చెప్పండి"

"ట్యూషనా?"

"అవును. ట్యూషనే. కాలేజీలోని స్టూడెంట్స్ వస్తారు"

"వద్దు... కావాలనే కాలేజీలో నేను సరిగ్గా చెప్పకుండా ఇంటికి రప్పించుకుంటున్నానని అనుకుంటారు"

"పోనీ, మీ కాలేజీ స్టూడెంట్స్‌కు కాకుండా వేరే వాళ్ళకు చెప్పండి"

"అది కూడా" అంటూ ఆగిపోయాడు.

అగమ్య మరింక ఆ విషయంలో రెట్టించలేదు.

ముందుగా ఖర్చులు తగ్గించుకోవాలి. మరో ఆదాయమార్గాన్ని అన్వేషించాలి.

★ ★ ★

ఉదయమే లేచింది అగమ్య.

అప్పటికింకా పూర్తిగా తెల్లవారనేలేదు.

ఇల్లు వూడ్చి, కల్లాపి చల్లి, ముగ్గువేసి, స్నానం చేసి ఫ్రెషప్ అయింది.

మామగారికి, అత్తగారికి పొద్దున్నే కాఫీ తాగడం అలవాటని తెలిసింది. కానీ గత



కొద్దికాలంగా ఓపిక లేకపోవడంవల్ల వాళ్ళు కాఫీ తాగడం లేదని అర్థమైంది. ఖర్చు కూడా అవుతుందనేది మరో కారణం.

క్రితంరోజే పుట్టింటినుంచి తెచ్చిన ఫిల్టర్‌ని శుభ్రంచేసింది.

రాత్రే కాఫీపొడి ఫిల్టర్‌లో వేసింది. ఉదయమే కాఫీ కలిపి, రెండు కప్పుల్లోకి కాఫీ ఒంపి, అత్తకు, మామకు ఇచ్చింది.

ఉదయమే నిద్రలేపి గుడ్‌మార్నింగ్ చెప్పి కాఫీ ఇస్తోన్న కోడలు వంక అబ్బురంగా చూశారు.

"ఇంత పొద్దున్నే నీకాశ్రమ ఎందుకమ్మా? అయినా మేము బెడ్ కాఫీ తాగుతామని ఎవరు చెప్పారు? " ఆప్యాయంగా అడిగాడు మామగారు.

"నేను మీ ఇంటికోడలిని అయినప్పుడు బిడ్డలా మీ గురించి అన్నీ తెలుసుకోవాలిగా మామయ్యా. మీరు బెడ్‌కాఫీ తాగుతారని తెలుసు. అత్తయ్యా మాత్రం మొహం కడుక్కుని తాగుతారు" అంటూ "మీరు రెండు నిమిషాల్లో మొహం కడుక్కొని రావాలి. కావాలంటే స్నానం చేసేప్పుడు మరోసారి పళ్ళు తోముకోండి" అంది చొరవగా.

"నా తల్లే... ఇంతవరకు ఇంత ప్రేమగా మామయ్యా కూడా చెప్పలేదు" అంటూ భర్త వంక చూసింది.

భార్య మాటలను ఎంజాయ్ చేస్తూ మనసారా నవ్వాడు.

వాళ్ళిద్దరూ కాఫీ తాగుతుంటే ముచ్చట్లు చెబుతూవుంది అగమ్య.

"నువ్వు కూడా కాఫీ తెచ్చుకోకపోయావా? " అత్తగారు అడగడంతో చిర్నవ్వు నవ్వి "నాకు పెద్దగా అలవాటు లేదత్తయ్యా" అంది.

చాలాకాలం తర్వాత ఆ దంపతులకు ఆరోజు అపురూపంగా అనిపించింది.

ఈ వయసులో పొద్దున్నే కాఫీ కలుపుకునే ఓపిక వుండదు. వున్నా వచ్చే కొత్త కోడలు ఒప్పుకుంటుందో లేదో... అనే సందేహం వుండేది.

కానీ కోడలే కూతురై తమకు సేవలు చేస్తుంటే మురిసిపోయారా దంపతులు.

పొద్దున్నే కబుర్లు చెప్పుకుంటూ, వేడి వేడి ఫిల్టర్ కాఫీ తాగడం వాళ్ళకు అపురూపంగా అనిపించింది.

కిచెన్‌లోకి వచ్చి రావడంతోనే ఆరోజు టిఫిన్‌కు కావలసిన సరుకులన్నీ దగ్గర పెట్టుకుంది. మరోవైపు సుందర్‌ని, అఖిలను నిద్రలేపి, వాళ్ళకు స్నానం చేయించి తయారుచేసింది.

భర్తను నిద్రలేపింది.

అతనికింకా నిద్రమత్తు వదల్లేదు.

"అబ్బ... ఇంకాసేపు పడుకోనీయ్" అన్నాడు.

"అదేం కుదర్దు. ఈవాళ్టినుంచి మీరు అందరితోపాటు టిఫిన్ చేయాల్సిందే. ఎనిమిది అయ్యిందంటే అందరూ టిఫిన్ చేయాలి" అంది.

"అబ్బ నిద్రొస్తోంది అగమ్యా" అంటూ అలానే భార్య భుజంమీద తల పెట్టాడు.

"ఓ పన్జెయండి. టిఫిన్ చేసి, నిద్రపోండి" అంటూ బలవంతంగా బాత్రూంవరకు తీసుకెళ్ళింది.

ఆరోజు మొదటిసారిగా అందరూ కలిసి ఒకేసారి టిఫిన్ చేశారు.

"భలే... భలే... బావుంది వదినా" అంది అఖిల.

ఈ మార్పు పాణిగ్రాహికి కూడా బావుంది. అతని తండ్రి సుందరమూర్తికి, తల్లి మహలక్ష్మికీ నచ్చింది.

పాతరోజులు గుర్తొచ్చాయి వాళ్ళకు. అభినందన పూర్వకంగా కోడలివైపు చూశాడు సుందరమూర్తి.

"ఏవండీ" పేపర్ చదువుకుంటోన్న సుందరమూర్తి భార్య మాటలు విని తల తిప్పి భార్యవంక చూశాడు ఏమిటన్నట్టు.

"అగమ్యను చూస్తుంటే మీకేమనిపిస్తోంది? " అడిగింది మహలక్ష్మి.




"మనకూ అలాంటి కూతురు వుంటే బావుండనిపిస్తోంది" అన్నాడు సుందర మూర్తి.

"నాకైతే అక్కర్లేదని అనిపిస్తోంది" అంది మహలక్ష్మి.

"అదేంటి? " విస్తుపోతూ అన్నాడు సుంద రమూర్తి.

"కోడలే కూతురై మనింటికి వచ్చాక ఇంకా మరో కూతురు ఎందుకు? ఏమో నిజంగా మనకు అంత పెద్ద కూతురు వున్నా మనకు ఇలా సేవలు చేసేదో లేదో? "

"నిజం లక్ష్మీ! చదువుకున్న అమ్మాయి, పైగా మనమా నిస్సహాయులం. మనమీద పెత్తనం చెలాయిస్తుందని, మనల్ని సరిగ్గా చూసుకోదేమోననే భయం వుండేది"

"నాకైతే ఎక్కడ వేరుకాపురం పెట్టమని మనవాడ్ని పోరి వేరుకాపురం పెట్టి వెళ్ళిపో తుందో అని భయం కూడా వేసింది"

"నిజంగా అదే జరిగితే, ఊహించుకోవడా నికే భయం వుంది. మనం, మన పిల్లలు రోడ్లపాలు అయ్యేవాళ్ళం" అన్నాడు సుందర మూర్తి.

"ఎంత ప్రేమ మన పిల్లలంటే. తనే శ్రద్ధగా తయారుచేస్తుంది. వాళ్ళ నోట్స్ చూస్తుంది. వాళ్ళతో హోంవర్క్ చేయి స్తుంది. పిల్లలు కూడా బాగా అలవాటు పడిపోతున్నారు" అంది మహలక్ష్మి.

"పోనీలే, ఆ దేవుడికి మనమీద జాలి కలిగి ఇలాంటి మంచమ్మాయిని మనకు కోడలిగా పంపించాడు" అన్నాడు సుందర మూర్తి.

ఆ దంపతులు ఓ అరగంట పాటు అగమ్య గురించి మాట్లాడుకున్నారు.

వాళ్ళకు ఇప్పుడు ప్రశాంతంగా వుంది. కోడలిరాక ఏ ఇంట్లో అయినా భయాన్ని కలిగించకుండా భద్రతా భావాన్ని కలిగిస్తే ఆ ఇల్లు శాంతినిలయమే.

అగమ్య రాక ఆ ఇంట్లో కొత్త వాతావర ణాన్ని సరికొత్త అనుబంధాలను సృష్టిం చింది.

వృద్ధాప్యంలో ఇంతకన్నా ఆ దంపతులకు ఇంకేం కావాలి?

★ ★ ★

తీవ్రంగా ఆలోచిస్తోంది అగమ్య. ఇంటి బడ్జెట్, పాణిగ్రాహికొచ్చే ఆదాయం రెండూ పొంతన లేకుండా వున్నాయి.

ఆదాయం పెరగడమో, బడ్జెట్ తగ్గడమో జరగాలి.

కానీ ఆ రెండూ జరిగే అవకాశాలు లేవు. ఇప్పుడు భర్త చేసే లెక్చరర్ జాబ్ కూడా పర్మినెంట్ కాదు. ఏదో ఓ మార్గం ఆలోచిం చాలి.

తండ్రి తనకు ఉద్యోగం చూసేదాకా ఈ ఇల్లు గడవాలి. ఎలా?

అలా ఆలోచిస్తూ ఆరోజు లైబ్రరీకి వెళ్ళి అన్ని పేపర్లూ తిరగేసింది.

ఓ పేపర్‌లో పడ్డ ప్రకటన ఆమెను ఆక ర్షించింది.

★ ★ ★

"ఏంటీ... నేను గ్రూప్‌వన్ ఎగ్జామ్స్‌కు ప్రిపేరవ్వాలా? బుక్స్ కావాలి. మాగ్జిమమ్ టైమ్ స్పెండ్ చేయాలి. అవసరమైతే కొన్నాళ్ళు జాబ్ మానేయాలి. అయినా నీకా ఆలోచన ఎందుకు వచ్చింది? " అడిగాడు పాణిగ్రాహి.

కాలేజినుంచి ఇంటికొచ్చి భోంచేసి రిలాక్స య్యాక అగమ్య భర్తను గ్రూప్‌వన్ ఎగ్జా మ్స్‌కు ప్రిపేరవ్వమని చెప్పింది.

"మీరు గ్రూప్‌వన్, టూ... ఇలా అన్ని ఎగ్జామ్స్‌కు అటెండ్ అవ్వండి. మీ తెలివికి ఖచ్చితంగా మంచి రిజల్టే వుంటుంది. తాడు, బొంగరం లేకుండా, ఇలా ఈ టెంపరరీ ఉద్యోగం చేస్తూ వుండలేముకదా.

ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్‌నుంచి కాల్ లె టర్ వస్తుందని వెయిట్ చేయడంకన్నా ఈ కాంపిటేటివ్ ఎగ్జామ్స్‌కు ప్రిపేరవుతే బావుం టుంది.

మీరు కామర్స్ సబ్జెక్టులో ఎక్స్‌పర్ట్. మీకు

బ్యాంకులో జాబ్ గ్యారంటీగా వస్తుంది. మీకు నోట్స్ కావాలంటే నేను రాసిస్తాను. మీకే హెల్ప్ కావాలన్నా నేను చేస్తాను. ప్లీజ్... నా మాట వినండి" అగమ్య రిక్వెస్ట్ చేసింది.

ఏమనలేకపోయాడు పాణిగ్రాహి.

ఓ చిన్న కన్‌సర్న్ ఫీలింగ్.

ఒక చిన్న చేయూత.

'నేనున్నాను మీ వెంటే' అన్జెప్పే ఓ చిన్న మాట మనిషికి అమితమైన స్థయిర్యాన్ని, అమితోత్సాహాన్నీ కలగజేస్తుందన్న విషయం అనుభవంలోకి వచ్చింది పాణిగ్రాహికి.

ఇన్నాళ్ళూ తనొక్కడే. తనేం చదవాలో? తనేం చేయాలో? చెప్పడానికి తల్లిదండ్రులకు సరైన అవగాహన లేదు.

తనను గైడ్ చేయడానికి పెద్దవాళ్ళు లేరు. ఓవిధంగా బంధువులంతా ఎప్పుడో తప్పుకొన్నారు. ఆర్థికంగా ఏమాత్రం బలంగా లేని పాణిగ్రాహి కుటుంబంతో సన్నిహిత సంబంధాలు పెట్టుకోవడానికి ఎవరికి మాత్రం ఆసక్తి వుంటుంది?

ఆర్థిక సంబంధాల్లేని, హార్దిక సంబంధాలు ముఖ్యమనుకునే మనుష్యులెందరుంటారు?

ఎప్పుడైతే అగమ్య కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌కు ప్రిపేరవ్వమని చెప్పిందో అప్పుడే అతనికి వేయి ఏనుగుల బలమొచ్చింది. అగమ్య కోసమైనా తను అనుకున్నది సాధించాలనే ఆలోచన వచ్చింది. ఆమె అతనికి ఓ అబ్బురంగా కనిపిస్తోంది. తనకు మాత్రమే దొరికిన అమూల్యమైన వ్యక్తి అగమ్య.

★ ★ ★

భర్త కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌కు ప్రిపేరవ్వడానికి కావలసిన లిస్ట్ అంతా ప్రిపేర్ చేస్తోంది అగమ్య.

బుక్స్, నోట్స్... అన్నీ శ్రద్ధగా సమకూర్చడం మొదలెట్టింది. ఆ ప్రయత్నంలో బడ్జెట్ ఎంత పెరుగుతుందో కూడా తెలుసు. ఇంట్లో బడ్జెట్ కుదించడం కుదరదు.

"అగమ్యా! పోనీ ఇంత రిస్క్ ఎందుకు? వున్నదాంట్లోనే సంతృప్తిపడితే పోలా? " అన్నాడు అగమ్య పడే తాపత్రయం చూసి.

"రిస్క్‌లేనిది ఎందులో?. ఆమాటకొస్తే రిస్క్‌లేకుండా మనం ఏం సాధించగలం చెప్పండి" అంది అతడికి ధైర్యం చెబుతూ అగమ్య.

అగమ్య ధైర్యానికి, ఆలోచనా విధానానికి ముగ్ధుడయ్యాడు. ఆమె పట్టుదలే అతనికి సరికొత్త ఉత్సాహాన్ని ఇచ్చింది.

మరింకేమీ మాట్లాడలేదు పాణిగ్రాహి.

అగమ్య తన ఏర్పాట్లలో వుండిపోయింది.

★ ★ ★

"ఏమండీ, ఇవాళ అమ్మాయి దగ్గరికి వెళ్దామన్నారు గుర్తుందా? " అడిగింది ప్రభావతి భర్తని.

"వెళ్లాలి, గుర్తుంది. కానీ ఒట్టిచేతులతో ఎలా వెళ్దాం? "

"మనకు వున్నదాంట్లో ఏదో ఒకటి తీసుకుని వెళ్దాం" అంది ప్రభావతి.

"మన అగమ్య చాలా అదృష్టవంతురాలు ప్రభా. మంచిమనిషి భర్తగా దొరికాడు. దానికితోడు అత్తమామలు కూడా"

"కానీ, నాకెందుకో అగమ్యను పెద్ద కుటుంబంలో ఇచ్చామేమోననిపిస్తోంది"

"అదేమిటి ప్రభా, అలాగంటావు? "

"అసలే అగమ్య చిన్నపిల్ల. దానికి అప్పుడే మరో ఇద్దరు పిల్లల బాధ్యత. మరిది, ఆడపడుచులు... దానికేం తెలుసని, వాళ్లని చూసుకుంటుంది? " దీర్ఘంగా నిట్టూర్చి అంది ప్రభావతి.

"పరిస్థితులు, అనుభవాలు అన్నీ నేర్పిస్తాయి ప్రభా. అయినా అగమ్య మన బిడ్డ. దానికి సహజసిద్ధంగా, స్వభావసిద్ధంగా అన్నీ అలవడతాయి" చెప్పాడు భావనారాయణ.

"మీరు చెప్పేది నిజమే కావచ్చు కానీ,





నాకెందుకో అప్పుడప్పుడు అగమ్యను తలచుకున్నప్పుడు అలా అనిపిస్తుంది" ప్రభావతి అంది.

"కూతురు ఒకేసారి దూరంకావడంతో నీకు అలా అనిపిస్తుంది. అయినా అమ్మాయి మనకు పెద్దదూరంలో లేదు. ఎప్పుడంటే అప్పుడు వెళ్లిరావచ్చు"

"అలాని మనం ఆడపిల్ల ఇంటికి తరచూ వెళ్లిరాలేం కదండీ" అంది ప్రభావతి.

"ఏదో మాటవరుసకి అన్నాను. సరేలే నువ్వు తొందరగా తెములు. వెళ్లేప్పుడు స్వీట్స్ కొనుక్కెళ్దాం. అన్నట్టు సుందరమూర్తిగారికి పళ్లు తీసుకువెళ్దాం" అన్నాడు.

"అలాగే" అన్నట్టు తలూపి, బట్టలు మార్చుకోవడానికి పక్కగదిలోకి వెళ్లింది ప్రభావతి.

భావనారాయణ టేబుల్ సొరుగులోవున్న ఆల్బం తీసి ఫొటోలు ఒక్కొక్కటి చూడసాగాడు.

అగమ్య పెళ్లిఫొటోలు అవి.

చిన్నప్పుడు తన వేలు పట్టుకు తిరిగిన తన బిడ్డ... భావనారాయణ మనసు వెనక్కి వెళ్లింది.

అప్పుడు అగమ్యకు ఆరేళ్లు. ఎప్పుడూ తండ్రివెంటే ఆయన చేయి పట్టుకుని తిరుగుతూ వుండేది.

"అదేంటి మాస్టారూ, బిడ్డను వదిలివుండలేరా? " అంటూ స్నేహితులు ఆటపట్టించేవారు.

"బిడ్డయినా, నాకు ఫ్రెండయినా అగమ్యే" అంటూ కూతుర్ని చూసి మురిసిపోయేవాడు.

"మరో బాబుని కూడా కనండి" అని ఎవరైనా అంటే నవ్వి

"అగమ్య నాకు బాబే" అనేవాడు. అతని దృష్టిలో ఆడయినా, మగయినా ఒక్కటే. "ఎవరైనా తన బిడ్డే. తన రక్తం పంచుకు పుట్టిన బిడ్డే. అలాంటప్పుడు ఈ తేడాలేమిటి" అనేవాడాయన.

కొడుకైతే, పున్నామ నరకంనుంచి తప్పిస్తాడని కూతురు అత్తారింటికి వెళ్తుందని ఎవరైనా అన్నా ఆయన తేలిగ్గా తీసిపారేసేవాడు.

ప్రేమగా చూసుకుంటే ఎవరైనా ఒక్కటే. "ఎంతమంది కొడుకులు తమ తల్లిదండ్రులను నిర్లక్ష్యం చేయడంలేదు? " అనేది ఆయన ఎదురుప్రశ్న.

అగమ్య అంటే అమితమైన ప్రేమ. దానికి కారణం అగమ్య బిహేవియర్ కూడా. చిన్న వయసులో కూడా ఎంతో ఒద్దికగా వుండేది. తండ్రి ఏం చెప్పినా బుద్ధిగా వినేది. స్కూల్ మానేయడం, అల్లరి చేయడంలాంటి పనులు అసలు చేసేది కాదు.

"కూతుర్ని ఎంత క్రమశిక్షణగా పెంచారు? !" అని ఎవరైనా పొగిడితే,

"నేను క్రమశిక్షణగా పెంచడం కాదు. మా అగమ్యే అలా పెరిగింది" అని చెప్పేవాడు గర్వంగా.

అగమ్య అన్నింట్లోనూ ఫస్టే. అలా ఎదుగుతోన్నకొద్దీ ఒదిగిపోయే అగమ్య అంటే భావనారాయణకు పంచప్రాణాలు.

ఆలోచనల్లోనుంచి బయటకు వచ్చాడు. తన చేయిపట్టుకు తిరిగిన చిట్టితల్లి ఇప్పుడు ఎంత పెద్దదయింది..

ఆల్బం డ్రాయర్ సొరుగులో పెట్టి లేచాడు.

ఇద్దరూ కూతురి దగ్గరకు బయల్దేరారు.

చెప్పాపెట్టకుండా వచ్చిన తల్లిదండ్రులను చూసి ఆశ్చర్యమూ, ఆనందమూ రెండూ కలిగాయి. వాళ్లని సాదరంగా ఆహ్వానించింది.

"అదేమిటి నాన్నా, చెప్పాపెట్టకుండా...? !"

"ఏం రాకూడదా? " తండ్రి అడిగాడు.

"అయ్యో... ఎంతమాట బావగారూ? ! మీరు రావడం మాకు చాలా సంతోషాన్ని కలిగిస్తోంది. ఈ ఇల్లు మీది. ఎప్పుడైనా రావచ్చు" అన్నాడు సుందరమూర్తి.

అగమ్య ఉప్మా చేసి అందరికీ తలో ప్లేటు

ఇచ్చింది.

కుశలప్రశ్నలు పూర్తయ్యాయి.

అగమ్య వంట చేయడానికి ప్రిపేరవుతూ వుంటే అది గమనించిన భావనారాయణ,

"వంటపని పెట్టుకోవద్దు తల్లీ. మేం వెళ్తాం" అన్నాడు.

"అదేంటన్నయ్యా? కూతురింటికి వచ్చి తినకుండా వెళ్తారా? అదేం కుదర్దు. ఈరోజు ఇక్కడే వుండిపోవాలి" అంది చనువుగా మహలక్ష్మి.

"మీ అభిమానానికి కృతజ్ఞులం. వియ్యంకులను ఇంత ప్రేమగా చూసుకునే మిమ్మల్ని చూస్తుంటే చేతులెత్తి నమస్కరించాలనిపిస్తుంది" మనస్ఫూర్తిగా అన్నాడు భావనారాయణ.

"అవేం మాటలండీ? మీ అమ్మాయి మమ్మల్ని తన తల్లిదండ్రుల్ని చూసినట్టు చూస్తుంది. మనదంతా ఒకే కుటుంబం. మీరు, మేమూ వేరు కాదు" సుందరమూర్తి అనడంతో భావనారాయణ కళ్లు చెమర్చాయి.

ఈ సంభాషణ అంతా వింటోన్న అగమ్య మనసు ఆనందంతో ఉప్పొంగింది.

"అమ్మా అగమ్యా! నీతో ఓ విషయం చెప్పిపోదామని వచ్చామమ్మా. ఎటూ వస్తున్నానుకదా. మీ అమ్మకూడా నిన్ను చూస్తానంటే కలిసొచ్చాం"

"అదేంటి నాన్నా, ఇప్పుడు మీరు సంజాయిషీ చెప్పాలా?" అంది నొచ్చుకుంటూ.

"ఛ... ఛ... ఏదో మామూలుగా చెప్పాను. అద్సరే, మొన్న సిటీకి వెళ్లాను కదా. మా ఫ్రెండుకు నీ విషయం చెప్పాను. ఇక్కడ తనకు తెలిసిన ఓ సూపర్‌మార్కెట్ వుందట. అందులో ఉదయం తొమ్మిదినుంచి సాయంత్రం ఆరు వరకూ పని. ప్రస్తుతం ఇది వేణ్ణీళ్లకు చన్నీళ్లలా ఉపయోగపడుతుంది. నువ్వు సరేనంటే నేను వెళ్లి సూపర్‌మార్కెట్ మేనేజర్‌తో మాట్లాడతాను" అన్నాడు తండ్రి.

ఒక్కక్షణం ఆలోచనలో పడింది అగమ్య. ఓ పక్క భర్త కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌కి ప్రిపేరవుతున్నాడు. ఈటైంలో తను ఉద్యోగానికి వెళ్తే, అతనికి నోట్స్ రాసివ్వడం, అతడ్ని కనిపెట్టుకువుండటం...

ఏం చేయాలో తోచలేదు. చివరికి ఓ నిర్ణయానికి వచ్చింది. తను కాస్త ఎక్కువ కష్టపడాలి.

★ ★ ★

"నువ్వు సూపర్‌మార్కెట్‌లో పని చేస్తావా?" ఆశ్చర్యంగా అడిగాడు పాణిగ్రాహి.

"తప్పేముందండీ?" అగమ్య సమాధానం.

"అదికాదు అగమ్యా. అది చాలా హార్డ్ వర్క్. పైగా ఇంట్లో అమ్మానాన్నా వున్నారు. ఇంటిపని, వంటపనీ..."

"అదా మీ అనుమానం? మీకా భయం అక్కర్లేదు. పెందరాళేలేచి పనులన్నీ చేసేస్తాను. రాత్రివేళ కాస్త ఆలస్యంగా నిద్రపోతేసరి"

ఏం చెప్పాలో అర్థంకాలేదు పాణిగ్రాహికి. వద్దని చెప్పడానికి కారణం దొరకడంలేదు. చేయమని చెప్పడానికి మనసొప్పడంలేదు. రెంటిమధ్య ఇబ్బందిగా నలిగిపోతున్నాడు.

"ఆలోచిస్తున్నారేమిటండీ? ఒప్పుకోండి. కాస్త మీకు చేదోడుగా వుంటుంది కూడా"

"నీ ఇష్టం అగమ్యా. నీతో ఎక్కువ పని చేయిస్తున్నానేమోననే ఫీలింగ్ కలుగుతోంది. నిన్ను ఇబ్బంది పెడుతున్నానేమో"

"మనలో మనకు ఇబ్బందులేమిటండీ? మీ కష్టాలు పంచుకునే బాధ్యత నాకు మాత్రం లేదా?"

"అవుననుకో. కానీ..."

"మీరింకేమీ ఆలోచించకండి. అన్నీ బావుంటాయి" అంది అగమ్య.

"సరే, నీ ఇష్టం అగమ్యా. నీకేది మంచిదని తోస్తే అదే చేయి" మనస్ఫూర్తిగా చెప్పాడు పాణిగ్రాహి.

తెల్లవారుఝామునే నిద్రలేచింది. ఇంటి







# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో** పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా **లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని** గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్థంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.




ఎడిటర్:

చతుర

'ఈనాడు' కాంపౌండ్

హైదరాబాద్, 500 082.

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.



**కూపన్**

........... మార్చి నెల చతుర నవల 'అగమ్య'...........

సమీక్షకుని పేరు: ..........................................

చిరునామా: ..........................................

..........................................

..........................................

..........................................

..........................................





పనంతా చకచకా చేసేసింది.

పిల్లలకు టిఫిన్‌బాక్సుల్లో అన్నం సర్దింది. ఎనిమిదిన్నర అయ్యేసరికి అన్నిపనులూ పూర్తిచేసి, బయల్దేరడానికి రెడీ అయ్యింది. భర్తకు, అత్తామామలకు చెప్పి మంచి ముహూర్తం చూసుకుని బయల్దేరింది.



పాణిగ్రాహి బ్యాంకు ఎగ్జామ్స్‌కు ప్రిపేర వుతున్నాడు.

అగమ్య ఓవైపు సూపర్‌మార్కెట్‌లో ఉద యంనుంచి సాయంత్రం వరకూ పనిచే స్తూనే ఇంటి పనులన్నీ చక్కదిద్దుకుం టోంది.

పని ఒత్తిడి పెరిగింది. అలసట ఎక్కువ అవుతోంది. సూపర్‌మార్కెట్ ఎప్పుడూ బిజీగా వుంటుంది. కస్టమర్లతో మాట్లాడ్డం, సరుకుల లిస్ట్ చూసుకోవడం దగ్గర్నుంచి ప్రతి పనీ అగమ్యే చూసుకోవాల్సివస్తోంది.

మొదటిరోజు కష్టమనిపించినా మెల్లమె ల్లగా అలవాటు అవుతోంది.

ఇంట్లోకి కావలసిన సరుకులు సూపర్‌మా ర్కెట్‌నుంచే తెచ్చుకుంటుంది. తను అందు లోనే పనిచేస్తూ వుండడంవల్ల బయట కొన్న దానికన్నా తక్కువ రేటుకే సరుకులు కొనే అవకాశం కలిగింది

వారానికోసారి అఖిలకు, సుందర్‌కు చాక్లెట్స్, బిస్కట్స్ తెస్తుంది.

సూపర్‌మార్కెట్‌నుంచి ఇంటికిరాగానే ఓ యంత్రంలా పనిచేసుకుపోతుంది. మళ్ళా ఇంటిపని, వంటపని షరా మామూలే.

★ ★ ★

ఆరోజు సాయంత్రం సుందరమూర్తి, మహాలక్ష్మి మాట్లాడుకుంటున్నారు.

"చూశావా మహాలక్ష్మీ! అగమ్య మనకు కోడలైనా కొడుకులా డబ్బు సంపాదిస్తూ కూతురిలా సేవలు చేస్తోంది. అఖిలకు సుందర్‌లకు వారానికోసారి ఏదో ఒకటి తెస్తుంది" అన్నాడు సుందరమూర్తి.

"అవునండీ... ఒక్కోసారి అగమ్యను చూస్తే గుండె కలుక్కుమంటుంది. ఓ యంత్రంలా పనిచేసుకుపోతుంది. పనిలో నేను సాయం చేస్తానని అన్నా "వద్ద త్తయ్యా... ఈ వయసులో మీరు రెస్ట్ తీసు కోవాలి" అంటుంది. చిన్నపని కూడా నన్ను చేయనీయడంలేదు" అంది మహాలక్ష్మి.

"ఆ దేవుడు ఎదిగొచ్చిన కూతుర్ని కోడ లిగా పంపిచాడేమోననిపిస్తుంది" అన్నాడు సుందరమూర్తి.

మహాలక్ష్మికీ చాలా సంతోషంగా వుంది. ఈ వయసులో ఏ ఇబ్బందీ కలగకుండా చూసుకునే కోడలు ఎంతమందికి వుంటుంది?

"ఏంటి మహాలక్ష్మి ఆలోచిస్తున్నావు? " భర్త అడగడంతో...

"ఏంలేదండీ... అమ్మాయి తన కోసం ఏమీ చేసుకోవడంలేదు మధ్యాహ్నం లంచ్ బాక్స్‌లో పిడికెడు అన్నం తప్ప. మొన్న సుందర్ చొక్కాకు గుండీలు లేవని, అఖిల యూనిఫామ్ చిరిగిందని తెలిసి రాత్రి చాలాసేపు కూచోని వాటిని కుడుతూనే వుంది"

"పోనీలే. ఈ వయసులో దేవుడు మనకు

మనశ్శాంతిని కోడలి ద్వారా అందించాడు"

ఈ సంభాషణ అప్పుడే కాలేజినుంచి వచ్చిన పాణిగ్రాహి విన్నాడు.

వాళ్ళు మాట్లాడుకున్న దానిలో అతిశయోక్తి ఏమీ అనిపించలేదు.

నిజమే. అగమ్యలాంటి భార్య దొరకడం తన అదృష్టం.

★ ★ ★

బస్టాప్‌లో నిలబడి వుంది అగమ్య. అర గంటనుంచి బస్సు కోసం వెయిట్ చేస్తోంది.

బస్సులు ఆలస్యంగా రావడం ఆనవాయితీ కాబోలు. ఎవరో కామెంట్ చేశారు.

నిదానమే ప్రధానం... అన్న స్లోగన్‌ని అమలుపరుస్తున్నారు. మరెవరో రిటార్టిచ్చారు.

వాళ్ళ కామెంట్స్ వింటూ వుండిపోయింది. పర్సులో డబ్బు వుంది.

ఆరోజు జీతం వచ్చింది.

మొదటి సంపాదన నెలరోజులపాటు సూపర్‌మార్కెట్‌లో తను పనిచేసినందుకు వచ్చిన పారితోషికం.

ఓ చేతిలో క్యారీబాగ్ వుంది.

అఖిలకు, సుందర్‌కు లడ్డు కొన్నది స్వీట్ హౌస్‌లో.

ఉదయమే సుందర్, అఖిల మాట్లాడుకోవడం తను విన్నది.

"సుందర్ లడ్డు బావుంటుందా? బాసుందీ బావుంటుందా? "

"లడ్డు" చెప్పాడు సుందర్.

"జాంగ్రీ బావుంటుందా? లడ్డు బావుంటుందా? "

"లడ్డునే"

"మైసూర్‌పాక్ బావుంటుందా? లడ్డు బావుంటుందా? "

"అబ్బబ్బ... లడ్డునే బావుంటుంది" చికాగ్గా చెప్పాడు సుందర్.

"కోప్పడొద్దు. నాకు లడ్డు తినాలనిపిస్తోంది. నిన్న అన్నయ్యను అడిగితే, లడ్డు తింటే పళ్ళు పాడవుతాయని చెప్పాడు"

"ఒట్టి అబద్ధం" సుందర్ అన్నాడు.

"నిన్నే స్కూల్లో పింకీ వాళ్ళు పుట్టినరోజు అని లడ్డులు పంచారుకదా!"

"అవును. మనకివ్వలేదు"

"మన దగ్గరికి వచ్చేసరికి 'లడ్డు' అయిపోయింది. సారీ అంది పింకీ"

"నాకయితే ఏడుపొచ్చింది".

"నాకూ అంతే"

సూపర్‌మార్కెట్‌కు వెళ్ళడానికి తయారవుతోన్న అగమ్య పిల్లల మాటలు వింటూనే వుంది. ఒక్కక్షణం ఆమె మనసు ద్రవించిపోయింది.

వాళ్ళ మాటల్లో బలమైన ఇష్టం వుంది. ఆ ఇష్టాన్ని చెప్పడానికి ధైర్యం చాలడం లేదు.

తనూ అంతే. చిన్నప్పుడు తనకు ఏదైనా తినాలని వుంటే మనసులోనే చంపుకునేది. చెప్పుకోవడానికి తనకు తమ్ముడో, చెల్లాయో వుంటే బావుండనిపించేది.

సాయంత్రం జీతం డబ్బు ఇవ్వగానే ముందుగా పిల్లలకు లడ్డు కొనాలని నిర్ణయించుకుంది.

స్వీట్‌షాప్‌కు వెళ్ళి లడ్డు ప్యాక్ చేయించింది.

లడ్డు తింటున్నప్పుడు వాళ్ళ కళ్లలో కనిపించే మెరుపు చూడాలి.

ఎప్పుడెప్పుడు ఇంటికి వెళ్దామా? అని వుంది.

బస్సు కోసం ఎదురుచూస్తోన్న అగమ్య దృష్టి రోడ్డుకు అవతలవైపున వున్న షాపు మీద పడింది.

స్వెట్టర్లు, మఫ్లర్లు అమ్ముతున్నారు.

అత్తగారికి స్వెట్టర్ లేకపోవడం, మామగారికి మఫ్లర్ లేకపోవడం గుర్తొచ్చింది. చలికి వణుకుతూ బిగదీసుకుపోవడమూ గుర్తొచ్చింది.

వెంటనే రోడ్డు క్రాస్ చేసింది.

ఓ స్వెట్టర్, మఫ్లర్ తీసుకుంది. ఆ

పక్కనే వున్న రెడీమేడ్ షాప్‌కు వెళ్ళి భర్తకు ఓ చొక్కా తీసుకుంది. తనకు షర్ట్స్ లేకపోవడం గమనిస్తూనే వుంది. అవన్నీ ఒకే కవర్‌లో వేసి మళ్ళీ రోడ్డు క్రాస్‌చేసి బస్టాప్‌కు వచ్చింది.

సరిగ్గా అప్పుడే బస్సొచ్చింది. కిక్కిరిసి వున్న బస్సులోకి అతికష్టమ్మీద ఎక్కి నిలబడింది.

★ ★ ★

అగమ్య ఇంట్లోకి అడుగుపెట్టగానే అఖిల, సుందర్‌లు పరిగెత్తుకొచ్చి అగమ్యను చుట్టేశారు.

"వదినమ్మ వచ్చేసిందోచ్" అంటూ.

వాలుకుర్చీలో కూచొని ఈ దృశ్యాన్ని చూస్తూ చలించిపోయాడు సుందరమూర్తి.

పిల్లలిద్దర్నీ దగ్గరకు తీసుకుని తన పక్కనే కూచోబెట్టుకుంది.

అప్పుడే మొహం కడుక్కొని హాలులోకి వచ్చాడు పాణిగ్రాహి.

బ్యాగులో వున్న స్వీట్ ప్యాకెట్ తీసి ఓపెన్‌చేసి పిల్లల ముందు పెట్టింది.

"హాయ్... లడ్డులు" పిల్లలిద్దరూ ఒకేసారి గట్టిగా అరిచారు సంతోషంతో.

"లడ్డులే... మీ కోసమే తెచ్చాను" అంది అగమ్య.

నిజంగానేనా... అన్నట్టు చూసి పిల్లలిద్దరూ లడ్డులు చేతిలోకి తీసుకున్నారు.

ఇద్దరూ ఇష్టంగా లడ్డులు తింటుంటే మురిపెంగా వాళ్ళవైపు చూసింది అగమ్య.

"లడ్డులు చాలా బావున్నాయి వదినా. మా మంచి వదిన" అంటూ అఖిల వెళ్ళి అగమ్య బుగ్గలమీద ముద్దుపెట్టుకుంది.

నవ్వుకుంది అగమ్య.

"మా అఖిల, సుందర్‌లు కూడా మంచి వాళ్ళు... సరేనా" అంది.

వాళ్ళు అలా ఇష్టంగా తింటూవుంటే తను కన్నపిల్లలే అలా తింటున్న ఫీలింగ్ కలిగింది.

ఆ దృశ్యం చూసి పాణిగ్రాహి చలించిపోయాడు. పెళ్ళికిముందు అతను పెళ్ళి చేసుకోవాలనే విషయంలో ఎంతో భయపడిపోయాడు.

అగమ్య తనింట్లోకి అడుగుపెట్టాక ఆమె ప్రవర్తన, ప్రేమ చూశాక ఒక నిశ్చింత. ఏ భర్తకయినా ఇంతకన్న కావల్సిందేముంటుంది.

★ ★ ★

అత్తయ్యకు స్వెట్టర్ ఇచ్చింది. మామయ్యకు మఫ్లర్ ఇచ్చింది.

"ఇవ్వన్నీ... ఇవెందుకమ్మా" అన్నాడు మొహమాటంగా సుందరమూర్తి.

"ఫర్లేదు మామయ్యా! రోజూ చలికి వణికిపోతున్నారు" అంది అగమ్య.

భర్తకు రెడీమేడ్ షాపులో కొన్న చొక్కా ఇచ్చింది.

"చాలా బావుంది. నీ సెలక్షన్ సూపర్బ్" అన్నాడు చొక్కా ఓసారి తనకు ఎలా వుంటుందో చూసుకుంటూ.

"థాంక్యూ" అంది అగమ్య.

"అదేమిటమ్మా... నీకేమీ తెచ్చుకోలేదా?" అత్తయ్య అడిగింది.

"నాకెందుకత్తయ్యా... బోలెడు చీరలున్నాయి నాకు" అంది అగమ్య.

"అది కాదమ్మా. నువ్వు ఓ స్వెట్టర్ తెచ్చుకోపోయావా? పొద్దున్నే లేచి పనిచేస్తావు. చలికి వణుకుతావు" అంది మహాలక్ష్మి.

"నాకు స్వెట్టర్ వేసుకోవటం ఇష్టం వుండదత్తయ్యా. అయినా నాకు ఎక్కువగా చలి వేయడంలేదు" అంది అగమ్య.

సుందరమూర్తికి అర్థమైంది. కావాలనే కోడలు అలా మాట్లాడుతోందని.

తమకోసం అన్నీ తెచ్చి... సుందరమూర్తి మనసు భారమైంది.

ఓ మనిషి ద్వేషాన్నే కాదు, అతిప్రేమను, మంచితనాన్ని కూడా భరించడం కష్టమేనని ఆ క్షణమే అర్థమైంది.

కోడలి ప్రేమను చూసి అతనిలోని తండ్రి మనసు ఆర్ద్రమైంది.

రాత్రి పడుకునేముందు పర్సులో నుంచి డబ్బు తీసి భర్తకు ఇచ్చింది అగమ్య.

"ఇవ్వాళ సాలరీ ఇచ్చారు"

"నీ దగ్గరే వుండనీ. నువ్వు కష్టపడి సంపాదించిన డబ్బు" సిన్సియర్‌గానే అన్నాడు పాణిగ్రాహి.

"అదేమిటండీ. ఈ ఇంట్లో ఉపయోగప డాలి. నేను ఈ ఇంట్లో ఓ మెంబర్‌ని" అంది.

"అవుననుకో" ఆ డబ్బును తీసుకోవడానికి ఇబ్బందిపడుతూ అన్నాడు.

"ఇలా నన్ను ఈ కుటుంబంనుంచి వేరు చేసే మాటలు మరోసారి మాట్లాడకండి. నేను మీ శరీరంలోనే కాదు. ఈ ఇంటి బాధ్యతలోనూ సగభాగాన్ని" అంది అగమ్య.

ప్రేమతో అగమ్యను దగ్గరకు తీసుకు న్నాడు పాణిగ్రాహి.



సూపర్‌మార్కెట్ రద్దీగా వుంది. నెల మొదటివారంలో రద్దీ వుంటుంది.

అగమ్య సరుకులు తనిఖీ చేస్తోంది. సూపర్‌మార్కెట్‌కు వచ్చినరోజునే ఆమె చాలా విషయాలు గ్రహించింది.

ఆ సూపర్‌మార్కెట్ పెద్దదేకానీ రద్దీ కాస్త తక్కువగా వుంటుంది. అమ్మకాల విష యంలో కూడా పెద్ద ప్రోగ్రెస్ లేదు.

దానిక్కారణం అన్వేషించడం మొదలుపె ట్టింది. మార్కెట్‌లో ఎంతో నాణ్యత కలి గిన వస్తువులను విక్రయిస్తోన్నా ఎందుకు తమ సూపర్ మార్కెట్ డల్‌గా వుందో బోధపడింది.

స్టాఫ్ బిహేవియర్. ఇది చాలా ముఖ్య మైన విషయం.

కస్టమర్‌కు సంతృప్తి కలగకపోతే మళ్లీ రారు. సూపర్‌మార్కెట్‌లో పనిచేసే సిబ్బంది నీట్‌గా వుండాలి. ఎప్పుడూ మొహంమీద నవ్వు పులుముకుని సిన్సియర్లీ యువర్స్ అన్నట్టు వుండాలి. కస్టమర్లకు ఏం కావాల్సివచ్చినా విసుక్కోకుండా వుండాలి. అవసరమైతే వాళ్లకు సాయం చేయాలి. ఇవన్నీ కస్టమర్ల దృష్టిలో ప్లస్ పాయింట్లే.

ఆరోజు ఓ ముసలావిడ వచ్చింది. ఆవిడ సరిగ్గా నడవలేకపోతోంది.

వెంటనే అగమ్య సాయంగా వెళ్లింది. ఆమెకు ఏమేం కావాలో అడిగి తెలుసుకుని తనే ఆ సరుకులన్నీ తీసుకువచ్చి నీట్‌గా ప్యాక్ చేసేవరకూ వుంది.

ఆటోని పిలిపించింది.

ఆ ముసలావిడ ఆటోలో కూర్చుని "నూరేళ్లు వర్ధిల్లు తల్లీ. ఈ సూపర్‌మార్కె ట్‌కు చాలాకాలం నుంచి వస్తున్నాను. ఎప్పుడూ ఇలా చక్కగా చూసి ఎరుగరు. స్టాఫ్ విసుక్కునేవాళ్లు. ఆటోని పిలిచిపెట్టు బాబూ అని బ్రతిమాలినా పిలిచేవాళ్లు కాదు. విధిలేక ఇక్కడికి వస్తున్నాను అను కుని బాధపడేదాన్ని. ఇవాళ నిన్ను చూశాక, ఎప్పుడూ ఈ సూపర్‌మార్కెట్‌కే రావాలి అన్పిస్తోంది" అంటూ కాంప్లిమెంట్ ఇచ్చింది.

అదేరోజు మధ్యాహ్నం ఓ నిండుగర్భిణీ వచ్చింది. అగమ్య ఆమెకు దగ్గరుండి సర్వీస్ చేసింది. ఇదంతా ఆ మార్కెట్ ఓనర్ గమ నిస్తూనే వున్నాడు.

ఎప్పుడైతే కస్టమర్స్ హేపీగా ఫీలవుతారో, ఆటోమేటిగ్గా అదే మార్కెట్‌కు రావడం మొదలెడతారు. ఇంకా పదిమందికి చెప్పగ లుగుతారు. ఇన్నాళ్లూ ఈ వ్యాపారంలో వుండికూడా ఈ చిన్న విషయం గమనించ లేకపోయాడు. అదే పనిని ఓ ఆడపిల్ల సక్ర మంగా నిర్వర్తించడం అతనికి చాలా సంతో షాన్ని ఇచ్చింది.

అదే విషయాన్ని లంచ్‌టైంలో ఓనర్ అగమ్య దగ్గర ప్రస్తావించాడు. "నాకు చాలా సంతోషంగా వుందమ్మా నీలాంటి వ్యక్తి దొరికినందుకు"

"ఇది నా డ్యూటీ. అందుకు నేను శాలరీ కూడా తీసుకుంటున్నాను" అంది అగమ్య.





"డ్యూటీ వేరు. సిన్సియారిటీ వేరమ్మా. అందరూ డ్యూటీ మాత్రమే చేస్తారు. పది నుంచి ఆరు వరకు, పది నుంచి ఎనిమిది వరకూ... తమ పనిగంటలను ఏదో పూర్తి చేశామనిపిస్తారు. కానీ నువ్వు సిన్సియర్‌గా నీ డ్యూటీ చేస్తున్నావు" అభినందనపూర్వకంగా అన్నాడతను.

"ఏ సంస్థ అయినా వృద్ధిలోకి రావాలంటే అందుకు స్టాఫ్ కూడా కృషిచేయాలి అనేది నా నమ్మకం సార్. సంస్థ బావుంటే స్టాఫ్ బాగోగులు సంస్థే శ్రద్ధగా చూసుకుంటుంది"

అబ్బురంగా చూశాడు అగమ్యవైపు. కష్టాల్లో సైతం సుఖం దాగుందని, విషాదంలో సైతం చిర్నవ్వు చిందించగలననే ఆత్మవిశ్వాసం ఆమె మొహంలో స్పష్టంగా కనిపిస్తోంది.

"ఏనీవే, నీకు అభినందనలే కాదు కృతజ్ఞతలు కూడా తెలియజేయడం నా బాధ్యత. ఈ సూపర్‌మార్కెట్ నీదేననుకోమ్మా. దీని అభివృద్ధి కోసం ఏం చేస్తే బావుంటుందో, ఎలా చేస్తే బావుంటుందో నీ ఇష్టం.

ఏం చేయాలో చెప్పు. ఎలా చేయాలో చెప్పు ఆచరించడం నా వంతు. ఇక ఈ విషయంలో నేను నిశ్చింతగా వుంటాను" మనస్ఫూర్తిగా అన్నాడు సూపర్‌మార్కెట్ ఓనర్.

"మీ అభిమానానికి, నామీద వున్న నమ్మకానికి కృతజ్ఞతలు సార్. నా శాయశక్తులా ఈ మార్కెట్ అభివృద్ధికి కృషి చేస్తాన్సార్" చెప్పింది అగమ్య సిన్సియర్‌గా.

★ ★ ★

బ్యాంకు ఎగ్జామ్స్‌కు రాత్రింబవళ్లు చదువుతూ ప్రిపేరవుతున్నాడు పాణిగ్రాహి. అగమ్య మాగ్జిమం కోపరేట్ చేస్తోంది.

నోట్సు రాసివ్వడం, రాత్రిళ్లు భర్తతోపాటు మేల్కొని, గంటకోసారి టీ కాచి ఇవ్వడం, ఇవన్నీ చేస్తూ ఏ అర్ధరాత్రో నిద్రలోకి జారుకుని, మళ్లీ తెల్లవారకముందే నిద్రలేవడం అగమ్యకు అలవాటయింది.

అయినా ఈ శ్రమను ఇబ్బందిగాకాక ఇష్టంగానే భావిస్తుంది. ఇష్టమైనవాళ్ల కోసం కష్టమైనా ఇష్టంగానే ఫీలవ్వాలనేది ఆమె స్థిరమైన అభిప్రాయం.

★ ★ ★

కాలం ఎప్పుడూ ఒకేలా వుండదు. కాలానికి దయాదాక్షిణ్యాలు, తమతర బేధాలు వుండవు. అది నిరంతరం ముందుకు సాగిపోతూనే వుంటుంది.

కాల ప్రవాహంలో కొట్టుకువచ్చే విషాదాలు అలానే వుంటాయి.

తిరుపతి వెళ్తోన్న టూరిస్టుబస్సు ప్రమాదానికి గురయింది.

అగమ్య పెళ్లయితే తిరుపతికి వస్తామని భావనారాయణ దంపతులు మొక్కుకున్నారు. ఆ మొక్కు చెల్లించుకోవడానికి తిరుపతికి టూరిస్టుబస్సులో వెళ్లి, తిరిగివస్తూ ఘాట్‌రోడ్డులో ప్రమాదానికి గురై, బస్సులోని చాలామంది అక్కడికక్కడే చనిపోయారు.

అందులో భావనారాయణ, అతని భార్య ప్రభావతి కూడా వున్నారు.

భర్త కాంపిటీటివ్ ఎగ్జామ్స్ కోసం నోట్స్ ప్రిపేర్ చేస్తోన్న అగమ్యకు అప్పుడే తెలిసింది ఈ దుర్వార్త.

తల్లిదండ్రులిద్దరూ ఒకేసారి చనిపోయారనే ఘోరమైన వార్త.

మృతదేహాలను ఇంటికి తరలించారు. ఆ ఇల్లు నిశ్శబ్దంగా వుంది.

శ్మశాన వాతావరణం అలుముకుని వుంది.

శుభకార్యానికి తరలివచ్చే బంధుమిత్రులు అశుభకార్యానికి వస్తారా? ఎంతో అభిమానం, మానవతా దృక్పథం వుంటే తప్ప.

భావనారాయణకు బంధువర్గం అంతా అవసరం కోసం ఆయన వద్దకు వచ్చేవాళ్లే. ఆయన అవసరం వున్నంతవరకూ ఆయన చుట్టూ చేరేవారే.

ఇప్పుడు చనిపోయిన భావనారాయణ

అవసరం ఎవరికీ లేదు.

చివరిసారిగా ఆయనను చూడ్డానికి కొద్ది మంది శ్రేయోభిలాషులు, మిత్రులు, ఆయన శిష్యులూ వచ్చారు.

అగమ్య మోకాళ్లమధ్య తల పెట్టుకుంది. కన్నీళ్లు కూడా రావడంలేదు. విషాదం ఘనీ భవించింది. ఆమె కళ్లలో కన్నీళ్లు ఎప్పుడో ఇంకిపోయాయి.

ఒక విచిత్రమైన విషాదస్థితిలో వుంది.

బతికివున్న రోజుల్లో తండ్రి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. 'జాతస్యహి ధ్రువో మృత్యుః'... పుట్టిన వ్యక్తి గిట్టక మానడు. నిజమే. కానీ, తన తండ్రి ఆకస్మికమరణం తట్టుకోవడం ఎలా?

తిరుపతి వెళ్లేముందు ఆయన మాట్లాడిన మాటలు ఇంకా తన చెవుల్లో గింగురుమం టూనే వున్నాయి.

"తిరుపతికి వెళ్లి, వెంకటేశ్వరుడ్ని దర్శించు కుని, నీకన్నీ శుభాలే జరగాలని కోరుకుం టాను తల్లీ. నేను వచ్చేసరికి నాకో మంచి శుభవార్త చెప్పాలి" అన్నాడు.

కానీ, తనే ఓ దుర్వార్త అయివచ్చాడు. ఇన్నేళ్లూ తనని పెంచి తనకో స్నేహితుడిలా వున్న మనిషి చనిపోవడం ఎంత బాధా కరం?

తననెప్పుడూ కూతురిలా చూడలేదు. ఓ స్నేహితురాలిలా చూశాడు. తన మనసుకు నచ్చిన పనిని చేసే స్వేచ్ఛ ఇచ్చాడు. చివ రికి తన పెళ్లి విషయంలో కూడా.

"తలకొరివి ఎవరు పెడతారు?" ఎవరో అడుగుతున్నారు.

"పాపం కొడుకుల్లేరుగా" ఇంకెవరో సాను భూతి చూపిస్తున్నారు.

"పోనీ, తమ్ముని పిల్లలెవరైనా వున్నారా?" ఇలా రకరకాల కామెంట్లు.

అప్పుడు తలెత్తి భర్తను దగ్గరకు పిలిచి చెప్పింది.

"ఏమండీ... నాన్నకు దహనసంస్కారాలు నేనే చేస్తాను"

"నువ్వా" ఆశ్చర్యంగా అడిగాడు పాణి గ్రాహి.

"తప్పేముందండీ... ఆయనకు కొడుకు నైనా, కూతురినైనా నేనే. ప్లీజ్"

ఒక్కక్షణం ఇబ్బందిగా చూశాడు.

"పోనీ... నేనే చేసేదా?" పాణిగ్రాహి అడిగాడు.

కృతజ్ఞతాపూర్వకంగా భర్తవైపు చూసి చేతులు జోడించి...

"మామని తండ్రిగా భావించే మీ సంస్కా రానికి రెండు చేతులూ జోడిస్తున్నాను. కానీ, నాన్నకు నేనే తలకొరివి పెట్టాలి. ఎప్పుడూ నాన్న అనేవాడు 'నాకు పున్నామ నరకం... లాంటి భయాలు లేవు. బతికి వుండగా అనుభవించేది సుఖం, దుఃఖం, కష్టం, ఇష్టం, చిర్నవ్వు... విషాదం. నేను చనిపోయినా, నువ్వే నాకు అంతిమ సంస్కారం చేస్తావు... కదూ...' నాన్నగారి మాటలు ఇంకా నాకు వినిపిస్తూనే వున్నాయి. ప్లీజ్" మొహాన్ని చేతుల్లో దాచు కుని ఏడుస్తూ అంది అగమ్య.

పాణిగ్రాహి ఇంకేమీ మాట్లాడలేదు. ఆ ఏర్పాట్లలో వుండిపోయాడు.

అక్కడికి వచ్చిన కొద్దిపాటి బంధువులు రకరకాల కామెంట్లు చేశారు.

అయినా అగమ్య పట్టించుకోలేదు.

మనం ఓ విషయాన్ని స్థిరంగా నమ్మినప్పుడు, దాన్ని తు.చ. తప్పకుండా ఆచరించాలి.

అందుకే ఎవరి కామెంట్లని పట్టించుకో లేదు.

కొంతమంది మాత్రం అగమ్య నిర్ణయాన్ని బలపరిచారు.

ఆరోజు సాయంత్రమే తల్లిదండ్రులకు దహనసంస్కారాలు జరిగాయి.

భారమైన హృదయంతో శ్మశానంనుంచి ఇంటికి తిరిగివచ్చింది.

★ ★ ★

పది రోజులు భారంగా గడిచాయి. ఈ





పదిరోజులూ తల్లిదండ్రుల జ్ఞాపకాలే అగమ్యను వెంటాడాయి.

కర్మకాండలు పూర్తయ్యాక కొంతమంది వచ్చారు తండ్రి చేసిన అప్పుల తాలూకు లెక్కలు చూడ్డానికి.

తన పెళ్ళికోసం, తన చదువుకోసం తండ్రి చాలానే అప్పులు చేయాల్సివచ్చిందన్న విషయం అప్పుడు తెలిసింది అగమ్యకు.

ఒకరిద్దరైతే... "మేము కేవలం మీ నాన్న గారి మాట నమ్మి, ఏ కాగితమూ, లేకుండా అప్పు ఇచ్చాం. మీరు ఇప్పుడు ఇవ్వనని మొండి చేయి చూపించినా ఏమీ చేయలేము" అన్నారు.

అగమ్య స్థిరంగా చెప్పింది.

"నాన్న చనిపోయినా కూడా మా మనసుల్లో బతికే వుండాలి. ఆయనకు అపకీర్తి రాకూడదు. ఆయన మీకు ఇవ్వవలసిన ప్రతీపైసా మీకు నేను చెల్లిస్తాను"

తండ్రి వున్న ఇల్లు తాకట్టులో వుందని తెలిసింది. తండ్రికి సంబంధించిన ఆస్తిపాస్తులు అన్నీ బేరానికి పెట్టింది.

అప్పులు పోగా... ఓ పదివేలు మిగిలాయి.

తండ్రి తాలూకు ఋణాలు తీరాయి. భవబంధాలు తెంచుకొని వెళ్ళిపోయిన తండ్రికి మిగిలివున్న ఋణం తనే... తనే తండ్రి ఋణం తీర్చుకోలేదు.

భర్తను అడిగింది అగమ్య.

"నాన్న తాలూకు డబ్బు పదివేలు వుంది. ఏం చేయమంటారు? " అని.

"నీ ఇష్టం అగమ్యా. నీకేది మంచిదని తోస్తే అది చేయి... నీమీద నాకు పూర్తి నమ్మకం వుంది" చెప్పాడు పాణిగ్రాహి.

"ఆ మిగిలిన డబ్బును నాన్న పేరుమీదుగా క్యాన్సర్ ఇనిస్టిట్యూట్‌కు విరాళంగా ఇద్దామని అనుకుంటున్నాను" చెప్పింది అగమ్య.

మెరిసే కళ్ళతో అభినందనపూర్వకంగా, అభిమానంగా భార్యవైపు చూసి అన్నాడు పాణిగ్రాహి.

"నిన్ను చూస్తోంటే నాకు చాలా గర్వంగా వుంది అగమ్యా. చాలా మంచి పని చేస్తున్నావు"

"థాంక్సండీ... నా పనికి మీ అంగీకారం ఓ పెద్ద గుర్తింపు" అంది అగమ్య.

అనుకున్నట్టుగానే ఆ డబ్బును క్యాన్సర్ ఇనిస్టిట్యూట్‌కు డొనేట్ చేసింది.

ఆ డబ్బు క్యాన్సర్ బాధితులకు ఉపయోగపడితే చాలు.

ఆ తృప్తి ఆమెకు కొండంత వూరట.

ఇప్పుడు తల్లిదండ్రుల తాలూకు ఆస్తిపాస్తులు ఏమీలేవు. వాళ్ళ జ్ఞాపకాలు, వాళ్ళ ఫొటోలు తప్ప.

ఆజానుబాహుడు, ఎప్పుడూ చిర్నవ్వుతో, తెల్లటి బట్టలతో మెరిసిపోతూ, నోరారా తల్లీ అని పిలిచే తండ్రి పిలుపు... ఆమెలో పదిలంగా అలానే వుంది.

★ ★ ★

కొన్ని గాయాలకు మందులుంటాయి. మరికొన్ని గాయాలకు కాలమే మందు. ఆ గాయాన్ని కాలం మాన్పినా, ఆ గాయం తాలూకు మచ్చ అలానే మిగిలిపోతుందేమో.

రోజులు గడుస్తూనే వున్నాయి.

తల్లిదండ్రుల తాలూకు దుర్మరణం బాధ నుంచి కొద్దికొద్దిగా తేరుకుంటోంది అగమ్య.

భర్తకు ఎగ్జామ్స్ దగ్గరపడ్డాయి.

మరోవైపు అత్తమామల ఆరోగ్యం కూడా సరిగ్గా వుండడంలేదు.

ఇంకోవైపు సూపర్‌మార్కెట్‌లో పని ఎక్కువగా వుంటోంది.

ఇన్ని పనులవల్లా సతమతమవుతూ కూడా ఎప్పుడూ తన అలసటను, చికాకును బయటకు వ్యక్తపర్చలేదు అగమ్య.

తన పనులు తను చకచకా చేస్తూనే వుంది.

తెల్లవారితే ఎగ్జామ్స్

అగమ్యకు జ్వరంగా వుంది. అయినా ఆ

విషయం భర్తకు కానీ అత్తమామలకు కానీ తెలియనివ్వలేదు.

గంటకోసారి భర్తకు వేడివేడి టీ చేసి ఇస్తూ వుంది.

నోట్స్ అన్నీ తనే దగ్గరుండి అతనికి అందిస్తూ వచ్చింది.

అతని కోసం తనే కొన్ని బుక్స్ రిఫర్‌చేసింది. అవి చెబుతూవుంది.

అలా... ఆ రాత్రంతా మెలుకువగా వుంది. భర్త ఎగ్జామ్‌కు వెళ్లేవరకు ఓపికచేసుకుంది. ఆ తర్వాత ఇక ఆగలేక నీరసించి, కళ్లు తిరిగి పడిపోయింది.

★ ★ ★

"ఎగ్జామ్ ఎలా రాశారు?" అడిగింది భర్తని సాయంత్రం వచ్చాక.

"చాలా బాగా రాశాను. ఇదంతా నీ క్రెడిటే... నువ్వేంటి డల్‌గా వున్నావు?" అడిగాడు పాణిగ్రాహి.

"వదిన ఉదయం కళ్ళు తిరిగి పడిపోయిందన్నయ్యా" చెప్పింది అఖిల.

కంగారుగా చూసి "అవునా?" అడిగాడు.

"ఏదో జస్ట్ కళ్ళు తిరిగాయి లెండి" అంది అగమ్య.

నుదిటిమీద చేయేసి చూశాడు. వళ్లు కాలిపోతోంది.

"ఇదేంటి ఇంత జ్వరంగా వుంది"

"మామూలు జ్వరమే లెండి" అంది తేలిగ్గా తీసిపారేస్తూ.

"ఒరేయ్... నువ్వు అమ్మాయిని హాస్పిటల్‌కు తీసుకెళ్లరా... ఉదయం నుంచి నీరసంగానే వున్నా పాపం పనులు చేస్తూనే వుంది. మమ్మల్ని చిన్న పని కూడా చేయనీయలేధు" చెప్పింది తల్లి.

"అత్తయ్యగారు నామీద ప్రేమతో అలాగే అంటారుగానీ, నాకేమీ కాలేదు. డాక్టరుకు ఫీజులు అవీ దండగ" అంది అగమ్య.

కానీ రాత్రయ్యేసరికి జ్వరం ఎక్కువయింది. భర్తకు దగ్గరగా పడుకుంటే తన జ్వరం అతనికి తగులుతుందేమోనని భయమేసింది. పైగా, అతను కంగారుపడతాడు. అందుకే అతనికి దూరంగా జరిగి అతనికి ఏమాత్రం నిద్రాభంగం కాకుండా పడుకుంది.

పొద్దున్నే ఇంటిపని, వంటపని పూర్తిచేసే అగమ్య ఇంకా నిద్రలేవక పోవడంతో మహాలక్ష్మి కొడుకుని నిద్రలేపింది.

పాణిగ్రాహి నిద్రలేచి, ఇంకా పడుకునే వున్న అగమ్యను నిద్రలేపి ఉలిక్కిపడ్డాడు.

శరీరం వేడితో మసలిపోతోంది. వెంటనే డాక్టర్‌ని పిలుచుకువచ్చాడు.

ఆ లేడీ డాక్టర్ మొత్తం పరీక్ష చేసి చెప్పింది. "పని ఎక్కువ కావడం, రెస్ట్‌లెస్‌గా వుండటం, మానసికంగా బాధపడ్డం, సరైన ఫుడ్డు తీసుకోకపోవడం ఇవ్వన్నీ ఈ సిక్‌నెస్‌కు కారణాలు. మీరు ఆవిడను చాలా కేర్‌ఫుల్‌గా చూసుకోవాలి" చెప్పింది డాక్టర్.

"అలాగే డాక్టర్" అన్నాడు పాణిగ్రాహి.

"అన్నట్టు మరో విషయం ఇది మీకు గుడ్ న్యూసే" అని ఆగి "కంగ్రాట్స్... మీరు తండ్రి కాబోతున్నారు. షీఈజ్ క్యారీయింగ్" చెప్పింది డాక్టర్.

మరో క్షణంలో ఆ ఇంట్లో ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి.

"థాంక్యూ థాంక్యూ అగమ్యా" అన్నాడు అగమ్య చేతులు పట్టుకొని వూపుతూ పాణిగ్రాహి.

బలహీనంగా నవ్వింది అగమ్య.

అగమ్య ప్రెగ్నెంట్ అని డాక్టర్ చెప్పడంతో ఇంటిల్లిపాదీ సంతోషించారు.

వాళ్ళిద్దర్నీ ఆ గదిలో వదిలి హాలులోకి వచ్చారు సుందరమూర్తి దంపతులు.

అఖిల, సుందర్‌లు బయట ఆడుకుంటున్నారు.

"నీకు సంతోషంగా లేదా అగమ్యా" అడిగాడు భార్య ముఖంలోకి చూస్తూ.

"ఏ స్త్రీ అయినా తల్లి కావాలని అనుకుంటుందండీ... నాకూ సంతోషంగానే వుంది. కానీ ఇప్పుడీ పరిస్థితిలో" అంది అగమ్య.

"మన ఆర్థిక పరిస్థితి గురించి ఆలోచిస్తున్నావా? " అడిగాడు పాణిగ్రాహి.

అవునన్నట్టు తలూపింది అగమ్య.

"ఎప్పుడూ మన పరిస్థితి ఒకేలా వుంటుందా? " అన్నాడు పాణిగ్రాహి.

"అందుకే ఆలోచిస్తున్నాను. ప్రస్తుత పరిస్థితిని దృష్టిలో పెట్టుకోవాలిగా"

"అవుననుకో. అయినా అన్నీ సర్దుకుంటాయి. నువ్వు ఇవేమీ మనసులో పెట్టుకోవద్దు. డాక్టర్‌గారు మానసికంగా స్ట్రెయిన్ అవద్దని చెప్పారు"

భర్త గుండెలో తలపెట్టి కళ్లు మూసుకుంది అగమ్య.

★ ★ ★

ఆరోజు ఆదివారం.

పొద్దున్నే లేచి, టిఫిన్‌చేసి ఇల్లు సర్దే పనిలో వుంది అగమ్య.

మహాలక్ష్మి కోడలిని పనిచేయవద్దని వారించినా వినలేదు.

ఈ వయసులో అత్తయ్యతో పనిచేయించడం సుతారమూ ఇష్టంలేదు అగమ్యకు.

"అసలే ఒట్టి మనిషివి కూడా కాదు. నేను చేస్తాన్లే" అంది మహాలక్ష్మి.

"ఈ చిన్న చిన్న పనులకు మీరెందుకత్తయ్యా" అంటూ అత్తమామలను సున్నితంగా తిరస్కరించింది.

ఇల్లు దులుపుతోంది.

సరిగ్గా అప్పుడు వచ్చారు అఖిల, సుందర్‌లు.

బూజుకర్రని ఓ మూలన పెట్టి, తనకు ఏదో చెప్పాలని వచ్చిన పిల్లలను చూసి, వాళ్ళిద్దర్నీ దగ్గరకు రమ్మని పిలిచింది.

ఇద్దరూ వదిన దగ్గరకు వచ్చి నిలబడ్డారు.

"ఏం కావాలి? " అడిగింది వాళ్ళను దగ్గరకు తీసుకొని.

మౌనంగా తల వంచుకున్నారు.

"చెప్పండి. ఏంకావాలి? స్వీట్సా? " అడిగింది అగమ్య.

ఇద్దరూ తలలు అడ్డంగా ఊపారు.

"ఎక్స్‌కర్షన్‌కు ఏమైనా వెళ్తారా? స్కూల్లో వెళ్తున్నారా? "

అదీ కాదన్నట్టు తలలు మళ్ళీ అడ్డంగా ఊపారు.

చిర్నవ్వుతో వాళ్ళనే చూస్తూ "చెప్పండి. మీరు మంచివాళ్ళు కదూ"

"మనింటికి... మనంటికీ"

"ఊc... మనింటికి"

"నువ్వే చెప్పు" అన్నట్టు సుందర్‌వైపు చూసింది అఖిల.

"ఊహూ... నువ్వే చెప్పు" అన్నట్టు చూశాడు సుందర్.

ఇద్దర్నీ పరిశీలనగా చూసింది. తనతో వాళ్ళు ఏదో చెప్పాలని అనుకుంటున్నారు.

ఏదో చెప్పడానికి సంశయిస్తున్నారని అర్థమైంది.

"వదిన దగ్గర భయమెందుకు చెప్పండి"

"మనింటికి... మనింటికి ఇంకో బుజ్జిపాపాయి వస్తుందా? " అడిగింది అఖిల.

మొదట అర్థం కాలేదు. మెల్లమెల్లగా అర్థమై, సిగ్గుతో కూడిన చిర్నవ్వు ఆమె పెదాలమీద ప్రత్యక్షమైంది.

"అవును. మరి మీరు ఆడుకోవడానికి ఓ బుజ్జి పాపాయి కావాలికదా" అంది.

వెంటనే అఖిల మొహం తిప్పుకుంది.

"మరేం వద్దు" ఉక్రోషంగా అన్నాడు సుందర్.

"అదేం? " అడిగింది అగమ్య.

"మరో పాపాయి వస్తే ఆ పాపాయి నిన్ను అమ్మా... అని పిలుస్తుంది కదా. అప్పుడు... అప్పుడు నువ్వు మమ్మల్ని ఇంతే ప్రేమగా చూసుకుంటావా? " సుందర్ అడిగాడు.

"చూసుకోవు కదూ" అఖిల అంది ఏడుపు మొహంపెట్టి.

అగమ్యకు ఒక్క క్షణం అర్థంకాలేదు.

"మా స్కూల్‌లో బబ్లూ వదిన కూడా అలాగే చేసిందట. వాళ్ళ వదిన అంతకు ముందు బాగానే చూసుకుందిట. వదినకు

ఓ బాబు పుట్టగానే, వాడిని చూడట్లేదట. ఎప్పుడూ ఆ బాబుని ఎత్తుకుంటూ వుంటుందట" అఖిల తెలిసీ తెలియని తనంతో చెప్పింది.

వాళ్ళ ఫీలింగ్ అర్థమైంది అగమ్యకు. చిత్రంగా వాళ్ళమీద కోపంరాలేదు. ప్రేమ మరింత పొంగుకొచ్చింది.

చాలా సహజమైన ఫీలింగ్.

రేపు తనకు పుట్టబోయే బిడ్డమీద ప్రేమ పెరిగి వాళ్ళను నిర్లక్ష్యం చేస్తానేమోననే భయం.

"చెప్పు వదినా. రేపు ఓ బుజ్జిపాపాయి వస్తే మమ్మల్ని ప్రేమగా చూడవా? "

ఏదో చెప్పబోయింది అగమ్య.

"అలా అయితే బుజ్జిపాపాయి మనకొద్దు" సుందర్ విసురుగా అన్నాడు.

అప్పుడే అటుగా వచ్చిన మహలక్ష్మి పిల్లల మాటలు విని, కోపంగా వాళ్ళ దగ్గరకి వచ్చి "వేలెడంతలేరు పెద్ద పెద్ద మాటలు మాట్లాడతారా? వీపు చీరేస్తాను. పదండి అవతలికి" అంటూ వాళ్ళ వీపుమీద నాలుగు చరిచింది.

"అత్తయ్యా.." ఏదో అనబోయింది అగమ్య.

"నువ్వు వీళ్ళని ఇంకా గారాబం చేయకమ్మా. వేలెడంతలేరు. పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతున్నారు. వాళ్ళకు ఇలానే చనువిస్తే రేపు పుట్టే బిడ్డని ద్వేషంగా చూడ్డం మొదలెడతారు" అంది మహలక్ష్మి.

అఖిల, సుందర్ హాలులో బిక్కు బిక్కుమంటూ కూచున్నారు.

అగమ్య వాళ్ళ దగ్గరకు వెళ్ళింది.

వదినను చూసి భయపడిపోయారు.

వాళ్ళిద్దర్నీ గుండెలకు హత్తుకుంది. ఆమె కళ్ళు కన్నీళ్లను వర్షిస్తున్నాయి.

"మీరంటే నాకు బోల్డు ప్రేమర్రా. నాకు ఆల్రెడీ మీరిద్దరూ బిడ్డలే. మీ తర్వాత మూడోబిడ్డ. సరేనా" అంది.

"నిజమా వదినా? " సుందర్ మెరిసే కళ్ళతో అన్నాడు.

"కాదా మరి. నువ్వే నా పెద్ద కొడుకువి" అని అఖిలవైపు తిరిగి, "నువ్వు పెద్ద కూతురివి సరేనా" అంది.

"మా మంచి వదిన" అంటూ ఇద్దరూ సంతోషంగా అగమ్యను అల్లుకుపోయారు.

వంటగదిలోనుంచి ఆ దృశ్యం చూసిన మహలక్ష్మి చీరకొంగుతో కళ్ళొత్తుకుంది.

అమ్మ స్థానంలో వదినమ్మ వుండడం ఆ పిల్లలు చేసుకున్న అదృష్టం అనుకుంది.

పాణిగ్రాహికి బ్యాంకులో ఉద్యోగం వచ్చింది. రిజిస్టర్‌పోస్ట్‌లో వచ్చిన అపాయింట్‌మెంట్ ఆర్డర్ చూసి పొంగిపోయాడు. ఆ ఆనందాన్ని అగమ్యతో పంచుకోవాలన్న బలమైన కోరిక అతనిలో క్షణక్షణానికి పెరిగిపోతోంది. కాలేజినుంచి వస్తుంటే పోస్ట్‌మేన్ కలిసి రిజిస్టర్ కవర్ ఇచ్చాడు.

అగమ్య ఆనందానికి అవధుల్లేవు.

"ఇదంతా నీ అదృష్టమేనమ్మా. రాత్రింబవళ్ళు నువ్వు మెలుకువగా వుండి వాడిని చదివించావు. వాడికోసం, వాడి బాగుకోసం, వాడికి ఉద్యోగం రావాలనీ నువ్వు పడ్డశ్రమ వృధా పోలేదమ్మా" మహలక్ష్మి మనస్ఫూర్తిగా అంది.

"నిజం తల్లీ... మేం ఎన్ని పూజలు చేసుకుంటే నీలాంటి కోడలు దొరుకుతుంది చెప్పు" సుందరమూర్తి కూడా అనేసరికి అగమ్య మొహం సిగ్గుతో ఎర్రబడింది.

కొన్ని సందర్భాల్లో పొగడ్తలు కూడా ఇబ్బందిని కలుగజేస్తాయి. వాళ్ళ ప్రేమాభిమానాలు చూస్తుంటే ఆమె మనసు అర్ధమవుతోంది.

★ ★ ★

ఆరోజు రాత్రి.

అందరూ నిద్రపోతున్నారు.

అగమ్య, పాణిగ్రాహి మెలుకువగా వున్నారు.

"అగమ్యా... అమ్మానాన్నా అన్నదాంట్లో ఏమాత్రం అతిశయోక్తి లేదు. నీవల్లే





ఇదంతా సాధ్యమైంది.

నేనసలు బ్యాంకు ఎగ్జామ్స్ రాద్దామని కూడా అనుకోలేదు. ఏదో ఇలా పార్ట్‌టైమ్ లెక్చరర్‌గా గడిచిపోతుందని అనుకున్నాను.

ఒక గోల్‌గానీ, ఒక గమ్యంగానీ లేకుండా వుండిపోయాను. నామీద నాకే నమ్మకం లేని పరిస్థితిలో నాకు ప్రేరణగా నిలిచావు.

మంచి భార్య దొరకవచ్చు కానీ మంచి స్నేహితురాలు, మంచి గైడ్, మంచి భార్య అన్నీ కలిసి ఒక్కరిగా దొరకడం నా అదృష్టం. ఈ విషయంలో నేను ఆ దేవుడికి కృతజ్ఞతలు చెప్పాలి" అగమ్య ఒడిలో తల పెట్టి అన్నాడు.

అగమ్య ఏమీ మాట్లాడలేదు.

అతని ముంగురులు సవరిస్తూ మెల్లగా తలవంచి అతని నుదురుమీద ముద్దు పెట్టుకుంది.

కొన్ని వేల భావాలను, ఒక చిన్న స్పర్శ కమ్యూనికేట్ చేయగలదు.

ఆమె ఒడిలో చిన్నపిల్లాడే అయిపోయాడు పాణిగ్రాహి.

"అగమ్యా... నేను వెంటనే వెళ్ళి జాయినింగ్ రిపోర్ట్ ఇవ్వాలి. ఇప్పుడు మనం షిఫ్ట్ అవ్వడం కూడా ముఖ్యమే కదా. నేను వెళ్ళి ఇల్లు చూసి మీకు లెటర్ రాయనా?" అడిగాడు పాణిగ్రాహి మరుసటిరోజు టిఫిన్ చేసి కాఫీ తాగాక.

"అలాకాదు. ముందు మీరు వెళ్ళి డ్యూటీలో జాయిన్ అవ్వండి. నెమ్మదిగా ఓ నెలలోపు ఇల్లు చూడండి. మనం హడావుడిలో చూస్తే ఏదో ఒకటి దొరుకుతుంది. అలాకాదు. అన్ని వసతులు వుండేలా చౌకలోనే చూడండి" అంది అగమ్య.

"ఇక్కడ వీళ్ళందర్నీ"

"నేను చూసుకుంటాను. అత్తయ్య గురించి, పిల్లల గురించి పట్టించుకోవద్దు. మీరు నిశ్చింతగా వుండండి" ధైర్యం చెప్పింది అగమ్య.

"అలాగే... నేను ఈ రోజు ఈవినింగే హైదరాబాద్ బయల్దేరి వెళ్తాను. అక్కడ మనకు దూరపుబంధువు ఒకరున్నారు. అక్కడ కొన్నిరోజులు షెల్టర్ తీసుకుంటే బెటరనుకుంటా" అన్నాడు పాణిగ్రాహి.

"వద్దండీ... వాళ్ళు ఇబ్బంది పడ్డం, అది చూసి మీరు ఇబ్బంది పడ్డం వద్దు. ఏదైనా చిన్న లాడ్జిలో దిగండి. మెస్‌లోగానీ, క్యాంటీన్‌లోగానీ తినండి. అప్పుడు మనకు, వాళ్ళకు ఇబ్బంది వుండదు" చెప్పింది అగమ్య.

"లాడ్జిలో వుండాలంటే" ఆగిపోయాడు పాణిగ్రాహి.

అసలే నెలాఖరు. చార్జీలకు కూడా ఇబ్బందే. ఆ విషయం అగమ్యతో చెప్పాలంటే మొహమాటంగా వుంది.

"ఇదిగోండి... ఈ డబ్బు వుంచండి. శనివారం రోజు వచ్చేయండి. హైద్రాబాద్‌లో ఇల్లు దొరికేవరకూ వారానికోసారి వస్తూ వుండండి. ఈలోగా మంచి ఇల్లు చూడండి.

పిల్లల టి.సీ. తీసుకొని, ఇక్కడ చూడవలసిన పనులు పూర్తిచేస్తాను. సూపర్ మార్కెట్‌లో కూడా చెప్పాలి కదా" అంది అగమ్య.

"ఈ డబ్బు... డబ్బెక్కడిది?" అడిగాడు పాణిగ్రాహి.

తను ఇచ్చే డబ్బు ఇంటి సరుకులకే సరిపోదు.

"ముందు మీరు బయల్దేరండి" అంది అగమ్య.

"నిజం చెప్పు అగమ్యా... ఈ డబ్బు ఎక్కడిది? నా మీద ఒట్టేసి చెప్పు" అన్నాడు అగమ్య ఎడమచేతిని తన తలమీద పెట్టుకుంటూ.

అప్పుడు గమనించాడు పాణిగ్రాహి.

అగమ్య ఎడమచేతికి వుండాల్సిన బంగారు గాజులు లేవు.

"అ...గ...మ్యా"

అగమ్యకు భర్త బాధ అర్థమైంది.

"ఇప్పుడా బంగారు గాజులు నా చేతికి వుండి ఉద్ధరించేది ఏమీలేదు. అయినా రేపు

# ఆణిముత్యాలు

✲ అసూయపరులకు వేరే శత్రువు అక్కర్లేదు, వారి అసూయే వారికి శత్రువు.

- ఋషిప్రోక్తం

✲ అజ్ఞానమే చలామణి అవుతున్న చోట వివేకంతో ప్రవర్తించడం కూడా వ్యతిరేక ఫలితాల్నిస్తుంది.

- గ్రే

✲ ధనాన్ని దానం చేయడానికి సంపాదించు.

- మహాకవి కాళిదాసు

✲ జీవితం పెద్దది, కోరిక చిన్నది. కానీ కోరిక జీవితాన్ని కదిలించివేస్తుంది.

- సుందరచైతన్యానందస్వామి

✲ అదృష్టం కలిసిరావాలంటే సాహసం బాటగా, అవకాశం నీడలా ఉండాలి.

- ఓ హెన్రీ

✲ ఆచరణ లేని విజ్ఞానం ఎలాంటిదంటే దీపం ముందు కూచుని కళ్లుమూసుకోవడంలాంటిది.

- ఆర్యోక్తి

✲ ఆరోగ్యం విలువ అనారోగ్యంలోనే తెలుస్తుంది.

- శంకరాచార్యులు

✲ ఇచ్చిన దానాన్ని, వచ్చిన గౌరవాన్ని మర్చిపోవాలి.

- శివబాబా

✲ ఇతరులు చేసిన పనివలన మీకు నష్టం, కష్టం కలిగితే ఆ పనిని మీరు ఇతరులకు చేయకండి. అదే ధర్మం.

- మహాభారతం

✲ కష్టాలలో ఆదుకుని సహాయం చేసేవారు బహుకొద్దిమందే ఉంటారు, కానీ మన అభివృద్ధిని చూసి ఈర్ష్యాసూయలు పడేవారు కోకొల్లలు.

- కోల్టన్

✲ జీవితంలో దేనిని కాపాడుకోక పోయినా ఫర్వాలేదు, నోటిని మాత్రం కాపాడుకోవాలి. లేకుంటే తన మాటలే తన దుఃఖమునకు, నష్టమునకు దారి తీస్తాయి.

- తిరుక్కురళ్

✲ సమస్యను నానబెడితే అందులోంచి మరెన్నో సమస్యలు మొలకెత్తి మహా వృక్షాలవుతాయి.

- జె.మార్టిన్

సేకరణ: జానీబాషా

మీకు చాలా డబ్బు వస్తే నాకు నగలు చేయించరా ఏమిటి. ముందు మన అవస రాలు మనకు ముఖ్యం కదా" అంది.

పాణిగ్రాహికి ఏమనాలో తోచలేదు. ఒక్కోసారి అగమ్య ప్రేమ ముందు తను వామనుడు అయిన ఫీలింగ్.

అగమ్య చేతులను కళ్లకు అద్దుకున్నాడు.



పాణిగ్రాహి జాయినింగ్ రిపోర్ట్ ఇవ్వడానికి ఆ వేళే బయల్దేరాడు.

అతని బట్టలన్నీ ఐరన్‌చేసి సూట్‌కేసులో సర్దింది.

అన్ని జాగ్రత్తలు చెప్పి పంపించింది. అగమ్య జీవితంలో ఓ మలుపుకు ఇది నాందీ ప్రస్తావన మాత్రమే.



అఖిల వాళ్ళ స్కూల్‌కు వెళ్లింది.

హెడ్‌మాస్టర్‌తో మాట్లాడి టి.సి.లు కావాలని చెప్పింది. అక్కడ్నుంచి సూపర్‌మార్కెట్‌కు వెళ్లింది.

తన భర్తకు సిటీలో జాబ్ దొరికిందని, తను త్వరలో మానేయనున్నట్టు చెప్పింది.

ఆ సూపర్ మార్కెట్ ఓనర్ చాలా బాధ పడిపోయాడు.

అగమ్యలాంటి సిన్సియర్ వ్యక్తి మళ్ళీ దొరకడం కష్టం.

అగమ్యకు ఈ ఊరు విడిచి వెళ్ళాలంటే బాధగానే వుంది. ఇన్నేళ్లు పుట్టిపెరిగిన వూరు.

ఒక్కసారి తన ఇల్లు చూసి రావాలని అనుకుంది. ఆ ఇంటిని తాకట్టుపెట్టుకున్న మార్వాడీయే కొనుక్కున్నాడు.

అతని దగ్గరికి వెళ్లి అడిగింది.

ఆ మార్వాడీ ఆమె ఫీలింగ్స్‌ని అర్థం చేసుకున్నాడు.

వెంటనే ఆ ఇంటి తాళం చెవులు అగమ్యకు ఇచ్చి ఓ మనిషిని తోడిచ్చి పంపాడు.

తను ఒక్కర్తే వెళ్తానని మరో గంటలో తాళంచెవులు తెచ్చి అప్పగిస్తానని చెప్పింది.

ఇంటిగేటు దగ్గరికి రాగానే అప్రయత్నంగా ఆమె కళ్లలో నీళ్లు సుడులు తిరిగాయి. ఆ చెక్కగేటు, గేటుకు ఇరువైపుల బంతిపూలచెట్లు... ఆ చెట్లు తను పెట్టినవే. రోజూ తండ్రి సాయంత్రం కాగానే తనతో కలిసి నీళ్లుపోసేవాడు.

గేటు తీసుకొని లోపలికి వెళ్ళింది. వీధి అరుగు చూస్తుంటే, అక్కడ తండ్రి కూచుని వున్నట్టే అనిపించింది. రోజూ సాయంత్రం అక్కడే కూచుని భగవద్గీత చదువుకునేవాడు.

తండ్రి స్నేహితులు ఎవరైనా వస్తే అక్కడే అరుగుమీద కూచొని కాలక్షేపం కబుర్లు చెప్పుకునేవాళ్లు.

తాళం తీసి లోపలికి వెళ్ళింది.

ఒకే గది. తన స్మృతిపథానికి మజిలీ. తను ఆటలాడుకోవడం, తల్లి వంటగదిలో వంటచేస్తూ వుండడం... తను వెళ్ళి తల్లిని జంతికలు అడిగి తీసుకోవడం... అన్నీ గుర్తుకొస్తున్నాయి.

తను ఆడుకున్న గది, తను చదువుకున్న గది, తను తప్పటడుగులు వేసిన ఇల్లు, తండ్రి గుండెలమీద ఆడుకున్న స్థలం ఒక్కొక్కటిగా... ఒక్కొక్కటిగా... అన్నీ గుర్తొస్తు

న్నాయి. ఏవి తల్లీ నిరుడుకురిసిన హిమస మూహముల్ ఏవీ ఆ జ్ఞాపకాలు... ఏరీ ఆ మనుషులు.

కళ్లముందు కనిపించరే. ఒక్కసారైనా వచ్చి పలకరించరే. నాన్నా... ఒక్కసారి కనిపించవూ... అమ్మా... ఒక్కసారి పలక రించవూ.

అగమ్యకు ఏడుపు కూడా రావడం లేదు. మనసంతా ఘనీభవించిన విషాదపు హిమ శిఖరమైంది.

ఈ ఇంటికీ, తనకూ రుణం తీరిపో యింది. అసలు ఈ వూరికే తన రుణం తీరిపోయింది.

'ఎన్ని జ్ఞాపకాలను పదిలపర్చుకున్నాను, ఎన్ని స్మృతులను గుండెల్లో దాచుకున్నాను. అన్నీ... కాలం చాటున నిర్దాక్షిణ్యంగా దాగి పోయాయి. ఆ ఇల్లు ఖాళీగా వుంది తన మనసులా!' అనుకుంది.

★ ★ ★

ఆ ఇంటినుంచి తిరిగివచ్చి మార్వాడీకి తాళంచెవులు ఇచ్చి వచ్చాక మనసంతా అదోలాంటి శూన్యం ఆవరించింది.

"ఏంటమ్మా అగమ్యా... అదోలా వున్నావు? " కోడలి మొహంలో దిగులును కనిపెట్టి అడిగింది మహలక్ష్మి.

"ఏంలేదత్తయ్యా... కాస్త తలనొప్పి అంతే" చెప్పింది అగమ్య.

★ ★ ★

పాణిగ్రాహి హైద్రాబాద్ బ్యాంకులో జాయినయ్యాడు.

స్టేషన్‌రోడ్డులో వున్న ఓ చిన్న లాడ్జిలో వున్నాడు.

ఆరోజునుంచే ఇళ్ళ వేట మొదలెట్టాడు. మధ్యాహ్నం మెస్‌లో తినడం, రాత్రి లైట్‌గా టిఫిన్ చేయడం.

ఈ కొద్దిరోజుల్లోనే అగమ్య లేనిలోటు తెలిసివచ్చిందతనికి.





అగమ్య వుంటే ప్రతీదీ జాగ్రత్తగా చూసు కునేది ఉదయం లేచిన దగ్గర్నుంచి తను కాలేజికి వెళ్లేవరకు.

అగమ్య గర్తుకురాగానే అతని మనసంతా ఆహ్లాదంగా మారిపోయింది.

కొందరి జ్ఞాపకాలు మధురంగా వుంటాయి. ఎవరి జ్ఞాపకాలు మన మన సులో ఆహ్లాదాన్ని కలిగిస్తాయో ఆ మను షులు తమకు అత్యంత ఆప్తులు అని అంటూవుండేది అగమ్య.

అది ఇప్పుడు నిజమే అనిపిస్తుంది. అగమ్య తనకు ఆప్తురాలు, ఆత్మీయురాలు. తన జీవితంలో సగం. ఊహూ... తన జీవితమే అగమ్య.

★ ★ ★

అగమ్య ఇల్లంతా నీట్‌గా సర్దే ప్రోగ్రామ్ పెట్టుకుంది. వారానికోసారి ఇల్లంతా నీట్‌గా సర్దేసి, దుమ్ము దులిపేస్తూవుంటుంది.

"పెద్దదాన్ని నేనున్నాను కదా" అంటూనే మహలక్ష్మి కోడలి చేతిలో నుంచి బూజు కర్ర తీసుకోబోయింది.

"మీరిప్పుడు విశ్రాంతి తీసుకోవలిసిన వయసు అత్తయ్యా" అంది అగమ్య.

మహలక్ష్మికి ఏం మాట్లాడాలో అర్థంకా లేదు. ఇలాంటి కోడళ్లు కూడా వుంటారా? అన్న ఫీలింగ్ ఆవిడకు అప్పుడప్పుడూ కలు గుతూ వుంటుంది.

"అగమ్యా... ఒక్క సంగతి చెప్పు... మేమంటే నీకెందుకమ్మా... యింత ప్రేమ? "

అగమ్య అత్తయ్య వంక చూసింది.

"చెప్పమ్మా... ఈ ముసలివాళ్లంటే నీకెం దుకింత ప్రేమ? ఈ ప్రపంచంలో తన పిల్లలు... తన భర్త అనే స్వార్థం వున్నవా ళ్లను చూశాను. కానీ తన అత్తా, తన మామయ్యా తన ఆడపడుచు... తన మరిది... అంతా తనవాళ్లే అన్న భావం వున్నవాళ్లు అరుదు. నిన్ను చూస్తోంటే నాకు ముచ్చటేస్తోంది.

ఈ వృద్ధాప్యంలో ఎలా బతకాలో అన్న

బెంగ మాది. అఖిల... సుందర్‌లు ఆల స్యంగా నా కడుపున పడ్డప్పుడు... సిగ్గుతో, భయంతో చితికిపోయాం. ఈ వయసులో ఈ పిల్లల బాగోగులు ఎవరు చూస్తారు?

వచ్చే కోడలు ఈ పిల్లలను చూస్తుందా? మమ్మల్ని పట్టించుకుంటుందా? అన్న భయం మమ్మల్ని పీడించింది.

పాణిగ్రాహి నిన్ను పెళ్ళిచేసుకుంటానని చెప్పినప్పుడు, నువ్వు మా ఇంట్లోకి అడుగు పెట్టినప్పుడు, మా మానసిక సంఘర్షణ చెప్పనలవికాదు.

ఆరోజు రాత్రంతా మాకు నిద్రలేదు. ఒక్కోరోజు గడుస్తోన్న కొద్దీ హమ్మయ్య ఈ రోజు గడిచిందని వూపిరి తీసుకునేవాళ్లం. ఏరోజు ఇంట్లో గొడవ మొదలు అవుతుందో నన్న భయం, వేరు కాపురం పెట్టమని నువ్వు అబ్బాయిని అడుగుతావేమోనన్న శంక. ఈ వయసులో మేం ఎలా బతకాలి.

నిజం చెప్పనా తల్లీ... ఈవయసులో అందరికీ శాపంలా మారే వృద్ధాప్యం చూచి భయం... అభద్రతాభావం...

కానీ రానురాను రోజులు, గడుస్తోన్నకొద్దీ ధైర్యం... నీ ప్రవర్తన, నీ ప్రేమ, నీ క్షమ, నీ సహనం... ఇవ్వన్నీ చూస్తున్నకొద్దీ మాలో మాకే తెలియని ధైర్యం... నిజం చెప్పాలంటే తల్లి ఒడిలో బిడ్డలు భద్రంగా, భద్రతగా వున్న భావం"

మహలక్ష్మి చెప్పుకుపోతూ వుంది. అగ మ్యకు అత్తగారి మానసిక పరిస్థితి అర్థ మైంది. సహజమే. వయసు అయిపోయి, జవసత్వాలు ఉడిగిపోయి, నిస్సహాయస్థి తిలో వున్న వృద్ధులకు తప్పని దు...స్థి...తి.

అగమ్య అత్తయ్య చేతిని తన చేతిలోకి తీసుకొని ప్రేమగా నొక్కివదిలి.

"నాకు అమ్మా, అత్తా వేరువేరు కాదు. అత్తమ్మలో అమ్మను చూసుకుంటే మామ గారు నాకు తండ్రితో సమానం. మీ ఇద్దర్నీ నేను కంటిపాపల్లా చూసుకుంటాను.

జీవితం చాలా చిన్నది అత్తయ్యగారూ. ఈ చిన్న జీవితంలో అత్తయ్యా, అమ్మ తల్లి గారిల్లు, అత్తగారిల్లు, నావాళ్ళు, నీవాళ్లు అనే తేడా లేదు.

ఏదో ఓ రోజు అందరం చేరేది శ్మశానా నికే. ఈ మాత్రానికే నా...నీ అనే తేడాతో గొడవలు ఎందుకత్తయ్యా" అగమ్య మాట్లా డుతూవుంటే అలానే చూస్తుండిపోయింది మహలక్ష్మి.

మనసు ఎదగడానికి వయసుతో పనిలే దని ప్రేమ వుంటే చాలని కోడల్ని చూస్తోంటే అర్థమైంది.

వాళ్ళ మాటలన్నీ పక్కగదిలోనుంచి వింటోన్న సుందరమూర్తి మనసు నెమ్మదిం చింది.

అత్తాకోడళ్ళ గొడవ మధ్య ఎక్కడ కొడుకు నలిగిపోతాడోనని ఒకప్పుడు భయ పడ్డాడు.

ఇప్పుడు అగమ్య ప్రేమ చూశాక అర్థ మైంది, తన ఇంట్లో గొడవలు... అలజ డులు... అశాంతులు వుండవని.

అగమ్య అరగంటలో ఇల్లంతా దులిపే సింది. బట్టలన్నీ నీట్‌గా సర్దింది.

సూట్‌కేసులో వున్న బట్టలను నీట్‌గా సర్దుతుంటే అడుగున పెళ్ళినాటి ఆల్బమ్ కనిపించింది.

ఆ ఆల్బంలో తల్లిదండ్రులు.

తనని ఆశీర్వదిస్తూ, తనను అక్కున చేర్చుకుంటూ తల్లిదండ్రులు. అవి నిశ్చల ఛాయాచిత్రాలు కావు. జీవితచిత్రాలు. తన తండ్రి ఎదురుగా నిలబడి వున్న ఫీలింగ్.

తల్లి తనతో మాట్లాడుతున్న ఫీలింగ్. ఆ ఫొటోలను అపురూపంగా తన గుండెలకు హత్తుకుంది.

చిన్నప్పుడు తండ్రి గుండెలమీద హాయిగా వెచ్చగా నిద్రపోయిన ఫీలింగ్.

తల్లిఒడిలో పడుకున్న ఫీలింగ్.

★ ★ ★

మూడవరోజు పాణిగ్రాహికి కొలీగ్ ప్రసా

దరావు ఓ ఇల్లు చూపించాడు. మూడుగదుల ఇల్లు. అద్దె కాస్త ఎక్కువైనా సెపరేట్ పోర్షన్.

వెంటనే అగమ్య ఇచ్చిన డబ్బులోనుంచి కొంత అడ్వాన్స్‌గా ఇచ్చేశాడు. మరో వారం రోజుల్లో ఇంట్లోకి దిగుతామని చెప్పాడు.

శనివారమే ఇంటికి వెళ్ళి ఓరోజు సెలవు పెట్టి, ఇక్కడికి షిఫ్ట్ అవ్వాలని డిసైడ్ చేసుకున్నాడు.

అగమ్య భర్త బట్టలను రిపేర్ చేస్తూ వుంది. గుండీలు కుడుతూ, హెమ్మింగ్ చేస్తూ వుండగానే పాణిగ్రాహి వచ్చాడు.

భర్తను చూడగానే అగమ్య పురివిప్పిన నెమలి అయింది.

పరుగున ఎదురు వెళ్ళింది, కొద్దిరోజుల ఎడబాటునే భరించలేనట్టు.

★ ★ ★

రాత్రి భోజనాలయ్యాక చెప్పాడు పాణిగ్రాహి.

హైదరాబాద్‌లో ఇల్లు చూశాను. అడ్వాన్స్ కూడా ఇచ్చాను. మంచిరోజు చూసుకొని వెళ్ళడమే.

"మంచిరోజు చూడండి" అంది మహలక్ష్మి.

"అమ్మా అగమ్యా క్యాలెండర్‌లో ఏరోజు మంచిదో చూడు. ఆరోజే వెళ్దాం. పొద్దున్నే పాలు పొంగించి, ఇంట్లోకి వెళ్తే అన్నీ శుభాలే జరుగుతాయి" చెప్పాడు సుందరమూర్తి.

రెండ్రోజుల తర్వాత వేకువఝామునే వ్యానులో సామాన్లు సర్ది హైదరాబాదుకు బయల్దేరింది పాణిగ్రాహి కుటుంబం.

ఉదయం ఆరు అవుతుండగానే హైదరాబాద్ వచ్చేశారు.

ప్రశాంత్‌నగర్ కాలనీలో మూడుగదుల ఇల్లు అది.

పాలు పొంగించి, పూజచేసి, చుట్టుపక్కల వాళ్ళను పిలిచారు.

తనే అందరినీ పరిచయం చేసుకుంది. వచ్చిన కొద్దిసేపట్లోనే తమతో కలిసిపోవడం ఆ కాలనీలో ఆ ఇంటి చుట్టుపక్కన వుండే వాళ్ళకు ఆనందాన్ని కలిగించింది.

హైదరాబాద్‌లో కొత్త జీవితం ఆరంభమైంది అగమ్యకు.

★ ★ ★

అఖిల, సుందర్‌లను స్కూల్‌లో జాయిన్ చేయాలి.

ఆ బాధ్యత అగమ్యమీద ఉంచి తను తప్పుకున్నాడు పాణిగ్రాహి.

అగమ్య పొద్దున్నే లేచి తయారై పిల్లలను తయారుచేయించి స్కూల్ సర్టిఫికెట్స్‌తో దగ్గర్లోనే వున్న స్కూల్‌కు బయల్దేరింది.

అంతక్రితంరోజే ఆ ఏరియాలో వున్న స్కూల్స్ గురించి ఎంక్వయిరీ చేసింది.

స్కూల్ పెద్దది కాకపోయినా పద్ధతి ప్రకారం వుంది.

స్కూల్లో కోచింగ్ బావుంది. తక్కువ ఫీజు. ఎక్కువ ఆంక్షలు లేవు. పైగా ఇంటికి దగ్గర.

ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని ఆ స్కూల్‌లోనే జాయిన్ చేసింది అగమ్య.

వాళ్ళకు అలవాటు అయ్యేవరకూ తనే రోజూ స్కూల్‌కు పిల్లలను తీసుకురావడం, తీసుకువెళ్ళడం, లంచ్‌బాక్స్ ఇచ్చి రావడం చేసింది.

స్కూల్‌లో చాలామంది అఖిల, సుందర్‌లు అగమ్య పిల్లలే అనుకున్నారు.

క్లాస్‌టీచర్ అడగనే అడిగింది.

"వాళ్ళు మీ పిల్లలా? " అని.

"కాదు. ఆడపడుచు, మరిది" చెప్పింది అగమ్య.

ఆ మేడమ్ ఆశ్చర్యంగా చూసింది. "స్వంతపిల్లల పట్లే కేర్ తీసుకోరు. మీరేమిటి... మీవారి సిస్టర్, బ్రదర్‌ని మీ పిల్లల్లా స్కూలుకు తీసుకురావడం"

"వాళ్ళు నా పిల్లలే" అంది అగమ్య.

ఆ తర్వాత ఆ స్కూల్‌లో ఏ టీచరూ ఈ విషయమై అగమ్యను కదపలేదు.

అగమ్య వ్యక్తిత్వం వాళ్ళకు బాగా





నచ్చింది.

పాణిగ్రాహి స్వీట్ ప్యాకెట్ తీసుకువచ్చాడు. మొదటినెల జీతం అందుకున్నాడు. ఆరోజే అగమ్యకు చీర తీసుకువచ్చాడు.

స్వీట్స్ అందరికీ ఇచ్చింది అగమ్య.

"ఈ చీర నీ కోసమే తెచ్చాను" చెప్పాడు పాణిగ్రాహి.

"తెలుసు" ముభావంగా అంది అగమ్య.

"అలా డల్‌గా వున్నావేంటి? చీర నచ్చలేదా? " అడిగాడు పాణిగ్రాహి.

"నచ్చింది" అంది అగమ్య.

"మరి" మరింత ఆశ్చర్యంగా అన్నాడు.

"నాకు తీసుకురావడమే నచ్చలేదు"

"అదేంటి? "

"ఇంట్లో అఖిల వుంది, సుందర్ వున్నాడు. అత్తయ్య, మామయ్య వున్నారు. వాళ్ళకు ఏమైనా తీసుకురావల్సింది. నాకు చీరలు తక్కువా? " అంది అగమ్య.

తలవంచుకున్నాడు పాణిగ్రాహి.

భర్త హర్ట్ అయ్యాడనుకొని అతని దగ్గరకి వెళ్ళి అతని తల పైకెత్తి,

"నా ఉద్దేశం మిమ్మల్ని హర్ట్ చేయాలని కాదు. మొదటినెల జీతంలో అత్తయ్యకో, మామయ్యకో ఏమైనా తీసుకువస్తే బావుండేది. అఖిల, సుందర్‌లకు మంచి బట్టలు లేవు. అందుకే"

"సారీ అగమ్యా... నువ్వు నన్ను బాధపెట్టినా, ఆ బాధలో సంతోషం వుంది. ఏ భార్య అయినా తనకే అన్నీ కావాలని, భర్త తనకే తీసుకురావాలని అంటుంది. కానీ నువ్వు ముందు నీ భర్త తరపువాళ్ళ గురించి ఆలోచిస్తున్నావు.

కనీసం నీపాటి ఆలోచన కూడా రానందుకు సిగ్గుగా వుంది" మనస్ఫూర్తిగా అన్నాడు పాణిగ్రాహి.

"ఛ...ఛ... అయినా మీవాళ్ళు, నావాళ్ళు కాదు మనవాళ్ళు. ఈ చీరతో అఖిలకు లంగా, జాకెట్ కుట్టిస్తాను. ఆడపిల్ల కదా... ముద్దుగా వుంటుంది. వచ్చేనెల సుందర్‌కు మంచి బట్టలు తీసుకురండి.

ఆ తర్వాత మామయ్యకు కళ్ళజోడు కొనాలి" లిస్టు చెప్పుకుపోతూనే వుంది అగమ్య.

ఈ సంభాషణ అంతా సుందరమూర్తి, మహలక్ష్మి వింటూనే వున్నారు.

రాత్రి పడుకోబోయే ముందు పాణిగ్రాహి కవరు తీసుకువచ్చి అందులో నుంచి డబ్బు తీశాడు.

"చెప్పు అగమ్యా... ఈ నెల బడ్జెట్" అన్నాడు.

అగమ్య చెప్పుకుపోతూనే వుంది.

పాణిగ్రాహి ఓ పేపర్ మీద రాసుకుపోతూ వున్నాడు.

అగమ్య అయిదు నిమిషాల తర్వాత తన లెక్కలను ఆపింది.

మొత్తం టోటల్ చేశాడు పాణిగ్రాహి. ఒక్క క్షణం అతని గుండె గుభేలుమంది.

తనకొచ్చిన జీతం, ఈ నెల బడ్జెట్ రెంటికీ ఏమాత్రం పొంతన కుదరడం లేదు.

"అదేంటి అగమ్యా... లెక్క కుదిరిచావడం లేదు. ఈ లెక్కన జీతం డబ్బులు పదిహేను రోజులకు కూడా వచ్చేలా లేవు" పాణిగ్రాహి కంగారుగా అన్నాడు.

"తప్పదుకదండీ... ఇక్కడ ఫీజులు ఎక్కువే, ఇంటిఅద్దె ఎక్కువే. ఇవన్నీ తప్పవు" అంది.

పాణిగ్రాహి ఆలోచనలో పడ్డాడు.

"అంత తీవ్రంగా ఆలోచించకండి. ఆలోచిస్తే ఏదో ఓ మార్గం దొరక్కపోదు. మీరు నిద్రపోండి" అంది.

కానీ ఆ రాత్రంతా పాణిగ్రాహికి నిద్ర లేదు. ఇక్కడ పాణిగ్రాహి గురించి కొంత చెప్పుకోవాలి.

వ్యక్తిగా ఎంత ఎఫిషియంటో, బాధ్యతల విషయంలో అంత ఇన్‌సెక్యూర్‌గా, అనీజీగా ఫీలవుతాడు.

టెన్షన్లు, మరో వ్యాపకాలు సృష్టించుకోవడాలు అతనికి ఒంటపట్టవు. తన బ్యాంకు



జాబ్, ఇంటికి రావడం... అంతకుమించి అతనికి మరో వ్యాపకం ఆనందాన్ని కలిగించదు.

బరువు, బాధ్యతలంటే అతనికి భయం. ఏ టెన్షనూ లేకుండా ప్రశాంతంగా ఈ బతుకును ఇలా వెళ్లదీస్తే చాలనుకుంటాడు.

★ ★ ★

పాణిగ్రాహి కళ్ళు ఎర్రగా వున్నాయి.

రాత్రంతా భర్త నిద్రపోకుండా, ఏదో ఆలోచిస్తూ వుండడం గమనిస్తూనే వుంది. ఏదో విషయంలో అతను మథనపడుతున్నాడని అర్థమైంది.

అగమ్య వంటింటి పనులన్నీ పూర్తిచేసుకొని, పిల్లలను స్కూల్‌కు తీసుకువెళ్ళడానికి రెడీ అయింది.

"అగమ్యా..." పిలిచాడు పాణిగ్రాహి.

"ఏంటండీ..." భర్త దగ్గరకి వెళ్ళి అడిగింది.

రాత్రి తీసుకువచ్చిన జీతం తాలూకు కవరు అగమ్య చేతిలో పెట్టి,

"ఈ ఇంటి బాధ్యత నువ్వే తీసుకో ఈ లెక్కలతో నా తల బద్దలవుతోంది. ప్లీజ్" అన్నాడు పాణిగ్రాహి.

"నేనా... నేనెలా మేనేజ్ చేయగలను? "

"నువ్వు చేయగలవు అగమ్యా... నాకు రాత్రంతా నిద్రపట్టలేదు" అన్నాడు పాణిగ్రాహి.

భర్త బాధ అర్థమైంది. అలా అని తను మాత్రం ఏం చేయగలదు? కానీ, భర్త బాధని తను పోగొట్టాలి. అతనికి ధైర్యం చెప్పాలి.

ఒక స్థిర నిశ్చయానికి వచ్చింది అగమ్య.

"సరే... మీరిక నిశ్చింతగా వుండండి" అంది ఆ కవరు అందుకుంటూ.

"హమ్మయ్య... ఇప్పుడు నాకు రిలాక్స్‌డ్‌గా వుంది" అన్నాడు బ్యాంకుకు బయల్దేరుతూ.

ఆ నిశ్చింతను కోల్పోయింది అగమ్య అని అతనికా క్షణంలో తెలియలేదు.

★ ★ ★

భర్త బ్యాంకుకు వెళ్ళాక పేపరు, పెన్నూ తీసుకొని లెక్కలేసింది. భర్త తీసుకువచ్చే జీతం ఎటువంటి పరిస్థితిలోనూ సరిపోదు.

ఇంట్లో ప్రొవిజన్స్, అత్తమామల మందుల ఖర్చు, డాక్టర్ తనని వాడమన్న మెడిసన్స్ ఖర్చు, పిల్లల స్కూల్ ఫీజు... ఏదీ తగ్గించడానికి వీలులేదు.

డాక్టర్ ప్రతీనెలా తనని వాడమన్న మెడిసన్‌ని ఆ జాబితానుంచి తొలగించింది. మంచి ఫుడ్ తీసుకొని వాకింగ్ చేస్తే సరి... అని సరిపెట్టుకుంది.

ప్రొవిజన్స్ కొన్ని రేషన్ షాపులో పక్కింటివాళ్ళ రేషన్ కార్డ్‌మీద తెచ్చుకోవాలని నిర్ణయించుకుంది.

వాళ్ళని రిక్వెస్ట్ చేస్తే సరి. కొద్దిగా ఖర్చు తప్పుతుంది. అలా బడ్జెట్‌లో మార్పులూ చేర్పులూ చేస్తూనే వుంది.

★ ★ ★

రేషన్ షాపువద్ద క్యూ చేంతాడంత వుంది. ఓవైపు ఎండ మండిపోతోంది.

గంటనుంచీ లైను కదలడంలేదు. పక్కింటావిడ దగ్గర రేషన్‌కార్డు తీసుకువచ్చింది.

ఇంట్లో అత్తయ్యతో అలా బజారుకెళ్ళి సరుకులు తీసుకువస్తానని చెప్పి బయల్దేరింది.

షోడా తాగాలని ఉన్నా మనసొప్పలేదు.

ఉదయం రేషన్‌కార్డు అడగడానికి పక్కింటికి వెళ్ళినప్పుడు ఆవిడ అన్నమాటలు గుర్తొచ్చాయి.

"నువ్వేమీ అనుకోనంటే ఓమాట చెబుతా నమ్మాయ్. నా కూతురిలాంటిదానివి. ఈ రేషన్ షాపుల్లో గంటల తరబడి నువ్వు నిలబడ్డం ఎందుకు? అసలే ఒట్టి మనిషివి కూడా కాదాయె. పైగా ఉదయమే ఆడపడుచుని, మరిదిని స్కూల్‌కు తీసుకెళ్తావు. ఇలా వాళ్ళకు సేవలుచేస్తూ పోతూ వుంటే, రేపు నీ పిల్లలకు సేవ చేయడానికి నీకు





శక్తి వుండదు. అయినా మీ ఆయన్ని వెళ్ళి క్యూలో నించోమను"

అగమ్యకు ఏం చెప్పాలో తోచలేదు.

తను రేషన్ షాపులో క్యూలో నిలబడి సరుకులు తీసుకువస్తున్నానన్న విషయం భర్తకు తెలియదు.

"బాగా ఆలోచించమ్మా... చూసేవాళ్ళంతా వాళ్ళు నీ పిల్లలే అనుకునేంత బాగా చూసుకుంటున్నావు. రేపు పెద్దయ్యాక వాళ్ళు చేస్తారా?

నీ మొగుడి సంపాదనలో నాలుగు డబ్బులు వెనకేసుకో. మీ అత్తమామలు ముసలివాళ్ళయ్యారు. వాళ్ళకోసం మందులు, పళ్ళు ఎందుకు? అయినా ఇలా చెబుతున్నానని మరోలా అనుకోకు. నువ్వు నా కూతురిలాంటిదానివి"

ఆవిడ చెప్పేవన్నీ చెప్పి కూతురిలాంటిదానివమ్మా అంటూ ఎస్కేప్ అవుతోంది.

మంచితనం ముసుగుతో, తనకేదో ఫేవర్ చేస్తున్నట్టు చెబుతున్న ఆవిడ మాటలు రుచించలేదు తనకు.

చాలా కాపురాలు తనకు తెలిసి ఇలానే కూలిపోతాయి.

స్వబుద్ధి సుఖంచైవ, పరబుద్ధి వినాశయా' అంటూ తండ్రి ఎప్పుడూ అంటూ వుండేవాడు.

ఒకరి ఆలోచనలకు మనం ఎప్పుడైతే ప్రభావితమవుతామో అప్పుడే మన వ్యక్తిత్వాన్ని మెల్లమెల్లగా కోల్పోవడం మొదలెడతాం.

ఓ మంచి సంఘటన పట్ల, ఓ మంచి మాటవల్ల, ఓ మంచి వ్యక్తి సాంగత్యంవల్ల ప్రభావితం అవ్వడం వేరు.

ఇలాంటి ఉబుసుపోక మనుష్యుల మాటలతో ప్రభావితమవ్వడం వేరు.

రెండోరకమైన ప్రభావం చాలా ప్రమాదకరమైంది.

ఇలాంటి విషయాలను ఉపేక్షించకూడదు.

"అయినా నువ్వొట్టి అమాయకురాలిలా వున్నావు. నీ మంచితనం మెతకదనం చూస్తూనే అర్థమవుతూ వుంది" అంది పక్కింటావిడ.

ఓ మనిషిని విమర్శించాలంటే, మరో మనిషిని పొగడాలి.

ఇది చాలా కామన్ సైకాలజీ. తన మంచితనాన్ని పొగుడుకుంటూ ఎదుటివారిని దుమ్మెత్తి నోరెత్తకుండా చేయడం చాలామందికి అలవాటైన పద్ధతి.

వెంటనే అగమ్య అంది,

"నా మంచితనం, మెతకదనం కన్నా, మా అత్తమామల మంచితనం, మావారి మెతకదనమే గొప్పండీ. ఆ ఇంట్లో నేను కోడలిని మాత్రమేకాదు, కూతురిని కూడా" అంది.

ఒక్కక్షణం ఆవిడ మొహం మాడిపోయింది. ఇలాంటి సమాధానాన్ని ఊహించలేదు.

"అయినా నాకెందుకులేమ్మా? ఏదో నా కూతురిలాంటిదానివని చెప్పాను. మీ అత్తా, నీ మొగుడూ, నీ కాపురం... ఇవేమీ మనసులో పెట్టుకోకమ్మా" అంది రేషన్‌కార్డు ఇస్తూ, మొహమంతా మాడ్చుకొని.

ఇక తన పాచిక పారదని అర్థమైంది.

ఇద్దరి వ్యక్తులమధ్యా, అదీ అత్తా, కోడళ్ళ మధ్య ఇలాంటి చిచ్చు పెట్టడమనే నైజం ఎందుకిలా విస్తరిస్తుందో అర్థంకాదు.

కళ్ళు తిరుగుతున్నట్టు అనిపించింది అగమ్యకు. ఆ క్యూలో నుంచి బయటకు వచ్చి ఇంటికి వెళ్దామా? అనుకుంది ఓ క్షణం.

కానీ అప్పటికే ఆలస్యమైంది.

కళ్ళు తిరిగి పడిపోయింది.

★ ★ ★

బ్యాంకులో తొందరగా పని పూర్తయింది. పైగా శనివారం.

పని పూర్తి చేసుకొని, ఇంటికి బయల్దేరాడు పాణిగ్రాహి.

బ్యాంకు వదిలారంటే సరిగ్గా ఇంటికే



బయల్దేరతాడు. ఏ వ్యాపకాలూ పెట్టుకోడు.

స్నేహితులు, పేకాటలు, సరదా కాలక్షేపాలు వంటివి పాణిగ్రాహి ఒంటికి సరి పడవు.

అబ్బ ఎండ ఎంత తీవ్రంగా వుంది? అనుకుంటూ రేషన్‌షాప్ ముందు వున్న క్యూ చూశాడు.

'ఎంత క్యూ. ఈ ఎండలో, ఈ రేషన్‌కోసం ఎన్ని పడిగాపులు కాయాలో' అనుకున్నాడు.

సరిగ్గా అప్పుడే కలకలం.

"అయ్యో పాపం... కళ్ళు తిరిగి పడిపోయింది" ఎవరో అంటున్నారు.

పాణిగ్రాహి ఒక్కక్షణం ఆగి ఆ అమ్మాయి వంక చూసి షాకయ్యాడు.

అగమ్య!

కళ్ళు తిరిగి పడిపోయిన అగమ్యని చూసి వెంటనే పాణిగ్రాహి అక్కడికి వెళ్ళి, "అగమ్యా... అగమ్యా..."

"మీ తాలూకా? "

"నా భార్య" చెబుతూనే రిక్షాని పిలిచి అందులోకి చేర్చాడు.

అగమ్య చేతిలో బ్యాగు, రేషన్‌కార్డు వున్నాయి.

"అంటే... ప్రతినెలా ఈ క్యూలో, ఈ ఎండలో నిలబడి..."

మెల్లిగా కళ్ళు తెరిచింది అగమ్య.

ఎదురుగా అత్తమామలు.

"నేను... నేను ఎక్కడున్నాను." అడిగింది అయోమయంగా

"మా దగ్గరే వున్నావు తల్లీ. నువ్వు ప్రొవిజన్ స్టోర్స్‌లో కళ్ళు తిరిగి పడిపోయావట. అబ్బాయి చూసి నిన్ను రిక్షాలో తీసుకువచ్చాడు"

ఒక్కక్షణం ఊపిరి పీల్చుకుని రిలీఫ్ పొందింది అగమ్య.

అత్తామామలకు ఈ విషయం తెలియదు అనుకుంది.

"అయినా... నువ్వెందుకు తల్లీ, అబ్బాయి తీసుకువస్తాడుగా" అంది మహాలక్ష్మి.

నీరసంగా నవ్వింది అగమ్య.

సాయంత్రం డాక్టర్ వచ్చిచూసి మందులు రాసిచ్చివెళ్ళింది.

★ ★ ★

రాత్రి పది అవుతుండగా, గదిలోకి వచ్చాడు పాణిగ్రాహి.

సాయంత్రమంతా రెస్ట్ తీసుకుంది అగమ్య. మెల్లగా లేచి వంట చేసింది.

పాణిగ్రాహి మౌనంగా వుండిపోయాడు.

ఖచ్చితంగా భర్త అడుగుతాడు. తను సమాధానం చెప్పకతప్పదు అనుకుంది.

అనుకున్నంతా అయింది.

"అగమ్యా... ప్రతీనెలా రేషన్ షాపులో క్యూలో నిలబడి ప్రొవిజన్స్ తీసుకువస్తున్నావా?" అతని గొంతు బాధతో పూడుకుపోయింది.

తల వంచుకుంది అగమ్య.

"తల దించుకోవాల్సింది నువ్వుకాదు అగమ్యా నేను. ప్రతీనెలా నేనిచ్చిన జీతం డబ్బులతో నువ్వెలా నెట్టుకొస్తున్నావో ఇప్పుడర్థమైంది" అగమ్య చేతులను తన కళ్ళకు అన్చుకున్నాడు.

"ఫీలవుతున్నారా? సారీ... మిమ్మల్ని బాధపెట్టాలని కాదు. అయినా రేషన్‌లో సరుకులు తెచ్చుకోవడం నామోషీ కాదుకదండీ"

"సరుకులు తెచ్చుకోవడం తప్పని నేను అనడంలేదు అగమ్యా. ఓ స్త్రీని... అందునా గర్భిణీని, రేషన్‌షాపుకు పంపించాల్సిన నా అసమర్థతను తిట్టుకుంటున్నాను"

"ఛ...ఛ... మీరు అలాంటివేమీ మనసులో పెట్టుకోవద్దు. మనిల్లు... మన సంసారం...మన కోసం మనం ఆ మాత్రం కష్టపడకపోతే ఎలా? మీరు బ్యాంకుకు వెళ్ళి జాబ్ చేయడం లేదా?

నాకున్న పరిధిలో నేను మీకు కొద్దో గొప్పో సాయం చేస్తున్నానంతే. ఇది ఒకరి కష్టాలను మరొకరు పంచుకోవడంలాంటిది మాత్రమే"

"కావచ్చు అగమ్యా... కానీ నువ్వు సుఖాలు మాకు ఇచ్చి.. కష్టాలు మాత్రం నువ్వే భరిస్తున్నావు. సాయంత్రం డాక్టర్ వచ్చింది"

"డాక్టర్ ఏంచెప్పింది?"

"నువ్వు ప్రతినెలా చెకప్‌కు వెళ్లడం లేదట. డాక్టర్ రాసిన మందులు వాడ్డంలేదట"

ఒక్కక్షణం తడబడింది. వెంటనే తేరుకొని.

"ఆ డాక్టర్లు అలాగే చెబుతారు. మా అమ్మ ఏ మందులు వాడింది. నేను శుభ్రంగా పుట్టలేదూ. మంచి ఫుడ్డు తీసుకుంటూనే వున్నాం. ఈవినింగ్ వాక్ చేస్తున్నాం"

"సమర్థించుకోకు అగమ్యా... నీ త్యాగంతో నన్ను మరింత కురచగా చేస్తున్నావు. మెడికల్ చెకప్‌కు, మెడిసన్స్‌కు డబ్బులు ఖర్చవుతాయని ఇంటి బడ్జెట్‌కోసం నీ ఆరోగ్యాన్ని కూడా లెక్కచేయడం లేదు"





అతని మనసు కంఠంతోపాటు రుద్ధమైంది.

"నథింగ్ టు వర్రీ... మీరేం ఫీలవ్వద్దు. ప్లీజ్" అంది భర్తని.

"అలానే అగమ్యా" ఒడిలో తలపెట్టి పడుకున్నాడు పాణిగ్రాహి.

చిన్నప్పుడు తల్లి ఒడిలో పడుకున్నంత నిశ్చింతగా వుంది.

అమ్మ ఒడి వెచ్చదనాన్ని భార్య తాలూకు భరోసా అందించే ధైర్యాన్ని ప్రోది చేసుకొని అలానే వుండిపోయాడు.

"దేవుడా... ఏ జన్మలోనో నేను ఎంతో పుణ్యం చేసుకొని అగమ్యలాంటి భార్యను పొందగలిగాను" అతను దేవుడికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాడు.



ప్రెగ్నెన్సీ అందమైన అనుభవం అగమ్య దృష్టిలో

ఓ ప్రాణిని కడుపులో మోస్తూ, తన వూపిరిని, తన రక్తాన్ని అందిస్తూ కొత్త సృష్టికి తనే కేంద్రమై... ఆ భావమే అందమైన ఫీలింగిస్తూ వుంది.

అప్రయత్నంగా ఆమె చేయి. పొట్టమీదికి వెళ్ళింది.

లోపల మాతృగర్భంలో ఊపిరి పోసుకునే ఆ ప్రాణి రేపు పెరిగి పెద్దయ్యాక ఏమవుతుందో?

ఆమెకు కడుపులోని బిడ్డ గురించి ఆలోచనలు ఎక్కువయ్యాయి. అలా అని మరిదిని, ఆడపడుచుని నిర్లక్ష్యం చేయలేదు.

ఆరోజు అగమ్య సుందర్‌కు చొక్కాకు గుండీపోతే కుడుతూవుంది.

సుందర్, అఖిల ఇద్దరూ వదిన దగ్గరికి వచ్చారు.

ఇద్దరూ గొడవపడ్డారని వాళ్ళ మొహం చూస్తేనే తెలుస్తోంది.

"ఏంటీ... మళ్ళీ గొడవపడ్డారా?" అడిగింది వాళ్ళిద్దర్నీ చూస్తూ.

"వదినా... నీకు నేనంటే ఇష్టమా? అఖిల అంటే ఇష్టమా?" అడిగాడు సుందర్.

"చెప్పొదినా... నేనంటేనే ఇష్టమని చెప్పు" అఖిల రోషంగా అంది.

"అదేమిటి... నాకు మీరిద్దరూ ఇష్టమే" చెప్పింది ఇద్దర్నీ దగ్గరకు తీసుకొని.

"అదేం కుదర్దు వదినా... ఎవరో ఒకరే ఇష్టమని చెప్పాలి" సుందర్ అన్నాడు.

అవునొదినా... నేనే ఇష్టమని చెప్పాలి" పట్టుదలగా అంది అఖిల.

"చూడండి... రెండు కళ్లలో ఏ కన్ను ఇష్టమంటే ఏమని చెబుతారు?" అడిగింది ఇద్దర్నీ.

ఆ ఇద్దరూ ఆలోచిస్తూ వుండిపోయారు. వాళ్ళను తన గుండెకేసి హత్తుకుంటూ అంది.

"నాకిద్దరూ సమానమే. అలానే మీరు ఒకే ప్రాణంలా వుండాలి. ఎటువంటి పరిస్థితిలోనూ గొడవపడకూడదు. మీ ఇద్దర్నీ చూసి, మిగతా వాళ్లంతా మీలా వుండాలని అనుకోవాలి" అంది.

ఇద్దరూ బుద్ధిగా తలూపి వెళ్ళిపోయారు. ఆరోజు సాయంత్రమే మళ్ళీ అగమ్య దగ్గరికి వచ్చారు.

"వదినా... నీకు మేమిద్దరం అంటే ఇష్ట

మని చెప్పావుగా మరి రేపో మాపో పాపో, బాబో వస్తే మమ్మల్ని ప్రేమగా చూడవా? ” అడిగారు.

అగమ్య బిత్తరపోయింది. వాళ్లల్లో ఆ అనుమానం ఇంకా పోలేదు.

ఆ అనుమానం వెనక వాళ్ల భయం అర్థ మైంది. వదిన మొహంలో రంగులు మారడం చూసి భయంగా అన్నారు.

“అది కాదు వదినా. రేపు వాళ్లు వచ్చాక, మమ్మల్ని దగ్గరకు తీసుకోవేమోనని భయం. మాకు నువ్వు కావాలి వదినా” అన్నారిద్దరూ.

మహలక్ష్మి పిల్లల మాటలు విని, వచ్చి “వేలెడంత లేరు అన్నీ అనుమానాలే. వదినతో అలా మాట్లాడొచ్చా” అంటూ వాళ్లను కసిరి పంపించింది. తర్వాత అగమ్య వైపు తిరిగి... “వాళ్లు చిన్న పిల్లలు... మరోలా అనుకోవద్దు నీకు పిల్లలు పుడితే వాళ్లను ఇంత ప్రేమగా చూడవేమోనని భయం. వాళ్ళు మమ్మల్ని విడిచి అయినా వుండగలరేమో కానీ నిన్ను విడిచి వుండలేరు. అందుకే అలా ప్రవర్తిం చారు” సంజాయిషీ ఇస్తున్నట్టు చెప్పింది మహలక్ష్మి.

“ఛ...ఛ... అవేం మాటలు అత్తయ్యా... చిన్న పిల్లలు వాళ్లను అనవసరంగా కోప్ప డ్డారు” అంటూ బయటకు వెళ్ళింది. అరుగు మీద విచారంగా కూచొని వున్నారు పిల్లలి ద్దరూ.

కిచెన్‌లోకి వెళ్ళి స్టీలు డబ్బాలో వున్న లడ్డులు రెండు ప్లేట్లలో పెట్టి తీసుకువ చ్చింది.

ఇద్దరి మధ్యా కూచుంది.

“వదిన మీద అలిగారా? ” అడిగింది.

ఇద్దరూ లేదన్నట్టుగా తలలు అడ్డంగా వూపారు.

“అయితే ఈ లడ్డులు తినండి” అంటూ చెరో లడ్డూ ఇచ్చింది.





“చూడండి... మీరెప్పుడూ నా పిల్లలె... మీ తర్వాతే నాకు పుట్టే పిల్లలు. సరేనా”

ఇద్దరూ వదిన ఒడిలో తలపెట్టి పడుకు న్నారు.

తను కనక పోయినా పిల్లల ప్రేమ చవి చూస్తోంది.

వాళ్ళిద్దర్నీ దగ్గరకు తీసుకుంది.

పిల్లలకు ఇప్పుడు నిశ్చింతగా వుంది.

★ ★ ★

పాణిగ్రాహి బ్యాంకుకు వెళ్ళడానికి రెడీ అవుతున్నాడు. అగమ్య పిల్లలకు స్నానం చేయిస్తోంది.

మహలక్ష్మి కొడుకు దగ్గరికి వచ్చింది.

“పాణీ... బ్యాంకుకు వెళ్తున్నావా? ” అడి గింది.

“అవునమ్మా...ఏంటీ” అడిగాడు పాణి గ్రాహి.

తన పెళ్లయిన తర్వాత ఇంతవరకు ఎప్పుడూ ప్రత్యేకంగా తల్లి తన దగ్గరికి వచ్చి ఎరగదు. ఏ అవసరమైనా అగమ్య తోనే చెబుతుంది. వాళ్ళిద్దరూ తల్లీ కూతు ళ్లలా కలిసిపోయారు.

“నీతో ఓ విషయం మాట్లాడాలిరా” అంది.

“ఏమిటమ్మా” అడిగాడు ఆశ్చర్యంగా.

తల్లి ఏ విషయం తనతో మాట్లాడాలని అనుకుంటోందో... అతని వూహకు అంద డంలేదు. తనతో ప్రత్యేకంగా మాట్లాడాల్సిన విషయం ఏముంటుంది?

“చెప్పమ్మా” అన్నాడు పాణిగ్రాహి కూచుంటూ, తల్లినీ కూచోమని.

“నీ వరుస నాకేం నచ్చడంలేదు పాణీ” అంది నిష్కర్షగా తల్లి.

“నేనేం చేశానమ్మా? ” అయోమయంగా అడిగాడు పాణిగ్రాహి.

“అగమ్య కడుపుతో వుంది కదా”

“అవును”

“కడుపుతో వున్న పిల్లను ఎక్కడికైనా తీసుకెళ్ళాలని తనకు ఇష్టమైనవి తీసుకురా వాలని తెలియదా?

తనకు దానిమ్మ పండు ఇష్టం. వచ్చేప్పుడు తీసుకురావచ్చుగా. ఈ సమయంలో రకరకాల పిండి వంటలు తినాలని వుంటుంది. నాకు చేసే ఓపిక లేదనుకో. కనీసం ఏ స్వగృహనుంచో తీసుకురావచ్చుగా.

గాలిమార్పు కోసం సాయంత్రం బయటకు తీసుకువెళ్ళొచ్చుగా. సినిమాకో, పార్కుకో తీసుకువెళ్లు. దాన్ని అట్లా పట్టించుకోకుండా నీ మానాన నువ్వు బ్యాంకు నుంచి రాగానే కుర్చీలో కూచుండిపోతావు. సరదాగా నాలుగు మాటలు చెప్పొచ్చుగా" తల్లి నిలదీస్తోంది. ఏం మాట్లాడాలో అర్థం కాలేదు పాణిగ్రాహికి.

నిజమే. తను ఆ కోణంలో ఆలోచించలేదు. తను బ్యాంకునుంచి రాగానే ఏవో బుక్స్ చదువుకుంటూ కూచుండిపోతాడు.

అగమ్య ఇంటి పనిలో వుంటుంది.

"అది కాదమ్మా... అగమ్య కూడా ఎప్పుడూ బయటకు వెళ్దామని చెప్పలేదు"

"అదో పిచ్చి పిల్ల... దానికి ఎంతసేపూ ఈ ఇల్లే ప్రపంచం. అఖిలను, సుందర్‌లను చూసుకోవడానికి, నాకు మీ నాన్నగారికి సేవలు చేయడానికి, ఆఫీసు నుంచి రాగానే చిన్న పిల్లాడిలా నిన్ను చూసుకోవడానికి తనకు టైం సరిపోదు.

మనమే తనకు విశ్రాంతి కలిపించాలి. తనని ఆనందంగా వుంచే బాధ్యత నీదే కదరా... అలా సినిమాకు తీసుకువెళ్లు. లేదా ఓ పార్కుకు తీసుకువెళ్లు"

"అలాగేనమ్మా" బుద్ధిగా అన్నాడు.

బ్యాంకులో వున్నా, పాణిగ్రాహికి తల్లి మాటలే గుర్తుకు రాసాగాయి.

తల్లి మాటల్లో నిజముందని అతనికి తెలుసు. తను బ్యాంకు నుంచి ఇంటికి వెళ్ళాక, కామ్‌గా ఏ పుస్తకమో చదువుతూ వుండిపోతాడు.

అగమ్య తనకు అరగంటకోసారి కాఫీ ఇస్తూ వుంటుంది. తను తాగిన కాఫీ కప్పు కూడా అగమ్యే తీసుకువెళ్తుంది.

అగమ్యను తనే ఎక్కడికైనా తీసుకువెళ్లి వుండాల్సింది. పాణిగ్రాహికి తన తప్పేమిటో తెలిసిపోతూనే వుంది.

సాయంత్రం అగమ్యను సినిమాకు తీసుకు వెళ్లాలని నిశ్చయించుకున్నాడు. ఇంటికి దగ్గర్లోనే ఓ సినిమా థియేటర్ వుంది. గంట ముందుగా అడ్వాన్స్ బుకింగ్.

బ్యాంకునుంచి థియేటరుకు వెళ్లి టికెట్లు తీసుకుని అగమ్యను సినిమాకు తీసుకువెళ్లి సర్‌ప్రయిజ్ చేయాలనుకున్నాడు. ఆ ఆలోచన అతనికి ఎంతో ఆనందాన్ని ఇచ్చింది.

బ్యాంకునుంచి సరాసరి థియేటరుకు వెళ్లి రెండు ఫస్ట్‌క్లాస్ టికెట్లు తీసుకున్నాడు. అక్కడ్నుంచి డైరెక్టుగా ఇంటికి వెళ్లాడు.

"అగమ్యా! త్వరగా తయారవ్వు"

భర్తలో ఏనాడూ లేని హుషారు చూసి ఆశ్చర్యపోతూ అడిగింది అగమ్య.

"ఏమిటండీ ఈరోజు స్పెషల్?"

"చెబుతాగా. ముందు నువ్వు తయారవ్వు" అంటూ తొందరపెట్టసాగాడు.

"ఎక్కడికండీ?"

"సస్పెన్స్. తయారవ్వమని చెప్పానా?"

అగమ్య పది నిమిషాల్లో తయారై "కనీసం ఇప్పుడైనా చెబుతారా?" అనడిగింది చెప్పులు వేసుకుంటూ.

"చెప్పను. సస్పెన్స్" అన్నాడు తనూ బయల్దేరుతూ.

"అత్తయ్యకు చెప్పి వస్తానుండండి" అంటూ అత్తయ్య దగ్గరికి వెళ్లింది.

"మంచిది వెళ్లిరామ్మా. సుందర్ గురించి, అఖిల గురించి బెంగపడకు. హాయిగా వెళ్లిరా" అంది ముసి ముసి నవ్వులు నవ్వుతూ మహాలక్ష్మి.

"అంటే మేము ఎక్కడికి వెళ్తున్నామో మీకు తెలుసా అత్తయ్యా?" అని ఆశ్చర్యంగా అడిగింది అగమ్య.

పాణిగ్రాహి ఇంటికి రాగానే తను,

అగమ్య సినిమాకు వెళ్తున్నట్టు చెప్పాడు.

మహాలక్ష్మి చాలా సంతోషించింది.

పెళ్లయ్యాక ఎప్పుడూ ఇద్దరూ కలిసి బయటకు వెళ్లలేదు అందుకే వెంటనే బయల్దేరమంది.

"చెప్పండత్తయ్యా! మీకు తెలుసా? "

'తెలుసు' అన్నట్టు తలూపింది మహాలక్ష్మి.

"తను నన్నెక్కడికి తీసుకు వెళ్తున్నారత్తయ్యా? "

"అబ్బాయితో వెళ్తే నీకే తెలుస్తుందమ్మా"

"త్వరగా వెళ్లండి వదినా" అఖిల, సుందర్‌లు అన్నారు.

ఎప్పుడు తను బయటకు వెళ్తానన్నా మేమూ వస్తామని వెంటపడే పిల్లలు కూడా అంతా తెలిసినట్లు మాట్లాడేసరికి ఆశ్చర్యం మరింత రెట్టింపయింది.

మహాలక్ష్మి పిల్లలకు ముందే చెప్పింది, అల్లరి చేయొద్దని, వెంటపడొద్దని...

ఇద్దరూ బయటకు నడిచారు.

★ ★ ★

"ఇదేమిటి, ఇక్కడికి తీసుకొచ్చారు? " అడిగింది విస్మయంగా అగమ్య.

"మనం పెళ్లయినప్పట్నుంచి కలిసి ఒక్క సినిమా కూడా చూళ్లేదు కదా" పాణిగ్రాహి అన్నాడు.

"అలాని నేను మీతో ఎప్పుడైనా అన్నానా? " సూటిగా అడిగింది అగమ్య.

"అన్లేదనుకో... కానీ..."

"ముందా టికెట్లు ఎవరికైనా అమ్మెయ్యండి"

"అదేమిటి? " అన్నాడు ఆశ్చర్యపోతూ.

"లేకపోతే ఏమిటండీ? చిన్నపిల్లలను, అత్తయ్య, మామయ్యలను వదిలేసి మనం సినిమా చూడ్డం ఏంటి? " అంది అగమ్య.

"అదికాదు అగమ్యా"

"ముందు నేను చెప్పింది చేయండి, ప్లీజ్!"

"ఈ టికెట్లు ఇప్పుడు ఎవరికి అమ్ముతాం? "

"అయితే ఓ పన్జేయండి" అంటూ ఆ టికెట్లు తను తీసుకుంది.

తర్వాత బుకింగ్ కౌంటర్‌వైపు వెళ్లింది. పది నిమిషాల తర్వాత తిరిగి వచ్చింది. ఆమె చేతిలో ఆరు టికెట్లు వున్నాయి.

"ఇవేమిటి, ఇన్ని టికెట్లు ఎందుకు? "

"టికెట్లు అందరికీ తెచ్చాను. పదండి, ఇంకా అరగంట టైం వుంది. అందరం కలిసే సినిమా చూద్దాం. థర్డ్‌క్లాస్ టికెట్లు తెచ్చాను. మనిద్దరం సినిమా చూసే డబ్బుతో ఆరుగురు... ఇంటిల్లిపాదీ చూడొచ్చు" చెప్పింది అగమ్య.

ఒక్కక్షణం ఏం మాట్లాడాలో తోచలేదు పాణిగ్రాహికి.

★ ★ ★

వెళ్లి పావుగంటయినా అవ్వకముందే తిరిగివచ్చిన కోడలిని, కొడుకుని చూసి ఆందోళనగా అడిగింది మహాలక్ష్మి "ఏమయిందమ్మా? " అంటూ.

"ఏమీ లేదత్తయ్యా. మీరు త్వరగా తయారవ్వండి" చెప్పింది అగమ్య.

"మామయ్యా, మీరు కూడా... పిల్లలూ మీరుకూడా" అంది అగమ్య.

"ఎందుకమ్మా? " సుందరమూర్తి అడిగాడు.

"నన్ను సస్పెన్సులో పెట్టారుగా. ఇప్పుడు నేను సస్పెన్సులో పెడతాను" అంది.

అగమ్య బలవంతంమీద అందరూ తయారయ్యారు. పాణిగ్రాహిని నోరు విప్పనీయలేదు అగమ్య.

అందరూ కలిసి సినిమా థియేటరుకు నడుచుకుంటూ వెళ్లారు.

"ఇదేమిటమ్మా? మమ్మల్ని ఇక్కడికి తీసుకువచ్చారు? " సుందరమూర్తి ఆశ్చర్యంగా అడిగాడు.

"అందరం కలిసి సినిమాకు వెళ్దాం మావయ్యా"

"అదేమిటి తల్లీ, హాయిగా దంపతులు మీరిద్దరూ వెళ్లక" సుందరమూర్తి ఇబ్బం





దిగా అన్నాడు.

"సినిమా దంపతులే కలిసి చూడాలని ఎక్కడైనా వుందా మావయ్యా? అందరం సరదాగా చూద్దాం. లేదంటే అందరం ఇంటికి వెళ్లిపోదాం" స్థిరంగా చెప్పింది అగమ్య.

మహాలక్ష్మికి కళ్లలో నీళ్లు తిరిగాయి, కోడలిలోని కూతురి మనసును చూసి.

వదిన పక్కన నేనంటే నేనని సుందర్, అఖిల గొడవపడ్డారు. చివరికి చెరోపక్కన కూచున్నారు.

★ ★ ★

ఆ రాత్రి పాణిగ్రాహికి నిద్రపట్టలేదు. అగమ్య ప్రేమ గురించి, తన కుటుంబం మీద వున్న అవ్యాజమైన అనురాగం గురించి, తను తన కుటుంబంపట్ల నెరవేరుస్తోన్న బాధ్యత గురించే ఆలోచిస్తూ వుండిపోయాడు.

చివరికి తన తమ్ముడు, చెల్లెలు కూడా అగమ్యను వదినమ్మగా కాక అమ్మగా చూస్తున్నారు.

అగమ్య ఓ పక్కకు ఒత్తిగిలి పడుకుంది. చాలా ప్రశాంతంగా వుంది. నిద్రలో ఆమె అమాయకత్వం కనిపిస్తోంది.

మెల్లగా కిందికి వంగి ఆమె నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు.

రోజూ సాయంత్రం అగమ్యను అలా బయటకు తీసుకువెళ్లాలి అనుకుంటూనే వున్నాడు. కానీ బద్ధకం. అలవాటు లేని విషయం. దానికితోడు అగమ్య అందుకు పెద్ద ఇంపార్టెన్స్ ఇవ్వలేదు.

★ ★ ★

మహాలక్ష్మికి ఆయాసం ఎక్కువైంది. సుందరమూర్తికి కూడా ఆరోగ్యం దెబ్బ తింది.

వాళ్లిద్దర్నీ డాక్టర్ దగ్గరికి తీసికెళ్లి అన్ని టెస్ట్‌లూ చేయించింది అగమ్య.

"ఎందుకమ్మా, మాకీ పరిక్షలన్నీ? ఎలాగూ రేపోమాపో రాలిపోయే పండుటాకులం" అన్నాడు సుందరమూర్తి.

"లేదు మామయ్యా! మీరు ఇంకా చాలా కాలం బతకాలి. బతుకుతారు కూడా మన వలను ఎత్తుకోవాలి. ఆడించాలి. వాళ్లకు కథలు చెప్పాలి. నాకు తల్లి, తండ్రి లేని లోటు కూడా మీరే తీర్చాలిగా మామయ్యా" అంది అగమ్య.

కోడలి ప్రేమ వాళ్లను మరింత రుణగ్రస్తులను చేస్తోంది.

డాక్టరు అన్ని పరీక్షలూ చేశాడు. మందులు రాసిచ్చాడు. వాకింగ్ మంచిదని చెప్పాడు.

'ఈ వయసులో వాకింగ్ ఏమిట'ని మహాలక్ష్మి తోసిపుచ్చింది. సుందరమూర్తి కూడా అలాగే అన్నాడు. కానీ అగమ్య ఊరుకోలేదు.

పొద్దున్నే అగమ్య అత్తామామలను నిద లేపింది.

"ఇంత పొద్దున్నే నిద్ర లేపావేమిటమ్మా?" అడిగింది మహాలక్ష్మి.

"డాక్టర్ నన్ను రోజూ మార్నింగ్‌వాక్ చేయమన్నారత్తయ్యా. ఇంత పొద్దున్నే నాకు ఒక్కదానికి భయంకదా. తోడు వస్తారేమోనని"

"అయ్యో తల్లీ, అదేం భాగ్యం?" అందావిడ.

"మామయ్యను కూడా రమ్మనండి అత్తయ్యా" అంది అగమ్య.

"నేనెందుకమ్మా?" అన్నాడు సుందరమూర్తి.

"అలా అయితే నేను మార్నింగ్ వాక్ చేయనులెండి. ఏదో నాకు మీరిద్దరూ తోడుగా వస్తారని" అన్నది నిష్ఠూరంగా.

"అయ్యో, ఎంత మాటమ్మా? పద" అన్నాడాయన.

తర్వాత ముగ్గురూ మార్నింగ్‌వాక్‌కు బయల్దేరారు.

అది వాళ్లకి నిత్యకృత్యమైంది. రోజూ పొద్దునే లేచి మార్నింగ్‌వాక్ చేస్తున్నారు.



కొన్నిరోజుల తర్వాత ఆ ముసలిదంపతులకు తెలిసింది. కేవలం తమ ఆరోగ్యం కోసమే అగమ్య తన పేరు చెప్పి తమతో మార్నింగ్‌వాక్ చేయిస్తోందని.

వాళ్ల మనసు ఆర్ద్రమయింది.

★ ★ ★

అగమ్యకు నెలలు నిండాయి.

పనులు చేసుకోవడం కష్టంగా వుంది. అయినా అతి కష్టమ్మీద పనులు చేస్తోంది.

సుందరమూర్తి ఆరోగ్యం క్షీణించింది. కంటిచూపు మందగించింది.

మహాలక్ష్మి ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగానే వుంది.

అన్ని కష్టాలు ఒక్కసారి వచ్చిపడినట్టనిపించాయి. పొద్దున్నే ఇంటి పనులు చూసుకోవడం, పిల్లలను తయారుచేసి స్కూలుకు పంపడం, అత్తమామలను కనిపెట్టుకుని వుండడం, ఆర్థికంగా కూడా ఇబ్బందులు పెరిగాయి.

అప్పటికే అగమ్య తన దగ్గరున్న కొద్దిపాటి నగలను అమ్మేసింది.

తనకు తేలిగ్గా ప్రసవం అవ్వాలని, ఆపరేషన్ అయితే ఖర్చులు భరించలేననీ దేవుణ్ని వేడుకుంది.

ఆమె మొర దేవుడు ఆలకించాడు. సుఖప్రసవం జరిగింది. కవలలు, పాప... బాబు.

"కవల పిల్లలు పుడితే అదృష్టమట" పాణిగ్రాహి అగమ్య తల మీద చేయివేసి అన్నాడు.

ఆ రోజు సాయంత్రం పాణిగ్రాహి ఇంటికి వచ్చేసరికి అగమ్య కవల పిల్లలను ప్రసవించిన విషయం తెలిసింది.

"పాప తండ్రి పోలిక, బాబు తల్లి పోలిక అయితే మంచిదటగా. పాప చూడు అచ్చం నాలా వుంది. బాబు నీలా వున్నాడు. టోటల్‌గా ఇద్దరు పిల్లలు మనిద్దర్లా వున్నారు కదూ" ఆనందంగా అన్నాడు పాణిగ్రాహి.

చిర్నవ్వుతో భర్త చేతిని తన పెదవులకు ఆన్చుకుంది.

తన పక్కనే పడుకున్న కవల బిడ్డల్ని చూసుకొని మురిసిపోయింది.

అంతలోనే చిన్న బాధా వీచిక, ఒకర్ని పోషించడమే కష్టం అలాంటిది ఇప్పుడు ఇద్దరు.

అన్ని సమస్యలకూ పరిష్కారం దేవుడు చూపించడు. మనమే వెతుక్కోవాలి.

అగమ్య వెంటనే ట్యూబెక్టమీ చేయించుకుంది. రేపు మరో ప్రాణిని ఈ భూమ్మీదికి తెచ్చి ఆ ప్రాణి బతుకును ప్రశ్నార్థకం చేయకూడదు.

ఈ ఇద్దరు పిల్లలను ప్రయోజకుల్ని చేయగలిగితే చాలు.

★ ★ ★

బారసాల లాంటి హడావుడి వద్దని చెప్పింది అగమ్య.

కానీ మహాలక్ష్మి చేయకపోవడమేమిటని పట్టుబట్టింది.

అగమ్యకు బారసాల చేయాలని వుంది. కానీ ప్రస్తుత పరిస్థితిలో అదో ఖర్చు

ఇప్పటికే ఇంటి బడ్జెట్ తలకు మించిన భారంగా వుంది. ఈ విషయం భర్తకు ఎలా చెప్పాలో అర్థం కావడంలేదు.

ఆ రోజు రాత్రి భోజనాలయ్యాక భర్తకు అసలు సంగతి చెప్పింది.

"మరెలా" నిస్సహాయంగా, తనకూ ఏ అయిడియా రావడం లేదన్నట్టు చేతులెత్తేశాడు.

"పోనీ మీ బ్యాంకులో ఏదైనా లోన్ తీసుకోండి. కొద్దికొద్దిగా మనకు కట్ అవుతుందిగా"

"అయ్యో... అదో అప్పు అయి కూచుంటుంది. పెద్ద తలనొప్పి" అన్నాడు పాణిగ్రాహి.

"మరెలా! పోనీ మీకు తెలిసిన వాళ్లను ఎవరినైనా అడగండి"

"వద్దొద్దు... అప్పు నిప్పులాంటిది"





భర్త మాటలకు ఎలా రియాక్టవ్వాలో అర్థం కాలేదు. అప్పు చేయడం ఇష్టముండదు. లోన్ వద్దంటాడు. బారసాల చేద్దామంటాడు. ఇన్ని నిర్ణయాల మధ్య ఎలా బారసాల జరుగుతుంది?

ఏదో ఒకటి చేయాలి. దేవుడి మీద భారం వేసి బారసాల జరపడానికి నిశ్చయించుకుంది.

దాని వల్ల దాదాపు మూడు నెలలపాటు ఇబ్బంది పడవలసి వచ్చింది అగమ్య.

పిల్లలకు కావ్య, కార్తీక్ అని పేర్లు పెట్టారు.

★ ★ ★

అగమ్యకు మరిన్ని బాధ్యతలు పెరిగాయి.

పసిపిల్లల బాధ్యత ఎక్కువయింది. అదీ ఇద్దర్నీ సముదాయించవలసి రావడం, ఇద్దరికీ అన్ని పనులు చేయడం. అత్తగారికి అనారోగ్యం కూడా ఎక్కువయింది. ఆవిడ తనకు సాయం చేసే పరిస్థితిలో లేదు.

అఖిల చిన్న పిల్ల, సుందరూ అంతే.

భర్త ఉదయం బ్యాంకుకు వెళ్లడం... సాయంత్రం బ్యాంకు నుంచి రాగానే బుక్స్ ముందేసుకుని ప్రమోషన్ కోసం ఎగ్జామ్స్‌కు ప్రిపేరవ్వడం.

పోనీ బయట పనులు మార్కెట్, ప్రొవిజన్స్ పనులు అతనితో చెబుదామా అంటే బేరం ఆడ్డం తెలియదు. ఎంత చెబితే అంత ఇచ్చేసి వస్తాడు.

సరుకుల నాణ్యత కూడా తెలియదు.

పిల్లలను వదిలేసి వెళ్లాలన్నా భయమే. ఒక్కోసారి పిల్లలు ఏడుస్తున్నా చదువు ధ్యాసతో ఆ విషయం పట్టించుకోడు.

ఇన్ని బాధ్యతల మధ్య సతమతమవుతున్న అగమ్యకు మరో శరాఘాతం తగిలింది. అది మామయ్య రూపంలో.

★ ★ ★

సుందరమూర్తికి హార్ట్‌ఎటాక్ వచ్చింది. అసలే ఆయన ఆరోగ్యం అంతంత మాత్రం.

పాణిగ్రాహి బ్యాంకులో వున్నాడు. ఆ రోజు ఏదో ఇన్‌స్పెక్షన్ వుందని చెప్పాడు.

అఖిల, సుందర్ స్కూల్‌కు వెళ్లారు.

అగమ్య పిల్లలకు పాలిచ్చి ఇద్దర్నీ నిద్రపుచ్చింది.

మామగారికి కాఫీ కలపడానికి కిచెన్‌లోకి వెళ్లింది.

సరిగ్గా అప్పుడే అతనికి హార్ట్‌ఎటాక్ వచ్చింది. మామగారు గుండె పట్టుకొని కుప్పలాకూలి పడిపోవడంతోనే ఆ షాక్‌తో మహాలక్ష్మి స్పృహ తప్పి పడిపోయింది.

అగమ్యకు ఏం చేయాలో తోచలేదు. గబగబా పక్కింటికి వెళ్లింది. వాళ్లు ఆటోను తీసుకువచ్చారు.

అత్తయ్యను కనిపెట్టుకుని వుండమని పక్కింటివాళ్లకు చెప్పి ఇద్దరు పిల్లలను భుజాన వేసుకొని మామగారిని తీసుకొని హాస్పిటల్‌కు పరుగెత్తింది.

★ ★ ★

సుందరమూర్తిని ఇంటెన్సివ్‌కేర్ యూనిట్‌లో వేశారు.

పిల్లలిద్దరూ ఒకటే ఏడుపు.

హాస్పిటల్‌లో వాళ్ల ఆకలి తీర్చడం కూడా సమస్యే అయింది. కాళ్లూ చేతులూ ఆడ్డం లేదు.

భర్తకోసం బ్యాంకుకు ఫోన్ చేసింది. ఒక గంట తర్వాత వచ్చాడు పాణిగ్రాహి. పిల్లలిద్దర్నీ భర్తకు ఇచ్చి మామగారిని చూడ్డానికి వెళ్లింది. సాయంత్రం వరకూ ఏమీ తినలేదు.

డాక్టర్ దగ్గరికి, మెడికల్ షాప్‌కు తిరగడానికి సరిపోయింది.

ఆ నెల ప్రొవిజన్స్ కోసం దాచిన డబ్బులన్నీ హాస్పిటల్ ఖర్చులకు కరిగిపోతున్నాయి.

అదేమీ ఆలోచించే పరిస్థితిలోలేదు. అంతక్రితం రెండుసార్లు హార్ట్ ఎటాక్

వచ్చిందని తెలిసింది. అగమ్యకు మనసంతా దిగులుగా వుంది.

డాక్టర్లు ఏం కండీషనూ చెప్పలేకపోతున్నారు. పెరాలసిస్ ఎటాక్ అయినా ఆశ్చర్యం లేదు అంటున్నారు. మరో ఇరవై నాలుగు గంటలైతే తప్ప ఏమీ చెప్పలేము అన్నారు.

ఆ రోజు రాత్రి పేషెంట్ దగ్గర ఎవరో ఒకరు వుండాలని చెప్పారు డాక్టర్.

ఇంటి దగ్గర మహలక్ష్మి పరిస్థితి ఏమీ బాగాలేదు. పోనీ భర్తను వుండమని చెప్పాలనుకుంది. కానీ భర్త నిద్రకు ఆగలేడు.

తొమ్మిది అయ్యిందంటే నిద్ర పోవాల్సిందే. ఇలాంటి పరిస్థితిలో అతను మెలకువగా వుండగలడా?

చివరికి తనే వుండాలని నిశ్చయించుకుంది.

"నువ్వు ఈ రాత్రంతా మేలుకొని పిల్లలతో వుండగలవా? " అడిగాడు పాణిగ్రాహి ఆశ్చర్యంగా.

"తప్పదు కదండీ"

"పోనీ నేను కూడా నీతోపాటు వుండిపోనా? "

"ఇక్కడ ఇద్దరు వుండడమెందుకు? పైగా అత్తయ్యగారి పరిస్థితి బాగాలేదు. మీరు ఆమెకు ధైర్యం చెప్పండి.

"అఖిల, సుందర్‌లు ఏం తిన్నారో ఏమో? వాళ్లను కాస్త కనిపెట్టుకుని వుండండి. అఖిల ఈమధ్య రాత్రి పూట భయపడి కలవరిస్తోంది. సుందర్‌కు చలి పడదు. ఫ్యాన్ స్పీడ్‌లో పెట్టకండి"

ఇలా ఒక్కో జాగ్రత్త చెబుతూ వుంది. పాణిగ్రాహికి గొంతు పూడుకుపోయింది.

తన తల్లి, తన చెల్లెలు, తన తమ్ముడు, హాస్పిటల్‌లో వున్నది తన తండ్రి. వాళ్లందరి గురించి అగమ్య ఆలోచిస్తూ వుండడం. అతని గొంతుకేదో అడ్డుపడింది. స్వరపేటిక రుద్ధమైంది. అతని హృదయం ఆర్ద్రమైంది.

★ ★ ★

డాక్టర్లు పెదవి విరిచారు.

పరిస్థితి క్రిటికల్‌గా వుంది. ఇంటికి తీసుకువెళ్లడమే బెటర్ అని చెప్పారు. కనీసం చివరి క్షణంలోనైనా తన వాళ్లమధ్య తృప్తిగా కన్నుమూస్తారని చెప్పారు.

అయినా హాస్పిటల్‌లోనే మామగారిని వుంచడానికి నిర్ణయించుకుంది అగమ్య.

ఏ అర్ధరాత్రో మళ్లీ సివియర్‌గా వుంటే మనిషి ఎలానూ చస్తాడని తెలిసి అతని ఖర్మానికి వదిలి వేయడం నచ్చలేదు.

మామగారిని కనిపెట్టుకొని వుంది అగమ్య. పిల్లలను పడుకోబెట్టింది.

అర్ధరాత్రి ఒంటిగంట దాటుతుండగా మెల్లగా కళ్లు తెరిచాడు. నర్స్‌ని పిలిచి కోడలిని పిలవమని సైగచేశాడు.

నర్స్ బయటకు వచ్చి అగమ్యను పిలిచింది. అగమ్య మామగారి దగ్గరికి వెళ్లింది.

నర్స్‌కు సైగ చేశాడు ఆక్సిజన్ మాస్క్ తీయమన్నట్టు.

నర్స్ వచ్చి ఆక్సిజన్ మాస్క్ తీసింది. అగమ్యను తన పక్కన కూచోమన్నాడు.

"అ...గ...మ్యా" రెండు చేతులు జోడించాడు సుందరమూర్తి. అతని కళ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

"నువ్వు.... నువ్వు... నాకు కోడలివి కావు. కొడుకువి. నా పిల్లలకు తల్లివి. నా భార్యకు సోదరివి. మా ఇంట్లో అన్నీ నువ్వే. నాకు ఎంత తృప్తిగా వుందో తెలుసా తల్లీ. ఇంకా ఇంకా కొన్నాళ్లు బతకాలని వుంది. తల్లిలాంటి నీ సేవలు అందుకోవాలని వుంది. కానీ ఆ దేవుని దగ్గర్నుంచి పిలుపు వచ్చింది. నేను నేను వెళ్తున్నానమ్మా. మీ అత్తయ్య ఒట్టి అమాయకురాలు. దానికి తల్లివైనా, కోడలివైనా నువ్వే... నా పిల్లలను నువ్వు ఎంత ప్రే... ప్రేమగా చూసుకుంటున్నావో నాకు తెలుసు" అగమ్య రెండుచేతులు పట్టుకున్నాడు సుందరమూర్తి.




అగమ్యకు ఏడుపు తన్నుకొచ్చేస్తోంది.

"ఇప్పుడేమైందని మామయ్యా... మీరు ఆరోగ్యంగా వుంటారు. మనవడిని, మనవ రాలిని ఎత్తుకొని ఆడిస్తారు. మీరు పెద్ద దిక్కుగా వుంటారు" అంది.

సుందరమూర్తి కళ్ళు మెరిశాయి. ఈ జన్మకు ఇది చాలు తల్లీ అన్నట్టు అతని పెదవులు విచ్చుకున్నాయి.

అదే... అతని పెదవుల మీద చివరి చిరునవ్వు.

క్రమక్రమంగా అతనిలో ఊపిరి ఆగిపోతూ...

తల పక్కకు వాల్చేశాడు సుందరమూర్తి. అగమ్య శిలాప్రతిమలా వుండిపోయింది.

ఇంటెన్సివ్ కేర్ యూనిట్ బయట నిద్ర పోతున్న పిల్లలు ఉలిక్కిపడి లేచి ఏడుస్తున్నారు.

★ ★ ★

ఒకేసారి కోలుకోని దెబ్బ.

దెబ్బ మీద దెబ్బ.

సుందరమూర్తి మరణవార్త ఇంకా పాణిగ్రాహికి చేరకముందే మహాలక్ష్మి నిద్రలోనే కన్నుమూసింది.

తల్లి శరీరం చల్లబడ్డంతో కంగారుపడి హాస్పిటల్‌కు ఫోన్ చేయబోయిన పాణిగ్రాహికి, హాస్పిటల్‌నుంచి తండ్రి చనిపోయాడన్న వార్త వచ్చింది.

గోడకు చేరగిలబడి కూచున్నాడు పాణిగ్రాహి.

కళ్ళకిందుగా కన్నీళ్ళు చారికలు కట్టాయి. ఏడ్చి ఏడ్చి గొంతు బొంగురుపోయింది.

ఒకేసారి జరిగిన ఈ దారుణమైన విషాదం తట్టుకోలేకపోతున్నాడు.

అఖిల, సుందర్‌లు బిక్కమొహాలు వేసుకొని వున్నారు. వాళ్ళది ఏమీ అర్థంకాని వయసు.

వాళ్ళను గుండెలకు హత్తుకొని ఊరడించింది అగమ్య.

భర్తనలా చూస్తుంటే హృదయం ద్రవించి పోతోంది అగమ్యకు.

అతడినెలా ఓదార్చాలో అర్థంకాలేదు.

భర్త దగ్గరకి వెళ్ళి పక్కనే కూచొని అతని భుజంమీద చేయేసింది.

"మీరే ఇలా దిగాలుపడితే ఎలాగండీ... పసిపిల్లలు... వాళ్ళు మరింత భయపడిపోతారు" అంది అగమ్య.

పాణిగ్రాహి మాట్లాడలేదు. నిశ్శబ్దంగా రోదిస్తూనే భార్య ఒడిలో తలపెట్టాడు.

"అగమ్యా... చిన్నప్పట్నుంచీ నాతో వున్నవాళ్ళు, నన్ను కన్నవాళ్ళు, వాళ్ళకు ఏ విధంగానూ ఏమీ చేయలేదు. ఇంకా కన్నవాళ్ళ రుణం తీర్చుకోనేలేదు. అప్పుడే హడావుడిగా నానుంచి నిష్క్రమించారు" తన్నుకొస్తోన్న దుఃఖాన్ని కంట్రోల్ చేసుకునే ప్రయత్నంలో మాట్లాడుతూనే వున్నాడు.

పుట్టినవాళ్ళు గిట్టకమానరు. గిట్టినవాళ్ళు మరలా పుట్టియే తీరును. ఇట్టి అనివార్యమగు మరణం గురించి చింతించనేల...

గీతలోని శ్లోకాన్ని విడమర్చి అతని శోకాన్ని ఉపశమించే ప్రయత్నం చేస్తోంది అగమ్య.

అతనామె పొత్తిళ్ళలోని పాపాయే అయ్యాడు. తనకిప్పుడు అయిదుగురు పిల్లలా?

★ ★ ★

కాలం ముందుకు వెళ్తూ వర్తమానం తాలూకు విషాదాన్ని గతంగా మార్చి మరుపును తోడిచ్చి విషాదాన్ని మరిచిపొమ్మని చెబుతుంది.

పాణిగ్రాహి మెల్లమెల్లగా కోలుకుంటున్నాడు.

ఓవైపు పిల్లల బాధ్యత ఇంకోవైపు అఖిల, సుందర్, మరోవైపు భర్త.

అందరూ ఆమె దృష్టిలో పిల్లలే. రొటీన్ లైఫ్‌లోకి వచ్చేశాడు పాణిగ్రాహి

అగమ్యకు ఇంటిపని ఎక్కువ అవుతోంది. దానిక్కారణం... పసిపిల్లలు... ఒకేసారి



ఇద్దరు పిల్లలు. ఆ ఇద్దరికీ అన్నీ చేసేసరికి, అఖిల, సుందర్ రెడీ. ఈలోగా భర్తకు టిఫిన్ చేయడం, క్యారేజీ కట్టడం...

పాణిగ్రాహి మాత్రం ఇదేమీ పట్టనట్టు తన పని తాను చేసుకుపోతూనే వుంటాడు.

ఉదయం లేవడంతో పేపర్ చూడ్డం, షేవ్ చేసుకోవడం, ఫ్రెషప్ అయ్యి, టిఫిన్ చేసి, లంచ్ బాక్స్‌తో బ్యాంకుకు వెళ్ళడం... ఇది అతని నిత్యకృత్యం.

అంతకుమించి మరో విషయం ఆలోచించలేడు. ఈ విషయంలో భర్తను కూడా తప్పు పట్టదు అగమ్య.

అది అతని నైజం. అంతకుమించి అతని నిర్లక్ష్యం అనుకోవడానికి ఆమె మనసొప్పదు.

ధటీజ్ అగమ్య.



ఎదురింట్లోకి ఆదినారాయణ దంపతులు దిగారు.

ఆదినారాయణ కూడా బ్యాంక్ ఎంప్లాయే. అందులోనూ పాణిగ్రాహి చేసే బ్యాంకులోనే ట్రాన్స్‌ఫర్ మీదొచ్చాడు.

ఆదినారాయణ చాలా కలివిడి మనిషి అని మొదటిరోజే అర్థమైంది అగమ్యకు.

ఎదురిల్లు ఖాళీగా వుందని, పాణిగ్రాహి చెప్పడంతో ఆదినారాయణ ఎదురిల్లు చూడ్డం, అడ్వాన్స్ ఇవ్వడం, దిగిపోవడం అన్నీ వెంటవెంటనే జరిగిపోయాయి.

కొత్త ఇంట్లో పాలు పొంగించిన వెంటనే ఆదినారాయణ పాణిగ్రాహి దంపతులను పిలిచాడు. అగమ్య ఇద్దరు పిల్లలతో వెళ్ళలేకపోయింది. భర్తని వెళ్ళమంది.

"నేనా... ఎలా వెళ్ళను?" అన్నాడు.

ఆదినారాయణ ఆశ్చర్యపోయాడు.

"అదేంటి. ఎదురిల్లేగా?" అన్నాడు చనువుగా.

"మరేం అనుకోవద్దండీ. ఎక్కడికి వెళ్ళడం నాకు అలవాటులేదు" ఇబ్బందిగా అన్నాడు పాణిగ్రాహి.

ఆదినారాయణ నవ్వి "భలేవారే మనం మనం ఒకే దగ్గర వుంటున్నాం. ఆమాత్రం పలకరించుకోవడాలు, పరామర్శించడాలు లేకపోతే ఎలా? రండి రండి" అంటూ బలవంతం చేశాడు.

ఓ అయిదు నిమిషాల్లో గోడకు కొట్టిన బంతిలా తిరిగొచ్చాడు పాణిగ్రాహి.

"అదేంటి వెంటనే వచ్చారు?" అడిగింది అగమ్య.

"అబ్బ... అక్కడ ఎక్కువసేపు వుండబుద్ధేయలేదు. ఆదినారాయణ ఒకటే మాట్లాడ్డం... దానికి తోడు వాళ్లావిడ చుట్టాలు" అన్నాడు పాణిగ్రాహి.

అగమ్య ఏమనలేదు. భర్త మనస్తత్వం తెలుసు. ఎక్కడా ఇమడలేడు.



ఆదినారాయణ భార్య ఓ ప్రయివేట్ స్కూల్‌లో టీచర్. పేరు సంగీత.

ఆదినారాయణ పాణిగ్రాహి ఇంటికివచ్చి భార్యకు పాణిగ్రాహి దంపతులను పరిచయం చేశాడు.

సంగీత కాస్త హడావుడి మనిషని... డామినేటింగ్ మెంటాల్టీ అని అర్థమైంది అగమ్యకు.





అప్పటికే అగమ్యతో కలిసిపోయింది.

"మా ఊళ్ళో ఇంతకన్నా మంచి జాబ్... అయినా అది వదిలేసి ఇక్కడికి ఎందుకు వచ్చానో తెలుసా? " అంది మెల్లగా కిచెన్ రూమ్‌లోకి వచ్చి.

అగమ్య వాళ్ళకోసం సేమ్యా పాయసం చేస్తోంది.

"ఎందుకు? " అనాసక్తంగానే అడిగింది అగమ్య.

"ఈ మగాళ్ళను నమ్మొద్దండీ. ఎప్పుడే క్షణం బుద్ధి మారుతుందో. ఆడదాన్ని చూసినా, అర్థంబు చూసినా బ్రహ్మకైనా పుట్టు రిమ్మ తెగులు అని వూరికే అన్నారా?

ఏమాటా కామాటే చెప్పుకోవాలి గానీ, మా ఆయన కొద్దిగా చూడ్డానికి ఎర్రగా బుర్రగా వుంటాడు. పైగా కలివిడి మనిషి. ఇట్టే కలిసిపోతాడు. అందులోనూ బ్యాంకులో ఉద్యోగమాయె. ఏ టిప్పులాడో ఆయనకు వల వేస్తే... మనం జాగ్రత్తగా వుండాలండీ. అందుకే నేను ఈ ఊరొచ్చా" అంది ఓ విశ్వరహస్యం చెబుతున్నట్టు.

"ఛ... ఛ వారిని చూస్తే నాకు అలా అనిపించడం లేదు" అంది అగమ్య.

"మీరు బొత్తిగా అమాయకుల్లా వున్నారు. మగాళ్ళు ఎలాంటివాళ్ళో మొహమ్మీద కనిపిస్తుందా ఏంటి? బయటకు అమాయకంగా కనిపిస్తారు. బయట చేసే పనులు బయట చేస్తూనే వుంటారు.

ఇలా చెబుతున్నానని అనుకోకండి. మీరు కూడా మీవారిమీద నాలా ఓ కన్నేసి వుంచండి. చేతులు కాలాక ఆకులు పట్టు కుంటే ఏం లాభం? " తను ధోరణిలో తను చెప్పుకుపోతూనే వుంది.

అగమ్య వింటున్నట్టు నటిస్తూ పాయసం చేసింది.

కాసేపు వుండి వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళాక అడిగాడు పాణిగ్రాహి.

"ఆవిడ నాన్‌స్టాప్‌గా ఏమో చెబుతుందేమిటి? "

సంగీత చెప్పిన విషయాలు చెప్పింది అగమ్య.

"మరి నువ్వేమన్నావు? " అడిగాడు పాణిగ్రాహి.

"నేనేమీ అన్లేదు. ఆవిడ అభిప్రాయం ఆవిడ చెప్పింది. పరిచయం అయిన కొత్తలోనే ఆమెను తప్పు అంటే బాధపడుతుంది. వీలు చిక్కినప్పుడు సమయం చూసుకొని తన అభిప్రాయం తప్పని చెప్పాలి"

"మరి... మరి... నామీద నీకు అనుమానం రాదా? "

"రాదు" స్థిరంగా చెప్పింది అగమ్య.

"అదేంటి? అంత నమ్మకం ఎందుకు? " ఆశ్చర్యంగా అడిగాడు పాణిగ్రాహి.

"నమ్మకం కాదు. ప్రేమ... ప్రేమ నమ్మకంకన్నా గొప్పది. ఆ ప్రేమ వున్న మనిషి, మనిషిని ప్రేమిస్తూనే వుంటాడు"

భార్యవంక అబ్బురంగా చూశాడు. ప్రతీ చిన్న విషయానికి రంధ్రాన్వేషణ చేస్తూ, అనుమానించే భార్యల గురించి తెలుసు. కానీ భర్తను ఇంత ఇదిగా ప్రేమిస్తూ...

"థాంక్యూ... థాంక్యూ అగమ్యా... నీ నమ్మకం ఎప్పుడూ వమ్ముకాదు" చెప్పాడు పాణిగ్రాహి.

"నాకు తెలుసు" అది అగమ్య.

★ ★ ★

"ఏంటి... ఇవాళ షాంపుతో తలంటుకున్నారా? " భర్త తలను కిందికి వంచి వాసన చూస్తూ అడిగింది సంగీత.

"అవును"

"అదేంటి... మీరు శీకాయ సబ్బు కదా వాడతారు. ఈ కొత్త అలవాటు ఏమిటి? " అనుమానంగా అడిగింది సంగీత.

"కొత్త ప్రోడక్ట్ అట. ఫ్రీగా ఇచ్చారు పబ్లిసిటీకోసం. చూద్దామని వాడాను"

"అంతేనా ఎవరైనా సేల్స్‌గర్ల్ అంట

గట్టిందా?" మరింత అనుమానంగా అడిగింది.

"అబ్బ... సంగీతా... నీకు మరీ ఇంత అనుమానం పనికిరాదు" చిరాగ్గా అన్నాడు ఆదినారాయణ.

"నేను ఈమాత్రం అనుక్షణం అనుమానిస్తున్నా ఇలా వున్నారు. నేను కిమ్మనకుండా వుంటే ఈపాటికి ఎన్ని ఇళ్లు పెట్టేవారో. అన్నట్టు నన్ను స్కూల్ దగ్గర డ్రాప్ చేసి వెళ్లండి"

"నాకు బ్యాంకు పది గంటలకు కదా... నిన్ను డ్రాప్ చేసి అరగంట పాటు ఎక్కడుండాలి"

"బ్యాంకులో కూచుని కాలక్షేపం చేయండి"

"పోనీ నిన్ను స్కూలు దగ్గర దింపేసి వచ్చి అరగంట ఆగి వెళ్తాను. ముందుగా వెళ్తే ఆ టైంలో ప్యూన్ కూడా రాడు"

"అదేం కుదర్దు. మీరెక్కడికి వెళ్లారో, ఏం చేస్తుంటారో అని టెన్షన్ బ్యాంకుకు వెళ్లండి. ఆమాత్రం అరగంట కాలక్షేపం చేయలేరా?"

ఆదినారాయణ తల పట్టుకున్నాడు. భార్యలో నచ్చని విషయాల్లో ఇదొకటి అతనికి.

మేనమామ కూతురు. పైగా చిన్నప్పట్నుంచి మరదలు అంటే ప్రేమ. అందువల్ల ఆమె చేసే ఇలాంటి అర్థంపర్థంలేని పనులు భరిస్తూ వుంటాడు.

భార్యను స్కూల్ దగ్గర దింపి బ్యాంకుకు బయల్దేరాడు.

భర్త బయల్దేరే ముందు మరోమాట కూడా అంది.

"ఎలాగూ ముందే వెళ్తున్నారు కదాని ఏ బస్టాప్‌లోనో ఆగి అమ్మాయిలకు లిఫ్ట్ ఇస్తానని అనకండి. బుద్ధిగా బ్యాంకుకు వెళ్లండి. సరిగ్గా అరగంట తర్వాత మీ బ్యాంకుకు ఫోన్ చేస్తాను"

ఆదినారాయణ బుద్ధిగా బ్యాంకుకు వెళ్లాడు. అలా హోటల్‌కు వెళ్లి కాసేపు కూచుని టీ తాగాలన్న కోరికను కూడా చంపుకున్నాడు.

నిజంగా బ్యాంకుకు ఫోన్ చేసినా చేస్తుంది. చేయడమేకాదు తను సీటులో లేకపోతే నానా యాగీ చేస్తుంది.

★ ★ ★

ఎదురింట్లోకి సంగీత ఫ్యామిలి దిగాక కొద్దిగా బావున్నట్టు అనిపించింది అగమ్యకు. భర్తను అనుమానించి చీటికిమాటికీ గొడవ పెట్టుకోవడం తప్ప సంగీత మంచిదే.

ప్రతీ మనిషిలో ఏదో ఓ లోపం వుంటుంది. ఆ లోపం వెనుక భయమో, అమాయకత్వమో వుండి వుండొచ్చు.

సంగీత అగమ్యతో బాగానే కలిసిపోయింది. అప్పుడప్పుడు సాయంత్రం వచ్చి అగమ్య పిల్లలతో ఆడుకుంటుంది.

సరిగ్గా అప్పుడే అగమ్యకు ఓ ఐడియా చెప్పింది. వాళ్ల స్కూల్లో మేడమ్స్ మార్కెట్ దగ్గరికి వెళ్లి చీరలకు ఫాల్స్ కుట్టించుకొని రావాలి.

ఖాళీ సమయాల్లో ఫాల్స్ కుడితే కాస్త ఆర్థికంగా బావుంటుందేమో అన్న ఆలోచన అది.

అగమ్యకు కూడా ఈ అయిడియా నచ్చింది. అఖిల, సుందర్ స్కూల్‌కు వెళ్లాక ఎలానూ ఖాళీ వుంటుంది. అలాంటప్పుడు ఈ పని ఎందుకు చేయకూడదు.

పాణిగ్రాహి జీతం సరిపోవడంలేదు. ఇదో మార్గంగా ఎందుకు అనుకోకూడదు అనిపించింది.

★ ★ ★

కొద్దిగా వెసులుబాటుగా వుంది అగమ్యకు. సంగీత తనకు తెలిసిన వాళ్లకు చెప్పింది. ఫాల్స్ కుట్టడం, డిజైన్ వేయడం లాంటివి చేస్తుంది అగమ్య.

వేడి నీళ్లకు చన్నీళ్లలా కాస్త బావున్నట్టు అనిపించింది.

అఖిలకు, సుందర్‌కు ఫీజులు పెరిగాయి.





ఇదివరకులా అఖిలకు ఏదో ఓ డ్రెస్ వేయడం కుదరదు. అఖిల పెద్దదవుతోంది ప్రపంచం అర్థమవుతున్నట్టు వుంది.

సుందర్ కూడా బుద్ధిగా చదువుకుంటున్నాడు.

వాళ్లిద్దరి దృష్టిలో వదిన ఓ గొప్ప వ్యక్తి. ఒక్కోసారి వాళ్లకు వదిన అని వదినను పిలవడానికి మనసొప్పదు అమ్మా అని అనాలని అనిపిస్తుంది.

అగమ్య వాళ్లకోసం తీసుకునే శ్రద్ధ అలాంటిది.

వాళ్లకు ఏది ఇష్టమో ముందే కనిపెడుతుంది. కావ్య, కార్తీక్ పుట్టాక వాళ్ల మీద శ్రద్ధ మరింత ఎక్కువయింది.

ఏమాత్రం ఏ చిన్న లోటు జరిగినా పిల్లలు పుట్టాక వదిన మారిపోయింది అనే ఆలోచన వాళ్లకు రాకూడదు.

అందుకే వాళ్ల మీద ప్రత్యేక శ్రద్ధ కనపరుస్తుంది.

వాళ్లిద్దరిని తన పక్కనే పడుకోబెట్టుకుంటుంది. ఓసారి సంగీత నవ్వుతూనే అంది.

"ఇటుపక్క మరిది, ఆడపడుచు, అటుపక్క మీ పిల్లలు. చూసే వాళ్లకు నలుగురు పిల్లల తల్లిలా వుంటావు"

చాలామంది తెలియక నిజమేనని నమ్ముతారు.

తనకు కూడా అదే ఇష్టం. వాళ్లు వేరు కాదు. వాళ్లూ తన పిల్లలే.

ఆ ఆలోచనే ఆమెకు ఆనందాన్ని ఇస్తుంది. అఖిల, సుందర్‌లకు అంతే.

ఇలాంటి వదిన వదినమ్మలా ఎందరికి వుంటుంది.

ప్రతి వదిన వదినమ్మ అవ్వగలదా?

★ ★ ★

అంతా బావున్నట్టు అనిపిస్తే సంవత్సరాలు క్షణాల్లా గడిచిపోతాయి.

అంతా శూన్యంగా కనిపిస్తే క్షణాలు కూడా సంవత్సరాలుగా అనిపిస్తాయి.

మధ్య తరగతి మనుషులకు ఈ మార్పు కూడా మధ్యస్థంగానే వుంటుంది.

కావ్య, కార్తీక్‌లను స్కూల్లో వేయాలని అనుకుంది అగమ్య. పిల్లలకు ఏదివున్నాలేక పోయినా చదువు వుండాలి. ఇంట్లో వుంటే అల్లరి ఎక్కువ అవుతుంది. వాళ్లను స్కూల్‌కు పంపించడం తలకు మించిన పనే.

మళ్లీ తన బడ్జెట్‌లో అదొక ఖర్చు అయినా తప్పదు.

సంగీత పనిచేసే స్కూల్‌లో వేయాలని అనుకుంది. ఫీజు కూడా తక్కువ. పైగా అఖిల, సుందర్‌లు చదివేది అదే స్కూల్ పిల్లలకు తోడూ వుంటుంది.

ఆ నిర్ణయానికి వచ్చాక అగమ్యకు తృప్తిగా వుంది. రేపే భర్తను స్కూల్‌కు పంపించి పిల్లలను జాయిన్ చేసి రమ్మని చెప్పాలని అనుకుంది.

ఆ ఆలోచన వచ్చిన వెంటనే తనలో తనే నవ్వుకుంది. ఈ మాట భర్తతో అంటే అతని రియాక్షన్ ఎలా వుంటుందోనని. సరిగ్గా ఆమె వూహించినట్టే వుంది ఆ రియాక్షన్.

"నేనా" అన్నాడు పాణిగ్రాహి.

"మీరేనండి. అడ్మిషన్ ఫీజు లేకుండా సంగీతగారు మాట్లాడతానన్నారు. జస్ట్ ప్రిన్సిపాల్‌ని కలిసి మాట్లాడితే చాలు. అరగంట పని కూడా వుండదు" అంది అగమ్య.

"నిజమేననుకో. కానీ నేను... నేనేం మాట్లాడగలను. నిజం చెప్పాలంటే నాకన్నా నువ్వే బాగా మాట్లాడగలవు" అన్నాడు.

అగమ్యకు పరిస్థితి అర్థమయింది. ఇలాంటి విషయాల్లో ఇక వాదించదు.

మరుసటి రోజు తనే వెళ్లి పిల్లలను జాయిన్ చేయాలని నిర్ణయించుకుంది.

★ ★ ★

సంగీత అగమ్యను ప్రిన్సిపాల్ దగ్గరికి తీసికెళ్లి పరిచయం చేసింది.

"భలేవారే, అగమ్యగారి గురించి

చెప్పాలా? మా స్కూల్‌లో ఠంచన్‌గా ఫస్ట్ కల్లా ఫీజు కట్టేది వారొక్కరే. ఈ స్కూల్‌లో పిల్లలకోసం వాళ్ల పేరెంట్స్ కేర్ తీసుకుంటారోలేదోగానీ అగమ్యగారైతే తన పిల్లల పట్ల తీసుకునే కేర్ చెప్పాల్సిన అవసరంలేదు.

మొదట్లో నేను వాళ్లను అగమ్యగారి పిల్లలే అనుకునే దానిని. మరిదిని, ఆడపడుచుని తన బిడ్డల్లా చూసుకునేవాళ్ల గురించి కథల్లోనే చదివాను, సినిమాల్లోనే చూశాను. ఇప్పుడు రియల్ లైఫ్‌లో చూస్తున్నాను" చెప్పింది ప్రిన్సిపాల్.

అగమ్య ఆ కాంప్లిమెంట్‌కు సిగ్గుపడింది. పొగడ్తను ఎంజాయ్ చేసి పొగడ్తను కోరుకునే మనస్తత్వం కాదు అగమ్యది.

కావ్యను, కార్తీక్‌ని స్కూల్‌లో వేయాలని అనుకుంటున్నట్టు చెప్పింది.

"మీలాంటి పేరెంట్స్ మాక్కావాలి, తప్పకుండా జాయిన్ చేయండి" చెప్పింది ప్రిన్సిపాల్.

"అలానేకానీ వాళ్లకు అడ్మిషన్ ఫీ"

"మీరు అడ్మిషన్ ఫీజు చెల్లించక్కర్లేదు. మంత్లీ ఫీ కడితే చాలు"

"థాంక్సండీ" అంది అగమ్య సిన్సియర్‌గా.

"నేనే మీకు థాంక్స్ చెప్పాలి. మా స్కూల్‌లో చదివించాలని మీలాంటి పేరెంట్స్ ఎలా అనుకుంటారో. మీలాంటి పేరెంట్స్ తమ పిల్లలను మా స్కూల్‌లోనే చదివించాలని మేమూ అలానే కోరుకుంటాం. ఎందుకంటే మీ పిల్లలు బ్రిలియంట్స్... అఖిల, సుందర్‌లు ఎప్పుడూ వాళ్ల క్లాసుల్లో ఫస్టే.

మీరు వాళ్లపట్ల తీసుకునే కేర్ అలా వుంటుంది. ఎంతమంది పేరెంట్స్ ఇంత కేర్ తీసుకుంటారు? స్కూల్‌కు పంపిస్తున్నాంగా. వాళ్లే చూసుకుంటారని పిల్లలను నిర్లక్ష్యం చేస్తుంటారు. మీలా ఇంట్లో పిల్లలను చదివించి కేర్ తీసుకునే వాళ్లు అరుదు. సో ఆ క్రెడిట్ మీదే.

మీ పిల్లల వల్ల మా స్కూల్‌కూ మంచి పేరొస్తుంది. పాపులార్టీ పెరుగుతుంది" అంది ప్రిన్సిపాల్

అగమ్య ఫీజు చెల్లించి పిల్లలను క్లాసు రూమ్‌కు తీసుకెళ్లింది.

"అగమ్యగారూ మీరు వెళ్లండి. నేను పిల్లలను వాళ్ల మేడమ్ దగ్గరికి తీసుకెళ్లి క్లాసు రూమ్‌లో కూచోబెడతాను" అంది సంగీత.

అలానే అన్నట్టు తలూపి కావ్య, కార్తీక్‌లకు టాటా చెప్పి బయటకు వచ్చింది.

అప్పుడే ఇంటర్వెల్ అయింది.

అగమ్యను చూసి సుందర్, అఖిల పరుగెత్తుకొచ్చారు వదినా అంటూ.

వాళ్లిద్దరికీ చాక్లెట్స్ ఇచ్చి, అక్కడ్నుంచి ఇంటికి బయల్దేరింది.

★ ★ ★

పిల్లలు స్కూలుకు ఎలా అలవాటు పడతారోనని మొదట్లో కంగారుపడింది అగమ్య.

చిత్రంగా కావ్యగానీ, కార్తీక్‌గానీ అల్లరి చేయలేదు. స్కూలుకు వెళ్లమని మొరాయించనూ లేదు. బుద్ధిగా స్కూల్‌కు వెళ్తున్నారు.

కాకపోతే అగమ్యకు పని ఒత్తిడి బాగా పెరిగింది. ఎంత త్వరగా లేచినా, నలుగురు పిల్లలకు స్నానం చేయించడం, తయారు చేయడం, టిఫిన్లు తినిపించడం, బాక్సులు సర్దడం, స్కూల్‌వరకూ వెళ్లి దింపేసి రావడం... అయినా అగమ్య ఆ స్ట్రెయిన్‌ని ఇబ్బందిగా ఫీలవ్వడంలేదు.

తను కష్టపడేది తన పిల్లలకోసమే.

స్కూల్లో మాత్రం అగమ్యను అందరూ వింతగా చూసేవాళ్లు. మరికొందరు అభిమానంగా, గౌరవంగా చూసేవాళ్లు.

నలుగురు పిల్లలతో నడిచొస్తోన్న అగమ్యను చూస్తే అందులో ఏ ఇద్దరు అగమ్య పిల్లలో చెప్పడం కష్టం. అంత ఇదిగా నలుగుర్నీ ప్రేమిస్తుంది. వాళ్లకు డ్రెస్ కూడా ఒకేలా వేస్తుంది. ఎవరికేమాత్రం బాధ కలి




గినా భరించలేదు.

పిల్లలు కూడా చాలా దగ్గరగా కలిసిపో యారు. తను జిజియాబాయి అంత గొప్పది కాకపోయినా, కనీసం తన పిల్లలకు ప్రేమ, దగ్గరితనం, సంస్కారం అలవర్చాలి.

అగమ్యకు తగినట్లే ఆ పిల్లల్లో కూడా స్వతఃసిద్ధమైన సంస్కారం వచ్చింది.



పిల్లలు స్కూలుకు వెళ్తున్నారు. మధ్యాహ్నం సమయం చిక్కుతోంది. దాన్ని ఎలా సద్వినియోగం చేసుకోవాలి? పాణి గ్రాహి జీతం డబ్బులు ఇచ్చి చేతులు దులి పేసుకుంటాడు. అతని తత్వమే అంత.

ఆ డబ్బుతో ఇల్లు గడవడం అంత ఆషా మాషీకాదు. పైగా పిల్లలు ఒక్కో క్లాసు పైకి వెళ్తున్నకొద్దీ ఫీజులూ... పుస్తకాలు... బట్టలూ...

ఆరోజు పెందలాడే వచ్చింది సంగీత. ఆరోగ్యం బాగాలేనందున పర్మిషన్ తీసు కుని వచ్చింది. కాసేపు ఇంట్లో అటూఇటూ తిరిగింది. బోర్‌గా అన్పించింది.

వెంటనే అగమ్య దగ్గరికి వచ్చింది. అగమ్య ఆ నెల బడ్జెట్ తయారుచేస్తోంది.

"ఏంటీ... బడ్జెట్ సమావేశాలకు ముందుండే టెన్షన్ కనపడుతోంది?" అడి గింది సంగీత నవ్వుతూ.

"బడ్జెట్‌లో ఎక్కువ తక్కువలు చేయొచ్చు. పన్నులు వేయనూవచ్చు కానీ ఇక్కడ ఇంటి బడ్జెట్‌లో అవేమీ కుదరవు కదా. వచ్చినట్టు వున్న బడ్జెట్‌లోనే అడ్జస్ట్ అవ్వాలి. లేదా కోత..."

"బాగా చెప్పావు. కానీ ఓ విషయం చెప్పనా?"

"చెప్పండి" అంది అగమ్య.

"మీవారు మంచి పొజిషన్‌లోనే వున్నారు కదా. చిన్న చిన్న పనులు చేస్తే సైడ్ ఇన్‌కం కూడా వుంటుంది"

"సైడ్ ఇన్‌కమా?"

"అవును. అదే లోన్లు శాంక్షన్ చేయించ డంలాంటివి. మామూలు క్లర్కులు కూడా బోల్డు సంపాదిస్తున్నారు. నేనూ మా ఆయ నతో అదే అన్నాను కూడా" అంది సంగీత.

"వద్దండీ. నాకూ ఇష్టముండదు. తనకూ అలాంటివి చేతనవ్వవు. తన పనేదో తను చేసుకువెళ్తారంతే"

"మీరు బొత్తిగా లౌక్యం లేకుండా మాట్లా డతారు. ఈ రోజుల్లో ఇది తప్పేమిటండీ? అయినా ఇందులో మనం చేసే తప్పేముం దండీ? కాస్త చూసీ చూడనట్టు..."

అగమ్య నవ్వి అంది "బ్యాంకులో పాస్ బుక్ తీసుకోవాలని ఎవరైనా అడిగితే ఇంట్రడ్యూస్ చేయడానికి ఆలోచిస్తారా యన. అది ఆయన తప్పని నేను అనడం లేదు. అది తన మనస్తత్వం. తనూ తన పనీ... కనీసం బ్యాంకు నుంచి ఇంటికి వచ్చి పార్ట్‌టైమ్‌గా కోచింగ్ సెంటర్‌అయినా నడుపుకోవచ్చు

కానీ చెయ్యరు. ఓ పద్ధతి, ఓ డిసిప్లిన్... తన ప్రపంచంలో తను అలానే బ్రతకడానికి ఇష్టపడతారు. బ్యాంకు వదిలి ఇంటికి వచ్చాక మరో పని చేయరు, చేయలేరు" అంది అగమ్య.

"అలాని మనం ఊర్కుంటామా? నిలదీ

యండి. మీరు మాత్రం ఎంతకాలం ఇలా బడ్జెట్ లతో కుస్తీపడతారు?" అంది సంగీత.

అగమ్య నవ్వి "కొన్ని విషయాల్లో మరీ లోతుగా ఆలోచించను. ఇదిలా సాగిపోతూనే వుంటుంది" అంది టాపిక్ మారుస్తూ.

సంగీత మరేమీ మాట్లాడలేదు

"ఉండండి కాఫీ తెస్తాను" అంటూ లేచి కిచెన్ లోకి వెళ్ళింది కాఫీ కలపడానికి.

కాఫీ తాగుతూ మౌనంగా ఉండిపోయింది సంగీత.

అగమ్య సంగీత ఇబ్బంది పడుతుందని గ్రహించి మరో టాపిక్ లోకి వెళ్ళిపోయింది.

కాసేపు వుండి వెళ్ళింది సంగీత.

★ ★ ★

"ఆ అగమ్య ఎంత అమాయకురాలో చూశారా" భర్త రాగానే అంది సంగీత

"ఇందులో అమాయకత్వం ఏముంది? అగమ్యగారు సరిగ్గానే చెప్పారు" అన్నాడు.

"అంటే... నేను చెప్పింది తప్పా?" అంది.

"తప్పా? ఒప్పా? అన్నది మనం ఆలోచించుకోవాలి"

"ఆఫీసుల్లో, బ్యాంకుల్లో ఎంతమంది పై సంపాదనతో బతకడం లేదు. అందరూ మనలా చేతులు ముడుచుకు కూచుంటున్నారా?"

"అయినా ఇందులో చేతులు ముడుచుక్కూచుంది ఏమీలేదు. మనం జాబ్ చేస్తున్నందుకు మనకు జీతం వస్తుంది. ఇంకా అంతకన్నా మనం ఎక్కువగా ఎక్స్ పెక్ట్ చేయడం ఎందుకు?" అన్నాడు.

"అంటే మీరు కూడా ఇలానే ఎదిగీఎదగకుండా మన్ను తిన్న పాములా వుండిపోతారా?" గయ్ మంది సంగీత.

ఆదినారాయణ అనునయంగా అన్నాడు.

"చూడు సంగీతా... మనకు వున్నదాంట్లో సంతృప్తిపడ్డం చాలా మంచి పద్ధతి"

"అలా వున్నదాంట్లో సంతృప్తిపడితే జీవితంలో ఏమీ ఎదుగుదల వుండదు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వుండిపోతుంది"

"అలా అని వేగంగా దూసుకెళ్ళి గుద్దుకుంటే, మనిషే గల్లంతవుతాడు"

"చాల్లెండి, మీవన్నీ పనికిమాలిన చేతకాని కబుర్లు" అంది సంగీత.

టాపిక్ సీరియస్ గా మారుతోందని అర్థమైంది. వెంటనే టాపిక్ ని డైవర్ట్ చేస్తూ...

"నాకు ఆకలివేస్తోంది అన్నం పెట్టు. కాళ్ళు కడుక్కుని వస్తాను" అంటూ బాత్రూంలోకి వెళ్ళాడు.

"దానికి మాత్రం ఏంతక్కువలేదు" అంటూ కిచెన్ లోకి వెళ్ళబోతూ... ఆగి, ఆదినారాయణ బట్టలు విడిచిన స్టాండు దగ్గరికి వెళ్ళింది.

కాళ్ళు కడుక్కుని వచ్చిన ఆదినారాయణ భార్య తన బట్టలు వాసన చూస్తుండటంతో తల పట్టుకుని "ఏంటది? ఏం చేస్తున్నావు?" అన్నాడు.

"ఆ... ఏ పర్ఫ్యూమ్ వాసన వస్తుందా అని చూస్తున్నాను" అంది.

"మనింట్లో పర్ఫ్యూమ్ లేదుకదా. ఆ స్మెల్ ఎలా వస్తుంది?" అంటూ తల పట్టుకున్నాడు.

"సంగీతా! నీకింత అనుమానం పనికిరాదు"

"మీ మగాళ్ల వెధవ్వేషాలు ఎవరికి తెలియవని? కాస్త ఛాన్స్ దొరికితే చాలు, అలా దూరిపోతారు. అన్నట్టు మీ బ్యాంకులో లేడీ స్టాఫ్ ఎంతమంది వున్నారు?" ఆరా తీస్తున్నట్టు అడిగింది.

"రేపు కనుక్కుని, డిటైల్స్ మొత్తం నీకిస్తాను. ముందు అన్నం వడ్డించు" కోపంగా అన్నాడు.

ఒక్కోసారి భార్య ఇలా అనుమానించడం చూస్తే కోపం వస్తుంది. కానీ ఆమె అమాయకత్వం చూసి ఆ కోపం ఇట్టే మంచులా




కరిగిపోతుంది. అది ఆదినారాయణ బల హీనత.

★ ★ ★

పిల్లలు ఆకలని గొడవ చేస్తున్నారు. కావ్య కాళ్లు నేలకేసి కొడుతోంది. అది చూసి కార్తీక్ కూడా మరింత అల్లరి చేస్తు న్నాడు.

అగమ్య పెద్ద పళ్లెంనిండా అన్నం పెట్టి పెరుగువేసి కలిపింది. ఆవకాయ ముక్కలు కడిగి ప్లేటులో ఓ పక్కన వేసింది. కడిగిన ఆవకాయ పచ్చడి ముక్కలు పిల్లలంతా చాలా ఇష్టంగా తింటారు.

కావ్యకు, కార్తీక్‌కు తినిపిస్తోంది.

అది చూసి "నాకూ ఆకలి వేస్తోంది వదినా" అంటూ వచ్చింది అఖిల.

"ఒక్కక్షణమాగు. కావ్యకు తినిపించి నీకు పెడతాను"

"ఉహూ... నాకూ నువ్వే తినిపించాలి" అని మారాం చేసింది.

ఇదే అదనుగా సుందరూ వచ్చాడు. ఇల్లంతా గొడవ గొడవ.

మరికాస్త అన్నం కలిపి నలుగురికీ ముద్దలు చేసి పెట్టసాగింది.

అప్పుడే వచ్చాడు పాణిగ్రాహి.

"అదేమిటి అగమ్యా? అఖిల ఇంకా చిన్న పిల్ల అనుకున్నావా? సుందర్ కూడా పెద్ద వాడయ్యాడు. వాళ్లు కలుపుకు తినలేరా?" అన్నాడు.

"మీరు వూరుకోండి. మీ దిష్టే వాళ్లకు తగిలేలా వుంది. వాళ్లింకా నా దృష్టిలో చిన్నపిల్లలే" అంది మురిపెంగా వాళ్లవైపు చూస్తూ.

అగమ్య ఎప్పుడూ తాజాగా కనిపించే గులాబీనే. పువ్వులైతే వాడిపోతాయి. కానీ అగమ్య మనసులో ప్రేమ ఎప్పుడూ వాడి పోదు. ఇలాంటి దృశ్యాలు అతను చాలా చూశాడు. చూసిన ప్రతీసారి అతనికి అబ్బు రంగానే వుంటుంది.

ఓ వ్యక్తి, అందులోనూ పుట్టింటినుంచి మెట్టినింటికి వచ్చిన వ్యక్తి, మెట్టినింటి వాళ్లను ఇంత ప్రేమగా చూడ్డం ఎలా సాధ్యం?

నలుగురినీ వరుసగా కూచోబెట్టి 'ఇది సుందర్ ముద్ద, ఇది అఖిల ముద్ద, ఇది కావ్యది, ఇది కార్తీక్‌ది అంటూ నలుగురికీ తినిపిస్తోంది.

నలుగురూ సుష్టగా తిని అగమ్య చీరకొం గుతో మూతి తుడుచుకుని ఆడుకోడానికి వెళ్లారు.

నలుగురూ బాగా కలిసిపోయారు. దాని క్కారణం వాళ్లమధ్య వయసు తేడా కూడా ఎక్కువగా లేకపోవడమే.

★ ★ ★

సాయంత్రం స్కూల్‌నుంచి రాగానే అందరినీ మొహాలు కుడుక్కోమని చెప్పి, వాళ్లు ఫ్రెషప్ అయ్యాక, బూస్ట్ కలిపిచ్చి కూచోబెట్టి పాఠాలు చెబుతుంది.

నలుగురికీ ట్యూటర్ అగమ్యే. ఒక్కొక్క రికీ చాలా ఓపిగ్గా చెబుతుంది. అర్థం కాక పోతే మరోసారి అడిగి, వాళ్లకు అర్థమ య్యేలా చెబుతుంది.

"వదినా! ఇవాళ స్కూల్‌లో మా మేడమ్ మీరు పెద్దయ్యాక ఏమవుతారని అడిగారు తెలుసా?" చెప్పాడు సుందర్.

"మరి నువ్వేం చెప్పావు?" అడిగింది అగమ్య.

"అఖిల ఏం చెప్పిందో తెలుసా?" తన గురించి చెప్పకుండా అన్నాడు సుందర్.

"ఏం చెప్పిందేమిటి?"

"తను డాక్టర్నో, ఇంజనీర్‌నో పెళ్లి చేసు కుంటుందిట" చెప్పి ఫక్కున నవ్వాడు సుందర్.

"చూడొదినా! వాడెలా నవ్వుతున్నాడో అచ్చు కోతిలా"

"తప్పు! అలా అనొద్దు" అంది అగమ్య.

"మరి వాడలా అనొచ్చా" అంది బుంగ మూతి పెడుతూ.

"సుందర్, తప్పు అలా అనకూడదు" చెప్పింది అగమ్య సుందర్‌కు.
"సారీ వదినా" అన్నాడు తలవంచుకొని.
"పోనీలే తప్పు చేసే వాళ్లకన్నా తప్పు తెలుసుకునే వాడు గొప్పవాడు. అది సరే! ఇంతకీ నువ్వేం చెప్పావు? "
"ఇంజనీర్‌ని అవుతానని చెప్పాను" గొప్పగా చెప్పాడు.
"నిజమా! వెరీగుడ్! అయితే మా సుందర్ ఇంజనీర్ అవుతాడన్నమాట"
"అవుతాను. కానీ..." అంటూ ఆగిపోయాడు.
"కానీ ఏమిటి? చెప్పు సుందర్"
"టీచర్ ఏమందో తెలుసా వదినా? "
"ఏమన్నది? "
"ఇంజనీర్ అంటే మాటలు కాదు. భోల్డు డబ్బు ఖర్చవుతుంది. నీకు అమ్మ, నాన్న లేరుకదా... మీ అన్నయ్య అంత డబ్బు ఖర్చు పెడతాడా, మీ వదిన అందుకు ఒప్పుకుంటుందా? అన్నది" అమాయకంగా చెప్పాడు సుందర్.
"మరి నువ్వేమన్నావు? "
"నాకు అమ్మానాన్న లేరని ఎవరన్నారు టీచర్. మా అమ్మ పేరు అగమ్య అని చెప్పాను" అలా చెప్పేటప్పుడు సుందర్ కళ్లు కన్నీళ్ళతో మెరిశాయి.
ఒక్కసారిగా చప్పున కదిలిపోయింది. గుండెలోని అమ్మప్రేమ తన్నుకొచ్చింది.
"సుందర్" అంటూ మరిదిని దగ్గరకు తీసుకుంది.
"నువ్వు నాకు అమ్మవు కాదా... వదినమ్మా" అగమ్య చుబుకం పట్టుకుని పైకెత్తి అడిగాడు మరింత అమాయకంగా సుందర్.
"అవును బాబూ... నేను అమ్మనే. నీకు, అఖిలకు, కావ్యకు, కార్తీక్‌కు నలుగురికీ అమ్మనే"
"మరి నన్ను ఇంజనీర్ చదివిస్తావా? " అమాయకత్వంతో అడిగాడు.
"తప్పకుండా... నిన్ను ఇంజనీర్‌ని చేస్తాను సరేనా" అంది.
"మా మంచి వదినమ్మ" అంటూ బుగ్గ మీద ముద్దుపెట్టాడు సుందర్.
"వదినా... మరి నాకు డాక్టర్‌నో, ఇంజనీర్‌నో తీసుకువచ్చి పెళ్ళి చేయాలి" బుంగ మూతి పెట్టి అంది అఖిల.
"అలాగే" అంది అగమ్య నవ్వుతూ.
వాళ్ళిద్దరూ ఆడుకోవడానికి వెళ్ళిపోయారు.
కావ్య, కార్తీక్ మౌనంగా కూర్చున్నారు.
"అదేమిటి... యువరాజు. యువరాణి అలిగారా? " అడిగింది పిల్లల వాలకం చూసి అగమ్య.
"మమ్మీ నువ్వు నాకూ, కావ్యకే మమ్మీవి కదా"
"అవును"
"మరి... అఖిల, సుందర్‌లు"
కార్తీక్ మాటలు అర్థమయ్యాయి.
"తప్పు.. అలా అనకూడదు. వాళ్ళకు మమ్మీ, డాడీ లేరుకదా... మీ డాడీకి వాళ్ళు తమ్ముడు, చెల్లెలు కదా. మరి వాళ్ళకు ఎవరూ లేరంటే బాధపడరా? మనదంతా ఒకే కుటుంబం. వసుధైక కుటుంబంలా వుండాలి"
"మమ్మీ చెప్పింది కరక్ట్‌రా" పెద్ద ఆరిందలా అంది కావ్య.
కార్తీక్ తల్లి వెనగ్గా వచ్చి, మెడచుట్టూ చిన్న చేతులు వేసి...
"సారీ మమ్మీ" అన్నాడు.
"వెరీగుడ్ బాయ్. ఇప్పుడు వెళ్ళి అఖిల, సుందర్‌తో ఆడుకోండి. మీరెప్పుడూ కలిసి వుండాలి" అంది.
"అలాగే మమ్మీ"
"ఏదీ ప్రామిస్ చేయండి" అంది చెయ్యి చాస్తూ.
"ప్రామిస్" అన్నాడు కార్తీక్.
కావ్య కూడా అగమ్య చేతిలో చేయివే

సింది.

★ ★ ★

"ఏంటీ పిల్లలకు వరాలిచ్చి వస్తున్నావు?" అడిగాడు అప్పటివరకూ వాళ్ళ మాటలు బెడ్‌రూంలో నుంచి విన్న పాణిగ్రాహి.

"వరాలు కాదండీ. మన కనీసబాధ్యత" అంది అగమ్య అతని పక్కన కూచుంటూ.

"కానీ, అది ఎంత కష్టమో తెలుసా. ఇప్పటికే వాళ్ళ చదువుకు బోల్డు ఖర్చవుతుంది. ఏదో డిగ్రీ వరకూ చదివించి వాళ్ళ దారికి వాళ్ళను వదిలేస్తే"

"అవేం మాటలండీ. ఈ రోజుల్లో డిగ్రీ చదువుకోగానే సరా. అయినా మనకు ఇష్టమెచ్చిన చదువు కాదు వాళ్ళు ఇష్టపడే చదువు చదివించాలి. పాపం సుందర్‌కు చిన్నప్పట్నుంచి ఇంజనీర్ కావాలని కోరిక"

"ఇంజనీరింగ్ కోర్స్ అంటే ఆషామాషీ అనుకుంటున్నావా అగమ్యా? నీకు తెలియనిదేముంది? "

"ఏదైనా కష్టమేనండీ... అయినా కష్టమని నిశ్శబ్దంగా వుండిపోతే ఎలా... మీరు ఎన్నయినా చెప్పండి. సుందర్ ఇంజనీర్ అవుతాడు చూడండి"

భార్య మాటకు తిరుగులేదని తెలుసు.

అగమ్య ఓసారి ఓ నిర్ణయం తీసుకుంటే అది ఎంత కష్టమైనా ఆ నిర్ణయాన్ని అమలుపరుస్తుంది.

★ ★ ★

ఆదినారాయణ ఇంట్లో ఆరోజు గొడవ అయింది. సంగీత స్కూల్‌నుంచి ఇంటికి తిరిగివస్తుంటే ఆదినారాయణ స్కూటర్ మీద ఎవరో ఓ అమ్మాయిని ఎక్కించుకుని వెళ్తూ కనిపించాడట.

దాంతో ఆ ఇంట్లో నిప్పు రాజుకుంది. ఆదినారాయణ అసలేం జరిగిందో చెప్పడానికి ప్రయత్నిస్తున్నా సంగీత అదేమీ వినిపించుకోవడంలేదు.

గదిలోకి వెళ్ళి బోల్టు పెట్టుకుంది.

నిరసన మొదలైంది.

అగమ్య ఇదంతా గమనిస్తూనే వుంది.

భార్యాభర్తల గొడవ మధ్య తల దూర్చడం ఎందుకని వూర్కుంది.

ఆ రోజంతా సంగీత బయటకు రాలేదు. స్కూలుకు కూడా వెళ్ళలేదు.

సాయంత్రం పాణిగ్రాహి ఇంటికి వచ్చాక అగమ్యతో చెప్పాడు.

"పాపం... ఆదినారాయణ ఇవాళ చాలా డల్‌గా వున్నాడు. క్యాష్ కౌంటర్‌లో కూచొని ఎవరికో వేయి రూపాయలు ఎక్కువ ఇచ్చాడు. వాళ్ళు తెలిసినవాళ్ళు కావడం, అందులోనూ మంచివాళ్ళు కావడం వల్ల, ఎక్కువ ఇచ్చిన డబ్బు ఇచ్చేశారు. మధ్యాహ్నం లంచ్ కూడా చేయలేదు. నాతోపాటు క్యాంటీన్‌కు రమ్మన్నా రాలేదు"

అగమ్యకు బాధేసింది. సాధారణంగా ఎప్పుడూ నవ్వుతూ వుంటాడు ఆదినారాయణ.

అగమ్య తల దువ్వుకుని వాళ్ళింటికి వెళ్ళింది. ఆదినారాయణ ముందు రూమ్‌లో కూచొని వున్నాడు. అతని మొహంలో బాధ స్పష్టంగా తెలుస్తోంది.

అగమ్యను చూసి నవ్వాడు.

ఆ నవ్వులో జీవం లేదు.

"మీరా... రండి... రండి" అన్నాడు.

"సంగీతగారు లేరా? " అడిగింది.

"అదా... వున్నారు. కాస్త తలనొప్పిగా వుందని నిద్రపోతోంది"

"నేను వచ్చానని చెప్పండి" అంది.

ఇబ్బందిగా కదిలాడు ఆదినారాయణ.

అగమ్య గొంతు విని, సంగీత తన గది లోనుంచి బయటకు వచ్చింది.

ఆమె కళ్ళు ఎర్రగా వున్నాయి.

"మీరా... రండి" అంది ముభావంగా. సంగీతతోపాటు నడిచింది అగమ్య.

"ఏంటీ డల్‌గా వున్నారు. జ్వరమా? "

"అ... అవునవును" అంది సంగీత.

"జ్వరం శరీరానికి కాదు. మనసుకు



కదా" సంగీత తలవంచుతుంది.

"చూడండి. మనం ఇరుగూపొరుగూ. మీ వ్యక్తిగత విషయాలు అయితే చెప్పొద్దులెండి, అయినా ఒకటి గుర్తుంచుకోండి. సంసారం అన్నాక గొడవలు వస్తూవుంటాయి, పోతూ వుంటాయి.

పరిష్కారం లేని సమస్యలంటూ వుండవు. ఒక్కోసారి అనవసరంగా కూడా గొడవలు మొదలవుతాయి. శాంతంగా, ప్రశాంతంగా ఆలోచించగలిగితే, ప్రతీ సమస్యకూ పరిష్కారం దొరుకుతుంది"

"పోనీ మీరు చెప్పండి" అంది శాంతంగా అగమ్య.

"మీవారు స్కూటర్‌మీద ఎవరైనా అమ్మాయిని ఎక్కించుకుని మీకు దారిలో కనిపిస్తే మీరేం చేస్తారు? "

"ఆ అమ్మాయి ఎవరో అడుగుతాను. ఆ అమ్మాయిని ఏ పరిస్థితిలో ఎక్కించుకున్నారో కనుక్కుంటాను" అంది అగమ్య.

"అంటే అలా ఎక్కించుకోవడం తప్పు కాదా" ఆశ్చర్యంగా అడిగింది సంగీత.

"స్కూటర్‌మీద లిఫ్ట్ ఇచ్చిన ఉద్దేశాన్ని బట్టి వుంటుంది. ఆ అమ్మాయి చెల్లెలి వరుస కావచ్చు. ఏదైనా ఆపదలో వుండి వుండొచ్చు. కొలిగ్ కావచ్చు ముందు కారణం తెలుసుకోవాలిగా.

డాక్టరైనా రోగనిర్ధారణ చేయకుండా చికిత్స చేయడు. ప్రతి భార్య ఓ డాక్టరే అనుకోండి. భర్తకు వ్యామోహం అనే రోగం వుందో, లేదో తెలుసుకోకుండా ఓ రోగిలా ట్రీట్‌చేసి, నిరసన అనే మందును ఇస్తే అది వికటించే ప్రమాదం వుంటుంది"

"అంటే... అంటే నేను చేసింది తప్పా? "

"ముందు మీరు రిలాక్సవ్వండి. అన్నం తినండి. మీ ఆయన్ని రిలాక్సమవ్వమని చెప్పండి. మీరు తినలేదని ఆయన తినలేదు. బ్యాంకులో కూడా ఆయన ఈ ఫీలింగ్‌తోనే వుండి పొరపాటున డబ్బు ఎక్కువ ఇచ్చారు. ఒకవేళ పెద్ద అమౌంట్ ఎక్కువ ఇచ్చివుంటే ఆయన ఉద్యోగానికే ఎసరొచ్చేది"

ఒక్కక్షణం మౌనంగా వుండిపోయింది సంగీత.

"ముందు వెళ్ళి మీ వారిని పిలిచి, మీరూ ఆయన కలిసి భోంచేయండి. మీ సమస్యకు పరిష్కారం ఏమిటో చెబుతాను" అంది అగమ్య.

ఏమనుకుందో లేచి భర్త దగ్గరికి వెళ్ళి భోజనానికి పిలిచింది సంగీత.

ఆ మాత్రానికే సంతోషపడిపోయాడు ఆదినారాయణ.

"మీరూ రండి" అంది సంగీత.

"నేను తినేవచ్చాను. మీరు తింటూ వుంటే నేను కబుర్లు చెబుతాను" అంది నవ్వుతూ అగమ్య.

వాళ్ళిద్దరూ ఆవురావురుమంటూ తిన్నారు. ఇద్దరూ ఉదయంనుంచి ఏమీ తినకపోవడంవల్ల మంచి ఆకలితో వున్నారు.

అన్నం తిని సింక్ దగ్గరికి వెళ్ళి చేతులు కడుక్కొని వచ్చారు.

"ఈ రాత్రి ప్రశాంతంగా నిద్రపోండి. ఆలోచనలకు, అనుమానాలకు తావివ్వకండి. రేపు మార్నింగ్ నాకు నవ్వుతూ గుడ్‌మార్నింగ్ చెప్పాలి"

సంగీత నవ్వి ఊరుకుంది.

అగమ్య వెళ్తుంటే ఆదినారాయణ "అగమ్యగారూ ఒక్క నిమిషం" అంటూ పిలిచాడు.

ఆగి, ఏమిటన్నట్టు చూసింది.

ఆదినారాయణ రెండుచేతులూ జోడించాడు. అతని కళ్ళలో సన్నటి కన్నీటి మెరుపు.

ఒకే ఒకమాట అన్నాడు "థాంక్యూ" అని.

అయితే సంగీత రియలైజ్ అయ్యే ఓ విషయం మర్నాడే జరిగింది.

ఆ సంఘటన ఆమె ఆలోచనా విధానాన్నే మార్చేసింది.

స్కూల్‌నుంచి తిరిగొస్తుంటే కళ్ళు తిరిగి

నట్టు అనిపించింది సంగీతకు.

రోడ్డు రద్దీగా వుంది. రోడ్డు క్రాస్ చేసే ఓపిక కూడా లేదు. శరీరమంతా నిస్సత్తువగా వుంది. ఆటోను పిలవడానికి చేయెత్తింది. కానీ గొంతు పెగలడంలేదు.

సంగీతకు తెలుస్తూనే వుంది. తనకు... తనకు స్పృహ తప్పబోతోంది.

★ ★ ★

పాణిగ్రాహి జంక్షన్ దగ్గరికి వచ్చాడు. రెడ్ సిగ్నల్ పడింది. స్కూటర్ బ్రేక్ వేసి ఆపాడు. చికాగ్గా వుందతనికి. ఎప్పుడు ఇంటికెళ్దామా అన్నట్టుంది.

ఈ ట్రాఫిక్‌లో స్కూటర్ డ్రైవ్ చేయడం అంటే విసుగు.

గ్రీన్‌సిగ్నల్ పడగానే స్కూటర్ స్టార్ట్ చేశాడు. లెఫ్ట్‌సైడ్ వెళ్తూ వుండగా కనిపించిందా దృశ్యం.

ఓ అమ్మాయి తన స్కూటర్‌కు అడ్డం వచ్చింది. పైగా తూలి రోడ్డుమీద పడబోయింది.

సడన్‌బ్రేక్ వేసి స్కూటర్ ఆపాడు. స్కూటర్ స్టాండ్ వేసి పడిపోబోతున్న ఆ అమ్మాయిని చూసి షాకయ్యాడు.

ఆదినారాయణ భార్య సంగీత అతని చేతుల్లో అలానే వాలిపోయింది.

"ఏవండీ... ఏవండీ, సంగీతగారూ..." కంగారుగా పిలిచాడు పాణిగ్రాహి.

ఎవరో నీళ్ళు తీసుకువచ్చి మొహంమీద చిలకరించారు. మెల్లమెల్లగా కళ్ళు తెరిచింది.

ఎదురుగా పాణిగ్రాహి.

"నేను... నేను!"

"కళ్ళు తిరిగి పడిపోయారు. ఆర్యూ ఆల్‌రైట్ నౌ? " అడిగాడు పాణిగ్రాహి.

"అయామ్ ఓకే" అంది. కానీ ఇంకా తల తిరుగుతున్నట్టు అనిపిస్తూనే వుంది.

పాణిగ్రాహికి ఏం చేయాలో తోచలేదు.

కొద్దిక్షణాల్లోనే ఓ నిర్ణయానికి వచ్చాడు. దగ్గర్లో ఆటోలు కూడా లేవు.

స్కూటర్ స్టార్ట్ చేసి కూచోమన్నాడు. సంగీత మరో మాట మాట్లాడకుండా కూచుంది. పాణిగ్రాహి దేవుడిలా వచ్చి కాపాడాడు అనుకుంది.

★ ★ ★

ఆదినారాయణ అటూ, ఇటూ పచార్లు చేస్తున్నాడు.

అగమ్య అది గమనిస్తూనే వుంది.

"అదేమిటండీ, కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతున్నారు సంగీతగారికోసమేనా? "

"అవును... ఈపాటికి వచ్చేసి వుండాలి"

"బస్సులు దొరికి వుండవు. ఆ మాత్రానికే కంగారుపడితే ఎలా? "

"అదికాదండీ అగమ్యగారూ... నిన్నటి విషయం మనసులో పెట్టుకొని... తలచుకో డానికే భయంగా వుంది"

"అంత ఓవర్‌గా ఆలోచించకండి... వచ్చేస్తుంది" అంది.

సరిగ్గా అప్పుడే పాణిగ్రాహి వచ్చాడు.

పాణిగ్రాహి వెనకే కూచొని వుంది స్కూటర్ మీద సంగీత.

స్కూటర్ ఆపాడు పాణిగ్రాహి.

సంగీత స్కూటర్ దిగింది.

ఆదినారాయణ కంగారుగా భార్య దగ్గరికి వెళ్ళి "ఏమైంది సంగీతా? " అని అడిగాడు.

"కాస్త కళ్ళు తిరిగినట్టు అనిపించింది. తూలిపడిపోతుంటే.." ఆమె తన మాటలింకా పూర్తి చేయకుండానే...

"ఇప్పుడెలా వుంది? " కంగారుగా అడిగాడు.

"బాగానే వుంది" చెప్పింది సంగీత నీరసంగా అక్కడే కూర్చుని.

ఆదినారాయణ పాణిగ్రాహి దగ్గరకి వెళ్ళి... "చాలా థాంక్సండీ. మీకెలా కృతజ్ఞతలు చెప్పాలో తెలియడంలేదు" రెండుచేతులూ పట్టుకుని అన్నాడు.

"ఈ మాత్రానికే థాంక్స్ ఎందుకండీ. ముందు డాక్టర్‌ని పిలిపించండి" అంటూ

లోపలికి నడిచాడు.

ఆదినారాయణ డాక్టర్ దగ్గరకి వెళ్ళాడు.

కాలనీలో ఉన్న లేడీ డాక్టర్ వచ్చి సంగీతను పరీక్షించింది.

"కాస్త నీరసంగా వుంది. మీరు తండ్రి కాబోతున్నారు" చెప్పింది డాక్టర్ ఆదినారాయణతో.

ఆదినారాయణ సంతోషపడిపోయాడు. డాక్టర్‌కు థాంక్స్ చెప్పాడు.

అగమ్య కూడా సంగీతకు కంగ్రాట్స్ చెప్పింది. సంగీత సంతోషంతో పొంగిపోయింది.

తనో ప్రాణికి జన్మనివ్వబోతోందా?

అగమ్య ఆ దంపతులను ఒంటరిగా వదిలివేయాలని తనింటికి వచ్చేసింది.

★ ★ ★

సంగీత భర్తవంక చూసింది.

"ఏంటీ... నీరసంగా వుందా? పాణిగ్రాహి గారు దేవుడిలా రాకపోయుంటే. తలుచుకోవడానికే భయమేస్తోంది. రేపోసారి వాళ్ళను లంచ్‌కు పిలుద్దాం" అన్నాడు ఆదినారాయణ.

భర్తవంక విభ్రమంగా చూసింది.

"ఏంటలా చూస్తున్నావు? " అడిగాడు ఆదినారాయణ.

"నామీద కోపంగాలేదా? " అడిగింది సంగీత.

"కోపమా? దేనికి? "

"నేను అతని స్కూటర్‌మీద వచ్చినందుకు? "

"స్కూటర్‌మీద వస్తే తప్పేమిటి? నా భార్యేలాంటిదో నాకు తెలుసు. ఇలాంటి ఆలోచనలేమీ పెట్టుకోకు. హాయిగా విశ్రాంతి తీసుకో" అన్నాడు.

భర్త ఒడిలో పడుకుని ఏడ్చేసింది.

"ఆరోజు మిమ్మల్ని ఎన్నిమాటలు అన్నాను. నన్ను క్షమించండి" అంది.

"భార్యాభర్తలమధ్య క్షమాపణలు వుండకూడదు. ప్రేమానురాగాలు తప్ప" అన్నాడు ఆదినారాయణ.

భర్త ఒడిలో నిశ్చింతగా పడుకుంది సంగీత.

ఆమెలో పశ్చాత్తాపం మొదలైంది. అది ఆలోచనలోనుంచి వచ్చింది. అనుభవంలోనుంచి వచ్చింది. జీవితంలో ఆమె మరో తప్పుచేయదు.

★ ★ ★

"అగమ్యా... అసలేమైందంటే"

"మీరు చెప్పేది ఏ విషయం గురించి? "

"అదే సంగీతగారూ..."

"ఇప్పుడా విషయం ఎందుకు? పాపం ఆమెను సరైన టైంలో చూసి సేవ్‌చేశారు"

"అగమ్యా..."

"అవునండీ... ఓ మగ, ఓ ఆడ కలిసి వస్తే తప్పా? స్కూటర్‌మీద ఓ ఆడ, ఓ మగ వెళ్తే ఏంటి? "

భార్యవైపు అడ్మైరింగ్‌గా చూశాడు.

★ ★ ★

సంగీతకు నెలలు నిండాయి.

ప్రతినెలా ఆదినారాయణ మెడికల్ చెకప్‌కు తీసుకువెళ్తూనే వున్నాడు.

ఆరోజు ఆదినారాయణ బ్యాంక్‌కు వెళ్ళిన తర్వాత సంగీతకు నొప్పులు మొదలయ్యాయి.

ఇంట్లో పని చేసుకుంటోన్న అగమ్య వెంటనే పరుగెత్తుకువెళ్ళింది.

నిమిషాల్లో ఆటోని కేకేసి ఇంటికి తాళం పెట్టి సంగీతను హాస్పిటల్‌కు తీసుకెళ్ళింది. దారిపొడవునా సంగీత నొప్పులు పడుతూనే వుంది.

సంగీతను హాస్పిటల్‌లో అడ్మిట్ చేసి ఆదినారాయణకు ఫోన్‌చేసింది.

ఆదినారాయణ పరుగుపరుగున వచ్చేశాడు. అగమ్య ఆదినారాయణకు తోడుగా వుంది.

సంగీత తల్లిదండ్రులు ఈమధ్యనే చనిపోయారు. ఆడదిక్కులేదు. ఆదినారాయణకు ఎటూ పాలుపోవడంలేదు.





# విలువైన ముత్యాలు

* అదృష్టాన్ని స్వీకరించి సద్వినియోగం చేసుకోవడానికి తెలివి, దానిని కాపాడుకోవడానికి అంతకుమించిన విజ్ఞత ఉండాలి.

– రోత్స్‌చైల్డ్

* విజయానికి ప్రత్యేకమైన దారి అంటూ ఏదీ లేదు. లక్ష్యశుద్ధి, ఏకాగ్రత, కృషి, స్పష్టమైన గమ్యం ఉంటే విజయం దానంతటదే వెతుక్కుంటూ వస్తుంది.

– టి.టి. ముగర్

* రూపాయి సంపాదించడానికి ఎంత కష్టపడతావో, దానిని ఖర్చు పెట్టేటప్పుడు కూడా అంతగా ఆలోచిస్తే నీకన్నా ధనవంతుడూ, తృప్తిమంతుడూ ఎవ్వరూ ఉండరు.

– ఫ్రాంక్లిన్

* సంగీతం ఒక్కటే మానవాళి అందరికీ భాషా భేదం లేకుండా చక్కగా అర్థమయ్యే సార్వత్రిక భాష.

– హెచ్.డబ్ల్యు. లాంగ్‌ఫెలో

* గాయకుడు, కవి, చిత్రకారుడు, శిల్పి, నటుడు ఈ ఐదుగురూ జీవితమంతా పాఠాలు నేర్చుకుంటూనే ఉండాలి.

– మహాత్మాగాంధీ

* ఉత్తమ వ్యక్తిత్వాన్ని రూపొందించడమే విద్య యొక్క లక్ష్యం, పరమార్థం కావాలి.

– స్పెన్సర్

* అనుభవించడం కంటే ఆ అనుభవం కోసం ఎదురుచూడడంలోనే మనిషి జీవితంలో ఎక్కువ కాలం గడిచిపోతుంది.

– వోల్టేర్

* నీవు ఏమి మాట్లాడదలుచుకున్నావో ఆలోచించుకో ఆలోచించినదల్లా మాట్లాడకు. ఆలోచనలు మాత్రమే నీవి. అవి బయటకు వెడితే ప్రశంసలతో బాటు విమర్శల్ని కూడా మోసుకు వస్తాయి.

– డిలాని

* నీవు గెలిచితీరాలంటే ఆ గెలుపు నీ ఆత్మవిశ్వాసం మీదనే ఆధారపడి ఉంటుంది.

– విలియం హడ్‌విట్

సేకరణ : జయప్రకాష్ నారాయణ్

ఈ సమయంలో అగమ్య మోరల్ సపోర్ట్ వేయి ఏనుగుల బలాన్నిచ్చినట్ట యింది.

సాయంత్రం నాలుగు అవుతుండగా ఇంటికి వెళ్ళి పిల్లలకు వండి, వార్చి అంద రికీ తినిపించి, పాణిగ్రాహికి పిల్లలను అప్ప గించింది.

★ ★ ★

రాత్రి ఏడుగంటలకు సంగీత ఆడపిల్లను ప్రసవించింది.

తల్లీబిడ్డా క్షేమంగా వున్నారు.

ఆదినారాయణకు తృప్తిగా వుంది. లోప లికి వెళ్ళి తల్లీ, బిడ్డలను చూశాడు.

మూడోరోజు సంగీతను డిశ్చార్జి చేశారు. ఈ మూడ్రోజులూ అగమ్యే సంగీతను కని పెట్టుకుని వుంది. అన్నిపనులూ దగ్గరుండి చేసింది ఆదినారాయణకు టిఫిన్ కట్టడం దగ్గర్నుంచి.

సంగీతకు దిష్టితీసి, ఇంట్లోకి తీసుకువె ళ్ళింది.

పసిబిడ్డకు స్నానం చేయించడం రాదని, తనే స్నానం చేయించింది.

"అగమ్యగారూ..." సంగీత పిలిచింది.

సంగీతకోసం వెల్లుల్లితో చేసిన కారప్పొడి తీసుకువచ్చింది అగమ్య.

"ఏంటీ? " అడిగింది అగమ్య.

"నిన్ను... మిమ్మల్ని అక్కయ్యా అని పిల వొచ్చా? " అలా అడుగుతున్నప్పుడు సంగీత గొంతు వణికింది.

"అదేంటి... ప్రేమతో నోరారా అక్కా అని పిలవడానికి నా పర్మిషన్ కావాలా? "

"అక్కా!" అంటూ అగమ్యను చుట్టేసి ఏడ్చేసింది సంగీత.

"నాకో స్వంత అక్కయ్య ఉన్నా కూడా ఇంత ప్రేమగా చూసుకునేదికాదేమో. మీరె వరో, నేనెవరో. కొద్దిరోజుల పరిచయం మాత్రమే. కానీ... మాకోసం నీ పనులన్నీ వదులుకున్నావు. తనని నీ స్వంత అన్న య్యలా చూసుకున్నావు. ఏమిచ్చి నీ రుణం తీర్చుకోవాలో అర్థంకావడంలేదు" మనస్ఫూ ర్తిగా అంది సంగీత.

"అక్కయ్యా... అని పిలిచావుగా. ఆ పిలుపు చాలదూ. అయినా మనలోమనకు రుణాలు ఏమిటి? " అంది అగమ్య.

కొన్ని అనుబంధాలు, అభిమానాలు డబ్బుతో కొనలేం.

★ ★ ★

దీపావళి పండుగ దగ్గరికి వచ్చేసింది. పిల్లలకు బట్టలు తీసుకోవాలి. ఇంటికి సున్నం వేయించాలి.

అగమ్యకు ఏం చేయాలో తోచడంలేదు. మొత్తం బడ్జెట్ వేసింది.

ఆ నెల జీతం బడ్జెట్‌లో సగమంత కూడా లేదు. ఏదో ఒకటి చేయాలి ఏం చేయాలి.

పండక్కి బట్టలు తీసుకోకపోతే పిల్లలు బాధపడతారు.

ఆమె చెవులకు వున్న దిద్దులకు కాళ్ళొ చ్చాయి. ఆ దిద్దుల స్థానంలో ఆమె చెవులు బోసిపోయి కనిపించాయి.

★ ★ ★

భర్త బ్యాంకుకు వెళ్ళగానే తనూ తయా రైంది బయటకు వెళ్ళడానికి అగమ్య.

సుందర్... అఖిల ఎదురొచ్చారు.

"వదినా... దీపావళి వచ్చేస్తోంది కదా" అన్నాడు సుందర్.

"అవును సుందర్" అంది అతన్ని దగ్గ రకు తీసుకొని.

"నాకు దీపావళి పండుగ అంటే బోల్డు ఇష్టం. టపాకాయలు కాల్చొచ్చు మతా బులు వెలిగించొచ్చు కొత్తబట్టలు, పాయసం..." చెప్పుకుపోతోంది అఖిల.

"అవన్నీ నేను తీసుకువస్తానుగా" అంది.

"ఎదురింటి బబ్లు ఏమన్నాడో తెలుసా వదినా? " వదిన మొహంలోకి చూస్తూ అడి గాడు.

"ఏమన్నాడు" కుతూహలంగా అడిగింది




అగమ్య.

"మా మమ్మీడాడీ నాకు కొత్తబట్టలు తీసుకువస్తారు. బోల్డు టపాకాయలు తీసుకువస్తారు" అని చెప్పాడు.

"అలాగా" అంది అగమ్య.

"మా వదినమ్మ మాకూ తీసుకువస్తుందని చెబితే మీ వదినమ్మ వాళ్ళ పిల్లలకు తీసుకువస్తుంది. మీకు ఎందుకు తీసుకువస్తుంది. మాకులా మీకు అమ్మానాన్నా లేరు కదా. అన్నాడొదినా" సుందర్ మొహమంతా దీనంగా పెట్టి అన్నాడు.

వాళ్ళిద్దర్నీ దగ్గరకు తీసుకొని చెప్పింది అగమ్య.

"మీకు అవన్నీ ఈ వదినమ్మ తీసుకువస్తుంది. ఇప్పుడు నేను బయటకు ఎందుకు వెళ్తున్నానో తెలుసా? మీకు కొత్తబట్టలు, టపాకాయలు తీసుకురావడానికే" చెప్పింది.

"హాయ్... నిజమా... థాంక్యూ వదినా ఈ విషయం ఆ బబ్లూగాడికి చెప్పి వస్తానొదినా" అని అఖిలవైపు చూసి "నువ్వూ రా' అన్నాడు.

వాళ్లిద్దరూ ఉత్సాహంగా పరుగెత్తారు.

ఒక్క క్షణం అగమ్య మనసు భారమైంది. ఆ పిల్లల బాధ చూస్తుంటే ఆమె మనసు ద్రవించిపోతోంది. అత్తమామలు బతికివుంటే ఎంత బావుండేదో.

తనకు తల్లిని, తండ్రినీ దూరం చేసిన ఆ దేవుడు, తల్లిదండ్రుల్లాంటి అత్తమామలను కూడా దూరం చేశాడు.

బాధగా నిట్టూరుస్తూ బయటకు నడిచింది.

★ ★ ★

"రా అగమ్యా బహెన్, ఏమిటీ విశేషం?" అడిగాడు మార్వాడీ సేఠ్ అగమ్యను.

అగమ్య అంటే ఆ మార్వాడీ సేఠ్‌కు అభిమానం, గౌరవమూ... తన కుటుంబం కోసం, తన మరిదికోసం, ఆడపడుచుకోసం, అత్తమామలకోసం ఆమె పడే తాపత్రయం అతనికి తెలుసు.

అగమ్య చేతిలోని పొట్లం అతనికి ఇచ్చింది. ఆ పొట్లంలో వున్న దిద్దులవంక చూశాడు.

"ఇదేంటి బహెన్‌జీ... చివరికి ఈ దిద్దులు కూడా...!"

"పండుగ వస్తోంది. పిల్లలకు బట్టలు, అవీ తీసుకురావాలి" సంజాయిషీ ఇస్తున్నట్టు చెప్పింది అగమ్య.

"అందుకని ఇలా... ఇదేంటి బహన్‌జీ ఓ భయ్యాగా చెబుతున్నాను. ఇలా చెబుతున్నానని ఏమీ అనుకోవద్దు"

"నన్ను బహెన్‌జీ అన్నప్పుడే మీ సోదర ప్రేమ అర్థమైంది. మీరు నాకన్నా పెద్దవారు, మొదట్నుంచీ నా గురించి తెలిసినవారు ఎన్నో ఆపద సమయాల్లో నన్ను ఆదుకున్నారు చెప్పండి" అంది అగమ్య.

"ఇలా పిల్లలకోసం, మరుదులకోసం ఎప్పుడూ నువ్వు కష్టపడుతూనే వున్నావు. నీ ఒంటిమీద బంగారం అనేది కనిపించకుండా చేసుకుంటున్నావు. రేపు నీ పిల్లలు పెరిగి పెద్దయితే" అన్నాడు.

"ఆడపడుచు, మరిది కూడా నా పిల్లలే కదా. పండుగపూట వాళ్ళు బాధపడ్డం చూడలేను. మా అమ్మానాన్న బతికివుంటే మేం ఇలా వుండేవాళ్ళంకాదు అని వాళ్ళు బాధపడకూడదు" అంది అగమ్య.

"నిజం చెప్పాలంటే వాళ్ళ అమ్మానాన్నా బతికివున్నా ఇంత ప్రేమగా చూసుకునే వాళ్ళు కాదు" చెప్పాడు సేఠ్.

"అవుననుకోండి... కానీ నేను బతికివుండగా వాళ్ళకే కష్టమూ కలగకూడదు"

"నీ ఇష్టం... ఓ పని చేస్తావా బహెన్?"

"చెప్పండి"

"నీకు ఎంత కావాలో డబ్బు తీసుకో. నీ దగ్గర వున్నప్పుడు కట్టేసెయ్" చెప్పాడు.

"వద్దు... తిరిగి ఈ డబ్బు మీకు జమచేయలేను. ఈ దిద్దులు అమ్మేయాలనే నిర్ణయించుకున్నాను. వీటికి వడ్డీ కట్టడం, తర్వాత విడిపించుకోవడం కూడా కుదర్దు.

దయచేసి వాటికి ఎంత వస్తుందో చూసి ఆ డబ్బు ఇప్పించండి చాలు" చెప్పింది అగమ్య.

ఆ సేఠ్ ఒక్కక్షణం బరువుగా నిట్టూర్చి ఆ దిద్దులు తూకంవేసి, దానికి ఖరీదు కట్టి డబ్బు అగమ్యకు ఇచ్చాడు.

"వస్తానండీ" చేతులు జోడించి అంది.

"మంచిది బహెన్‌జీ. ఎప్పుడైనా ఓ విషయం గుర్తుంచుకోండి. మీకెప్పుడు ఏ అవసరం వచ్చినా ఈ రతన్‌లాల్ భయ్యా వున్నాడన్న విషయం మరిచిపోవద్దు" అన్నాడు సేఠ్.

"ఈ మాట చాలు" అంది వినమ్రంగా నమస్కరిస్తూ.

ఆ దేవుడు ఈ అమ్మాయిని చల్లగా చూడాలి. వెళ్తున్న అగమ్యవంక చూస్తూ అనుకున్నాడు ఆ మార్వాడీ సేఠ్ రతన్‌లాల్

"ఇంట్లో వున్న కొడుక్కి, కోడలికి సాయం చేయడం చేతకాదుకానీ, దేశాన్ని మాత్రం ఉద్ధరిస్తాడు మీ నాన్న" గొణుగుతోంది రతన్‌లాల్ కోడలు.

"అబ్బా... ఊరికే నామీద విరుచుకుపడతావేంటి?" ఆమె మొగుడు చందూలాల్ విసుక్కున్నాడు.

"విరుచుకుపడ్డం ఏంటీ... ఆ ముసలాయనకు వయసు మీదపడుతున్నా వ్యాపారంమీద మోజు చావలేదు. ఉన్నది మీరు ఒక్కరే. వ్యాపారం మీకు అప్పగించవచ్చుగా" అంది చందూలాల్ భార్య.

"ఇప్పుడు నేను షాపులో పనిచేస్తూనే వున్నానుకదా" చందూలాల్ అన్నాడు.

"ఆ చేస్తున్నారు. మీకు, ఆ గుమస్తాకు తేడా ఏమిటి? ఆ మాట అనడానికి సిగ్గు లేదూ? వంద రూపాయలు కావాలన్నా మీ నాన్న దగ్గరకి వెళ్ళి అడగాలి" అంది కోపంగా.

లోపల గదిలో వున్న రతన్‌లాల్ భార్య ఈ మాటలు వింటూనే వుంది.

కోడలు తరచూ కొడుకుతో గొడవ పెట్టుకోవడం అందులో తన భర్త ప్రస్తావన తీసుకురావడం, ఆస్తి మొత్తం తమపేరు మీద రాయమనడం... ఇవ్వన్నీ తెలుస్తూనే వున్నాయి.

"అయితే ఇప్పుడేం చేయమంటావు?" భార్య చెప్పిన మాటలు విని అడిగాడు రతన్‌లాల్.

ఆరోజు ఉదయం కొడుక్కి, కోడలికి మధ్య జరిగిన సంభాషణ భర్తకు చెప్పింది. అంతా విన్నాక అడిగాడు రతన్‌లాల్.

"అయితే ఇప్పుడేం చేయమంటావు?" అన్నాడు రతన్‌లాల్.

"నేను చెప్పడానికి ఏముంది? మీకు తెలియదా? ఎందుకొచ్చిన గొడవ. ఆస్తి మొత్తం కొడుకుపేరుమీద రాయండి. కొట్టుని కొడుక్కి అప్పగించండి" అంది అతని భార్య.

నవ్వాడు రతన్‌లాల్.

"ఎందుకలా నవ్వుతారు? ఇప్పుడు నేను కానిమాట ఏమన్నానని?" అడిగింది ఉక్రోషంగా ఆవిడ.

"పిచ్చిదానా? మనం ఇప్పుడు షాపుని కొడుక్కి అప్పగిస్తే వారంరోజుల్లోగా మూసుకోవాల్సిందే. వాడికింకా వ్యాపారంలో మెలకువలు తెలియవు. ఎవరితో ఎలా మాట్లాడాలో ఎవరి మనసులో ఏముందో తెలియనే తెలియదు.

వాడింకా నేర్చుకోవాల్సింది చాలా వుంది. ఇప్పుడే వ్యాపారం వాడికి అప్పగిస్తే దివాళా తీయడం ఖాయం" అన్నాడు రతన్‌లాల్.

"వాడికేం తెలియదని ఎలా అనుకుంటున్నారు? వాడికి వ్యాపారం అప్పగించి చూస్తేనేకదా తెలిసేది" అంది అతని భార్య.

"వ్యాపారం అప్పగించి చూశాక ఏమీ తెలియదు. తెలిస్తే గిలిస్తే నష్టం వచ్చిందని తెలుస్తుంది. అయినా వాడికి అవ్వన్నీ తెలిస్తే ఇలా ఎందుకు వుంటుంది. భార్య మాటలు నమ్మి మనల్ని వ్యాపారం అప్పగిం





చమని ఎందుకు చెబుతాడు? "

"మీరు ఎన్నయినా చెప్పండి. మనకు వున్నది ఒకే ఒక బిడ్డ. వాడినెందుకు బాధ పెడతారు. కోడలుపిల్ల కూడా రోజూ వాడిని సతాయిస్తోంది"

"మనం వ్యాపారం మొత్తం అప్పగించాక మనల్ని సతాయించడంకాదు. బయటకు తరిమేస్తారు" జీవితసత్యాన్ని విశదీకరించి చెప్పాడు రతన్‌లాల్.

"మీకన్నీ అనుమానాలే. మనం వున్నదే ఇద్దరం. మనం బిజినెస్ వాళ్ళకు అప్పగిస్తే మనల్ని హాయిగా చూసుకుంటారు"

"నీకు అంతగా నమ్మకంవుంటే నేను ఏమనగలను... నాతో ఇన్నేళ్ళు కాపురం చేశావు? "

"ఇన్నేళ్ళూ నేను మిమ్మల్ని ఏమీ అడగ లేదు. ఇప్పుడు అడుగుతున్నాను. ఈ ఆస్తి వాళ్ళ పేరుమీద రాయండి. ఈ వ్యాపారం వాళ్ళకు అప్పగించండి"

భార్య మొహంలోకి చూసి అన్నాడు,

"నీ ఇష్టం. కానీ ఒక్క విషయం గుర్తుంచుకో. డబ్బు పాపిష్టిది. డబ్బు ఎంత పని అయినా చేస్తుంది" చెప్పాడు.

"అలా అంటారేమిటి? ఆ అగమ్యని చూడండి. అత్తామామలను ఎంత ప్రేమగా చూసుకుంది? "

"అందరూ అగమ్యలా వుంటే ఈ ప్రపంచం రూపురేఖలే మారిపోయేవి. సరే... నీ ఇష్టం. రేపే వాడికి బిజినెస్ అప్పగిస్తాను. ఈ ఇల్లు కూడా వాడిపేరు మీద రాసేస్తాను"

"నిజమాండీ" సంతోషంగా అడిగింది అతని భార్య.

"నిజం... నీమీదొట్టు" భార్య తలమీద చేయివేసి చెప్పాడు రతన్‌లాల్

దాని తర్వాతి పరిణామం తెలియదు రతన్‌లాల్ భార్యకు.

★ ★ ★

కొత్త బట్టలు, టపాకాయలతో ఇంటికొచ్చిన అగమ్యను చూసి సుందర్, అఖిల, కార్తీక్, కావ్య తెగ సంతోషపడిపోయారు. వెంటనే ఈ విషయం చుట్టుపక్కల పిల్లలకు పరుగెత్తుకువెళ్ళి చెప్పారు.

పిల్లల ఆనందాన్ని చూసి తన బాధను, శ్రమను మరిచిపోయింది అగమ్య.



పిల్లలు కొత్తబట్టలు వేసుకున్నారు. దీపావళి పండుగరోజు వాతావరణం ఆ ఇంట్లో స్పష్టంగా కనిపిస్తోంది.

అగమ్య వేకువనే లేచింది. తలంటు పోసుకుంది. పిల్లల్ని లేపి తలంటింది. వాళ్ళకు దగ్గరుండి స్నానం చేయించింది. పాయసం చేసింది. కొత్తబట్టలు వేసి టపాకాయలు దగ్గరుండి కాల్పించింది.

ఇదంతా పాణిగ్రాహి చూస్తూనే వున్నాడు. పిల్లల ఆనందం చూస్తుంటే అతనికి సంతోషంగానే వుంది.

అయితే ఈ కొత్తబట్టలు, టపాకాయలు ఎక్కడివో, దానికి డబ్బు ఎక్కడ్నుంచి వచ్చిందో అర్థంకాలేదు. ఆ విషయం అగమ్యను అడగాలన్నా భయంగానే వుంది.

ఏం వినాల్సి వస్తుందోనన్న భయం అది. ఆ రోజంతా ఆనందంగా గడిచింది.

రాత్రి బాగా పొద్దుపోయేవరకూ టపాకాయలు కాల్చి, ఏ అర్ధరాత్రివేళో అలసిపోయి పడుకున్నారు.

వరుసగా నలుగురు పిల్లలూ పడుకున్నారు. అందరికీ దుప్పటి కప్పింది.

భర్తకు గోరువెచ్చని పాలు ఇచ్చింది.

బాగా అలసిపోయింది. అలానే నిద్రపోయింది. భార్యవంక మురిపెంగా చూస్తుండిపోయాడు పాణిగ్రాహి. అప్పుడు పడింది అతని దృష్టి.

అగమ్య చెవులు బోసిపోయి వున్నాయి. పండుగ బట్టలు, టపాకాయలు ఎలా వచ్చాయో అప్పుడర్థమైంది అతనికి. అతని మనసు మరోసారి బరువెక్కింది.

★ ★ ★

చందూలాల్ భార్యకు సంతోషంగా ఉంది. ఆరోజు ఉదయమే రతన్‌లాల్ కోడలిని, కొడుకుని పిలిచాడు.

“చందూ, బేటా... ఈ వ్యాపారం ఈ రోజునుంచి నువ్వే చూసుకో. ఈ ఇల్లు కూడా మీ భార్యాభర్తల పేరుమీద రిజిష్టర్ చేయిస్తున్నాను. సంతోషమేనా?” అని అడిగాడు.

“ఇవ్వన్నీ ఎందుకు నాన్నా?” కాస్త ఇబ్బంది పడిపోతూ అన్నాడు చందూలాల్.

“మామగారు అంత ప్రేమతో ఇస్తుంటే వద్దంటారేమిటండి. పెద్దవారు. మామగారికి అన్నీ తెలుసు. ఆయన చెప్పినట్టు వినడం మన ధర్మం” అంది చందూలాల్ భార్య.

నవ్వుకున్నాడు రతన్‌లాల్.

వెంటనే లాయర్‌ని పిలిపించి రాతకోతలు పూర్తిచేశాడు.

చందూలాల్ నగల కొట్టులో కూర్చున్నాడు.

మామగారిని, అత్తగారిని ప్రేమగా చూసుకోవడం మొదలుపెట్టింది చందూలాల్ భార్య.

“చూశారా కోడలు ఎంత మంచిదో” మురిసిపోతూ అంది రతన్‌లాల్ భార్య.

ఇంకా ఈ ఆస్తి వ్యవహారాలు కొడుకు, కోడలి పేరుమీద బదిలీ అవ్వలేదు. ఇదంతా డబ్బు మహత్యం అని భార్యకు చెప్పాలని వుంది.

అయినా ఆమె ఆనందాన్ని పాడుచేయడం ఇష్టంలేక, మిన్నకుండిపోయాడు రతన్‌లాల్.

ఓ భ్రమ ఆనందాన్ని కలుగచేసినప్పుడు ఓ అబద్ధం, అవతలి వ్యక్తికి నిజం అని భ్రమించేలా చేసి సంతోషపెట్టినప్పుడు ఆ ఆనందాన్ని ఆ సంతోషాన్ని తనెందుకు కాలరాయాలి. కాలమే ఆ వాస్తవాన్ని వివరించి, ఆ చేదు నిజాన్ని తెలియపరుస్తుంది.

★ ★ ★

మెల్లమెల్లగా కోడలి ప్రవర్తన, కొడుకు నిర్లిప్తత అర్థమవ్వసాగింది. రతన్‌లాల్ మాత్రం కామ్‌గా వుండిపోయాడు.

అంతక్రితం రోజూ పొద్దున్నే టిఫిన్, రోజుకు నాలుగుసార్లు ఫిల్టర్‌కాఫీ ఇచ్చే కోడలు టిఫిన్ ఇవ్వకపోవడం, కాఫీ అడిగితే విసుక్కోవడం బాధని కలిగించింది అత్తగారికి.

“చూశారా... కోడలు ఎంత పనిచేసిందో” భర్తతో అంది.

రతన్‌లాల్ నవ్వి ఊరుకున్నాడు.

“నేనింతగా బాధపడుతుంటే మీరు నిమ్మకు నీరెత్తినట్లు వుంటారా?” నొచ్చుకుంటూ అంది భార్య.

“నేను చెబితే నువ్వు విన్నావా? డబ్బు ఎంత పని అయినా చేయిస్తుంది. అత్తయ్యను అమ్మలా, మామగారిని నాన్నగారిలా చూసుకునే కోడలు మనకు దొరక్కపోవడం మన దురదృష్టం. నేను చెప్పానుగా అందరూ అగమ్యలా వుండరు” అన్నాడు

రతన్‌లాల్.

★ ★ ★

రతన్‌లాల్ పరిస్థితి నానాటికీ దుర్భర మైంది. అత్తమామలను పూర్తిగా పట్టించు కోవడం మానేసింది కోడలు.

ఆ విషయం రతన్‌లాల్ భార్యని తీవ్రంగా బాధించింది.

ఈ చేదునిజం ఆమెకు జీర్ణమవ్వడం కష్టంగా వుంది. సూటిపోటి మాటలు అనడం, అత్త అని కూడా చూడకుండా ఆ పనీ, ఈ పనీ చెప్పడం... ఇదంతా ఆమెను కలతపడేలా చేస్తోంది.

ఓరోజు ఈ బాధ భరించలేక కోడలితో వాదనకు దిగింది.

"అయితే ఏమిటి? " కోపంగా అరిచింది కోడలు.

"ఈ ఆస్తి మాది. కనీసం అత్త అన్న అభిమానం కూడా లేదు. మామగారన్న గౌరవంలేదు. ఈ ఆస్తి మా పేరుమీద ఉన్నప్పుడు వినయంగా వున్నట్టు నటించి, ఇప్పుడిలా నిర్లక్ష్యం చేస్తావా? "

అత్తగారి మాటలకు సమాధానం చెప్ప లేదు.

గొడవలు ముదిరిపోయాయి.

చందూలాల్ కూడా భార్యనే సమర్థిం చాడు.

రతన్‌లాల్ భార్య రోజురోజుకూ కృంగి పోసాగింది.

చివరికి తల్లిదండ్రులను ఇంట్లోనుంచి వెళ్ళిపొమ్మని చెప్పేవరకూ వచ్చింది.

రతన్‌లాల్ భార్యను తీసుకొని అగమ్య ఇంటికి వచ్చాడు కట్టుబట్టలతో.

★ ★ ★

"బహెన్‌జీ ఇదీ జరిగింది. ముసలిత నంతో మాకు ఆశ్రయం ఇస్తావేమోనని వచ్చాం" అన్నాడు రతన్‌లాల్.

"అంతకన్నానా? అమ్మానాన్నా, అత్తా మామాలాంటి పెద్దవాళ్ళు ఈ ఇంట్లో ఎవ రూలేరు. అందరూ నన్ను ఒంటరిదాన్ని చేసి వెళ్ళిపోయారు. నన్ను ఇన్నాళ్ళూ బహె న్‌జీ అన్నారు. ఇప్పుడు బేటీ అనండి" అంది అగమ్య.

ఆశ్చర్యంగా ఆమెవంక చూస్తుండిపో యాడు రతన్‌లాల్.

"నీకే ఇంత ఇబ్బందిగా వుంది. అయినా మాకు ఆశ్రయం ఇస్తానంటున్నావు. బాధ గాలేదా? మేం బరువుగా అనిపించడం లేదా? " అడిగాడు రతన్‌లాల్.

"తల్లిదండ్రులను పిల్లలు బరువు అను కుంటే ఎలా? " అంది అగమ్య.

రతన్‌లాల్ భార్య కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"మరి... మీ ఆయన? "

అప్పుడే అక్కడికి వచ్చి వాళ్ళ సంభాషణ అంతా విన్న పాణిగ్రాహి అన్నాడు.

"అగమ్య ఎప్పుడూ రైటే. తనేం చేసినా అర్థం, ఓ పరమార్థం వుంటుంది" అన్నాడు పాణిగ్రాహి.

ఆ విధంగా రతన్‌లాల్, అతని భార్యా ఆ ఇంటికి ఆత్మీయ అతిథులు అయ్యారు.

★ ★ ★

అగమ్య రతన్‌లాల్‌ను, అతని భార్యను స్వంత తల్లిదండ్రుల్లా చూసుకోసాగింది.

రోజూ ఉదయమే వాళ్ళకు కాఫీ ఇవ్వడం, టిఫిన్, భోజనం విషయంలో కూడా చాలా కేర్ తీసుకుంది. తీరిక సమయంలో రతన్ లాల్ భార్యను ఓదార్చేది. రామాయణం, భారతం చదివి వినిపించేది.

★ ★ ★

"ఏమండీ... మనం ఆస్తి మొత్తం కొడుకు, కోడలి పేరుమీద రాసి పొరపాటు చేశాం" అంది రతన్‌లాల్ భార్య.

"అదేంటి? " అడిగాడు రతన్‌లాల్.

"కూతురి పేరుమీద కూడా ఆస్తి రాయడం మరిచిపోయాం" అంది.

"కూతురా? "

"అవును. అగమ్య మనకు కూతురు



కాదా? ఇంత మంచి కూతుర్ని మనం మిస్ అయ్యాం" అంది.

"నిజమే... పోనీ ఇప్పుడైనా ఆస్తిని కొంత కూతురి పేరుమీద రాద్దామా? " అడిగాడు రతన్‌లాల్.

"ఇప్పుడా? " బాధగా అంది అతని భార్య.

"ఇప్పుడు మనపేరుమీద ఏముంది? కట్టుబట్టలతో ఏదో కొద్దిపాటి పరిచయం వున్న ఈ అమ్మాయి దగ్గర ఆశ్రయం పొందుతున్నాం"

"అమ్మా... అగమ్యా... మీ అమ్మ ఏమంటుందో విన్నావా? " అక్కడే ఉన్న అగమ్యతో అన్నాడు రతన్‌లాల్.

"అంతా అమ్మ ప్రేమ. మీరు మాత్రం ఏ దిగులూ పెట్టుకోకండి" అంది అగమ్య.

"అదికాదు బేటా. నీకు మేం ఏం చేశామని మమ్మల్ని ఇంత ప్రేమగా చూసుకుంటున్నావు. చుట్టరికమా? బంధుత్వమా? స్నేహమా? కులమా? "

"అవన్నీ మానవత్వానికి అక్కర్లేదు. ఓ మనిషి మరో మనిషిని ప్రేమగా చూసుకోవడానికి కాసింత మంచితనం వుంటే



చాలు. రేపు మనం వెళ్ళేప్పుడు ఇవ్వన్నీ మూట కట్టుకుపోతామా? " అంది.

"చాలా చక్కగా చెప్పావు బేటా" అని భార్యవైపు చూసి, "ఇప్పటికైనా అర్థమైందా? ఈ తల్లి గొప్పతనం. మనం ఈరోజే మనింటికి వెళ్దాం. అమ్మా అగమ్యా... నువ్వు కూడా మనింటికిరా. అందరం ఒకే ఇంట్లో వుందాం" అన్నాడు రతన్‌లాల్.

"మన ఇల్లు ఎక్కడుందండీ? " అడిగింది అయోమయంగా రతన్‌లాల్ భార్య.

"నాకు మన కొడుకు ప్రేమ, కోడలి నటన తెలుసు. అందుకే మన పేరు మీద స్నేహ కాలనీలో మరో ఇల్లు ఎప్పుడో కొని పెట్టాను. బ్యాంకులో కొంత డబ్బు విడిగా వుంది.

ప్రశాంతంగా స్నేహ కాలనీలో వున్న ఆ ఇంట్లో వుందాం. బ్యాంకు నుంచి వచ్చే వడ్డీ మనకు సరిపోతుంది. మానవత్వపు విలువలు ఇంకా బతికే వున్నాయని, ఆ విలువల గొప్పతనం అనుభవించాలని ఈ బేటా దగ్గర కొన్నాళ్లు వున్నాను" చెప్పాడు.

అగమ్య ఏమీ మాట్లాడలేదు.

"నీ మనసుకు కష్టం కలిగిస్తే మాఫ్‌కరో బేటీ" అన్నాడు అపాలజికల్‌గా.

"ఛ... ఛ... అదేమీలేదు" అంది అగమ్య.

"నిజంగా మనసులో అలాంటిదేమీ లేదని అనుకుంటే మాతోపాటు నువ్వూ వచ్చెయ్ నా కొడుగ్గా, కూతురుగా" అన్నాడు ప్రేమగా రతన్‌లాల్.

"మీ అభిమానానికి కృతజ్ఞతలు... మీరు నాకు అమ్మ ప్రేమను, కన్న ప్రేమను చూపించారు. మీ కూతురిగా అప్పుడప్పుడు మీ ఇంటికి వస్తూపోతూ వుంటాను. అంత కుమించి నన్ను బలవంతపెట్టకండి" అంది అగమ్య.

"అదేమిటి బేటా అలాగంటావు? "

"నేను ఏ ప్రతిఫలమూ ఆశించలేదు ఒక్క మీ ప్రేమ తప్ప. అది నాకు ఇచ్చారు చాలు" అంది అగమ్య.

"పోనీ నా తృప్తికోసం ఇది" అంటూ జేబులో నుంచి ఓ చెక్కు తీసి ఇచ్చాడు రతన్‌లాల్.

అగమ్య పేరుతో లక్ష రూపాయల చెక్కు అది.

అది ఓసారి చూసి తిరిగి వాళ్లకే ఇచ్చింది.

"ఈ చెక్కులతో నన్ను మీ నుంచి దూరం చేయకండి" అంది అగమ్య.

రతన్‌లాల్ కళ్లు అశ్రుపూరితాలయ్యాయి.

"ఈ ప్రపంచంలో మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలే అనుకున్నాను. నీ ప్రేమలో మానవ సంబంధాలు గొప్ప మనసు సంబంధాలు అవుతాయని నిరూపించావు. పోనీ ఈ చిన్న కానుక తల్లిదండ్రుల పేర అనుకో" అంటూ ఓ చిన్న పొట్లం అందించాడు.

అగమ్య ఆ పొట్లం విప్పింది. అవి తన చెవిదిద్దులు. ఆ రోజు తను రతన్‌లాల్ దగ్గర తాకట్టు పెట్టినవి.

రతన్‌లాల్‌వైపు తిరిగి ఆ దిద్దులు కళ్లకు అద్దుకుంది. అతని ముందే చెవులకు దిద్దులు పెట్టుకొని రతన్‌లాల్ దంపతుల పాదాలకు నమస్కరించింది.

"బేటా నీకెప్పుడు ఏ అవసరం వచ్చినా ఈ తల్లిదండ్రులు వున్నారన్న విషయం మరిచిపోకమ్మా" అన్నారు ప్రేమగా అక్కున చేర్చుకొని.

★ ★ ★

ఇంట్లో మళ్లీ స్తబ్దత. రతన్‌లాల్ దంపతులు వెళ్లిపోయాక అదోమాదిరి వెలితి అనిపించింది.

వాళ్లు వున్నది కొద్దిరోజులే అయినా వాళ్లకూ తనకూ మధ్య ఏ రక్తసంబంధం లేకపోయినా అదో అనుబంధం.

అగమ్య అప్పుడప్పుడు వాళ్ల దగ్గరికి వెళ్తొస్తుంది. పిల్లలు రతన్‌లాల్‌ని తాతయ్యా అని అతని భార్యను మామ్మా అని పిలుస్తు





న్నారు.

అయితే అగమ్య మాత్రం వాళ్ల నుంచి ఎప్పుడూ ఎటువంటి పరిస్థితిలోనూ సాయం స్వీకరించకూడదని నిర్ణయించుకుంది.

ఆమె ప్రేమ అభిమానాల మధ్య సహాయమనే పదం తొంగి చూడకూడదు.

అది అగమ్య ఆత్మాభిమానమే.

★ ★ ★

అగమ్యకు రోజులు భారంగా గడుస్తున్నాయి.

ఎన్ని సమస్యలూ, మరెన్ని ఆటంకాలు అయినా అగమ్య బెదరలేదు. ఆమె వెనకడుగు వేయనూ లేదు.

వర్తమానం గతంగా మారడం ఎంత సహజమో భవిష్యత్తు వర్తమానం అవ్వడం అంతే సహజం.

కన్నుమూస్తే మరణం కన్ను తెరిస్తే జననం. రెప్పపాటే జీవితమన్నది వేదాంతం కాదు, జీవిత సత్యం. కాలచక్రంలో రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచిపోవడం ఒక పరిణామ క్రమం.

సుందర్‌కు ఇంజనీరింగ్ ఎంసెట్‌లో మంచి ర్యాంకు వచ్చింది. ఫీజు కట్టాలి. బుక్స్ తీసుకోవాలి. బట్టలు తీసుకోవాలి. ఇవన్నీ పెద్ద సమస్యలై కూచున్నాయి.

పాణిగ్రాహి టిఫిన్ చేసి బ్యాంకుకు వెళ్లిపోయాడు.

అఖిల కాలేజీకి వెళ్లింది. కావ్య, కార్తీక్‌లు బుక్స్ కొనడానికి బయటకు వెళ్లారు. ఇంట్లో సుందర్, అగమ్యే వున్నారు. అగమ్య చిక్కుడుకాయలు నారతీస్తోంది. సుందర్ పిల్లిలా చప్పుడు చేయకుండా వచ్చి వదిన పక్కనే కూచున్నాడు. చిక్కుడుకాయలు తీసుకొని తనూ నారతీయసాగాడు.

"అదేమిటయ్యా! నువ్వు ఈ కిచెన్ పని చేయడమేమిటి? లే... లే... ఎవరైనా చూస్తే బావుండదు. వదిన మరిదితో వంట పని చేయిస్తోందనుకుంటారు"

"ఛ...ఛ మా వదినని ఎవరైనా అలా అంటే నాలిక చీల్చి పారేయనూ" అన్నాడు వదిన కొంగుతో మొహం తుడుచుకుంటూ.

"ఈ వదిన మీద వున్న ప్రేమ నాకు తెలుసులే కానీ ఇంతకీ విషయమేమిటి? వదినను కాకా పడుతున్నావా?" అడిగింది నవ్వుతూ అగమ్య.

"మా వదినను కాకా పట్టాల్సిన అవసరం నాకేంటి? నాకేం కావాలో మా వదినకు తెలుసు. మా వదిన దేవత" అన్నాడు చిక్కుడుకాయ నార తీస్తూ.

"నీ వదిన అంటే నీకెంత ప్రేమో నాకు తెలుసు కానీ వెళ్లి హాయిగా కుర్చీలో కూచొని మాట్లాడు. రేపో మాపో ఇంజనీర్ కాబోతున్నావు. చీప్‌గా కింద కూచుంటారా?" మురిపెంగా, ప్రేమగా మరిది వైపు చూస్తూ అంది అగమ్య.

"నేను ఎంత పెద్ద ఇంజనీర్‌ని అయినా నీ పెంపకంలో పెరిగిన నీ బిడ్డనే కదా వదినా? నీ దగ్గర నాకు గొప్పేమిటి? నేను నీ పాదాల దగ్గర కూచోవాల్సిన వాడిని" అన్నాడు వదిన ఒడిలో తలపెట్టి.

సుందర్‌ని చూస్తుంటే మరిది కనిపించడంలేదు, కొడుకులా కనిపిస్తున్నాడు. ఇంకా చిన్న పిల్లాడిలా అనిపిస్తున్నాడు.

రాత్రిపూట భయమేసి తన ఒడిలోనే పడుకున్న పదేళ్ల కిందటి సుందరే గుర్తొస్తున్నాడు.

"ఏం కావాలి సుందర్?" అడిగింది అగమ్య.

"అన్నయ్య నన్ను ఇంజనీరింగ్ చదివించనంటున్నాడు. ఇప్పటికే బోల్డు ఖర్చయింది, ఇంకా ఫీజులు, అదీ కట్టాలంటే ప్రాబ్లం, హాయిగా డిగ్రీ చేసి ఏదైనా జాబ్ చేసుకుంటే చాలు అంటున్నాడు"

"నేను మాట్లాడతాలే"

"వదినా నాకు ఇంజనీర్ కావాలని కోరిక. నేను ఇంజనీర్‌ని అయితే లక్షలు సంపాదించి నిన్ను కారులో తీసుకెళ్తాను. నీకోసం

మంచి ఇల్లు నేనే డిజైన్ చేసి కట్టిస్తాను"

అతని జుట్టు సరిచేస్తూ "సరే సరే అన్నయ్యతో నేను మాట్లాడతానన్నానుగా"

"వదినా మా ఫ్రెండ్స్‌లో నాకు ఒక్కడికే ఎంసెట్‌లో ర్యాంక్ వచ్చింది. నలభై మందిలో నేను ఒక్కడినే. నాకు ఇంజనీర్ కావాలని వుంది వదినా. నువ్వు చెప్తే అన్నయ్య కాదనడు. ప్లీజ్ వదినా"

"సుందర్! నువ్వు హేపీగా వుండు. మీ అన్నయ్యకు మాత్రం నిన్ను ఇంజనీర్‌ని చేయాలని వుండదా. తన పరిస్థితి కూడా అంతంత మాత్రమేగా. ఏదో బాధలో అని వుంటారు. అయినా నువ్వేం కంగారుపడకు. అన్నయ్య బ్యాంకు నుంచి వచ్చాక మాట్లాడతాను" అంది భరోసా ఇస్తున్నట్టు అగమ్య.

"థాంక్యూ వదినా మా వదిన చాలా మంచిది" అన్నాడు సుందర్.

అగమ్య నవ్వుకుంది. సుందర్‌కు ఇప్పుడు హేపీగా వుంది. వదిన మాట ఇచ్చిందంటే దానికి తిరుగులేదు.

★ ★ ★

"అదికాదు అగమ్యా. నా పరిస్థితి అర్థం చేసుకోవెందుకు? ఇప్పటికిప్పుడు వేలకొద్దీ డబ్బు ఎక్కడ్నుంచి వస్తుంది. బ్యాంకులో ఇప్పటికే చాలా లోన్లు తీసుకున్నాం. ఇంతకన్నా నా వల్ల కాదు. హాయిగా డిగ్రీలో చేరమను" అన్నాడు పాణిగ్రాహి.

అంత మంచి బ్రిలియంట్ స్టూడెంట్‌ని డిగ్రీ చదవమంటారు. ఎంతమందికి ఇంజనీరింగ్‌లో సీటు వస్తుంది చెప్పండి. వాడు హాయిగా ఇంజనీర్ అయితే మనమే కదా సంతోషించేది.

పాణిగ్రాహి తమ్ముడు ఇంజనీర్ అంటే మనకెంత గొప్ప. నా మాట వినండి. కష్టాలు మనకు కొత్తకాదు. ఏదో ఒకటి చేద్దాం" అగమ్య నచ్చచెప్పింది.

"అది కాదు అగమ్యా" పాణిగ్రాహి ఏదో చెప్పబోయాడు.

"మరేం చెప్పొద్దు. ఏదో ఓ లోనుకు అప్లయ్ చేయండి"

"అగమ్యా... ఇంటి ఖర్చులు పెరిగాయి. అద్దె పెరిగింది. కటింగ్స్ ఎక్కువయ్యాయి. వాటి మధ్య ఎలా కుదురుతుంది చెప్పు"

"మీకు ఎంత కుదిరితే అంత ఇవ్వండి"

మిగతావి ఎలా సర్దుతావని పాణిగ్రాహి అడగలేదు. అగమ్య చెప్పనూలేదు.

ఒకవేళ అడిగితే అగమ్య చెప్పే సమాధానం ఏమిటో అన్న భయం. ఓసారి సుందర్‌కు, అఖిలకు బట్టలు తీసుకోవడం కోసం చెవిదుద్దులు అమ్మేసింది. ఆ విషయం తెలిసి పాణిగ్రాహి బాధపడ్డాడు.

ఇంకా అలాంటి త్యాగాలు అగమ్య ఎన్నో చేసింది. అవి తెలుసుకొని భరించలేడు.

అతనికి ఏ టెన్షనూ ఇష్టముండదు. అగమ్యకు భర్త మనస్తత్వం పెళ్లయిన మరుసటి రోజే తెలిసింది.

అతడిని మార్చే ప్రయత్నం చేయలేదు.

★ ★ ★

అగమ్య ఆలోచనలో పడింది. లోన్‌కి అప్లయ్ చేశాడు పాణిగ్రాహి. ఆ లోన్ ద్వారా వచ్చే డబ్బు సరిపోదు. ఏం చేయాలి?

ఏదో ఒకటి చేయాలి. సుందర్ మొహంలో సంతోషాన్ని చూడాలి. అతను ఇంజనీర్ కావాలి.

తన చేతికి వున్న రెండు వుంగరాల వంక చూసుకుంది. తన సమస్యకు పరిష్కారం దొరికింది.

"థాంక్యూ వదినా, థాంక్యూ వెరీమచ్. నువ్వే కనక పూనుకోకపోతే అన్నయ్య నన్ను ఇంజనీరింగ్ చేయమని చెప్పేవాడు కాదు" వదిన చేతులు పట్టుకుని ఊపేస్తూ అన్నాడు సుందర్.

"నువ్వెప్పుడూ ఇలా నవ్వుతూనే వుండాలి. ఇప్పుడు నీ కోరిక తీరిందిగా. ఇక కాన్‌సెంట్రేషన్ అంతా చదువుమీద పెట్టు"

"వదినా" సుందర్ కళ్లలో నీళ్లు తిరి





గాయి.

"అన్నయ్యను ఒప్పించడానికి, నాకోసం ఈ డబ్బును అడ్జెస్ట్ చేయడానికి నువ్వెంత కష్టపడ్డావో నాకు తెలుసు" అగమ్య చేతులను కళ్లకు అద్దుకుంటూ అన్నాడు సుందర్.

అప్పుడు గమనించాడు, వదిన చేతికి ఉంగరాలు లేవు.

"వదినా" ఏదో అనబోయాడు సుందర్.

"ఆ... మరిచిపోయాను. నీకిష్టమైన సున్నివుండలు చేశాను. అఖిల కోసం లడ్డూలు చేశాను. ఇప్పుడు తింటావా? "

"వదినా" సుందర్ కదిలిపోయాడు. అతనికి అర్థమైంది.

వదిన పాదాలను తాకాడు.

"వదినా! రోజురోజుకూ నీకు రుణపడిపోతున్నాను. నువ్వు అమ్మవి వదినా. ఎన్ని జన్మలైనా నేను నీ మరిదిగా పుట్టాలి. ఊహూ... వచ్చే జన్మలో మాత్రం నీ కొడుగ్గా పుడతాను. నాకు మంచి వదినమ్మ కావాలి అని ఆ దేవుడ్ని అడిగితే నా కోరికను సగం విని అమ్మలాంటి వదినమ్మను ఇచ్చాడు"

"సుందర్" అగమ్య మనసు చెమ్మగిల్లింది.

"అవునొదినా నువ్వు నాకు వదినవి కావు. అమ్మవి వదినా" సుందర్ కళ్లు కన్నీటి సెలయేళ్లు అయ్యాయి.

"సుందర్! ఏంటయ్యా ఇది? " అంది కదిలిపోతూ.

"అమ్మ బ్రతికివున్నా నన్ను ఈరోజు ఈ స్థితికి తీసుకువచ్చేది కాదు. నువ్వు ఈ ఇంటికి వచ్చింది మొదలు ప్రతి సంఘటనా నాకు గుర్తుంది వదినా. అమ్మనయినా మరిచిపోగలనేమో కానీ నిన్నెలా మర్చిపోగలను వదినా? " సుందర్ ఎమోషనల్‌గా మాట్లాడుతున్నాడు.

"సుందర్! నువ్వు ప్రయోజకుడివి కావడమే నాక్కావాలి. అది చాలు" అంది.

ఈ ప్రేమాభిమానాలు ఎంతకాలం నిలుస్తాయో, ఎవరిలో మిగిలివుంటాయో నిర్ణయించాల్సింది కాలం కాదు. మనుషుల్లోని మమతానురాగాలే.



"ఏయ్, అఖిలా! మనం పార్కుకి వచ్చి గంటసేపయింది. పది నిమిషాలకోమాట చొప్పున ఆరు మాటలు మాట్లాడివుంటావు. ఈ మాత్రందానికి కాలేజీకి వెళ్తున్నానని మీ వదినకు చెప్పి, ఇక్కడికి రావడమెందుకు? " మొహమంతా చిన్నబుచ్చుకుని అన్నాడు వివేక్.

"అదికాదు వివేక్, మన ప్రేమ గురించి అన్నయ్యకు, వదినకు ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాను"

"నా సైడ్‌నుంచి ప్రాబ్లం లేదు. ఎందుకంటే నేను ఒంటికొమ్ము శంభులింగంగాడిని. ముందూ వెనకా ఎవరూ లేరు"

"అదేకదా నా బాధ. అబ్బాయి బ్యాక్‌గ్రౌండ్ ఏమిటి? ఆస్తి ఎంత? అంతస్థు ఏమిటని అన్నయ్య అడిగితే? "

"మీ అన్నయ్య అలా అడుగుతాడంటావా? " అనుమానంగా అడిగాడు వివేక్.

"అలా అడగడనుకో ఏమీ పట్టనట్టు



వుంటాడు. మా వదినను కన్విన్స్ చేయగ లిగితే చాలు. కానీ, అదే ఎలా చెప్పాలి? " అని అంది ఆలోచిస్తూ అఖిల.

"ఏంటో, కాలేజీకి వెళ్తున్న నీకు చిన్న ఏక్సి డెంట్ కావడం, నేను నిన్ను సేవ్ చేయడం... అలా అలా మనపరిచయం డెవలప్ అయి, ప్రేమగా మారడం... ఆలో చిస్తోంటే నాకు గమ్మత్తుగా వుంది

ఇదంతా కలా, నిజమా అనిపిస్తోంది. నీ పరిచయంతో నా జీవితమే మారిపో యింది. నువ్వు నా భార్యగా నా ఇంట్లోకి అడుగుపెడితే మరింతగా లైఫ్ మారిపోతుం దేమో" అన్నాడు వివేక్.

అఖిల నవ్వి వూరుకుంది.

"చీకటి పడుతున్నట్టుంది, మనం బయల్దే రదామా? " అడిగాడు వివేక్.

అఖిల కూడా లేచింది.

రెండు మూడు రోజులకోసారి తప్పనిస రిగా కలుసుకోవడం వాళ్లకు అలవాటు. ఆరోజు అలానే కలుసుకున్నారు. విడిపోయే ముందు గుడ్‌నైట్ చెప్పుకున్నారు.

★ ★ ★

"అఖిలా! ఏంటీ ఏదో సీరియస్‌గా ఆలో చిస్తున్నావు? " కాలేజీనుంచి వచ్చినప్ప ట్నుంచి అదోలా మూడీగావున్న అఖిలను అడిగింది అగమ్య.

"అబ్బే, ఏ...ఏమీలేదొదినా. కాస్త తలనొ ప్పిగా వుంటేనూ..."

"ఏంటీ, తలనొప్పా? టాబ్లెట్ తెచ్చిచ్చేదా? ఆగు! స్టాపేక్ వుందేమో చూస్తాను"

"అబ్బ, మామూలు తలనొప్పే వదినా. అయినా నువ్వు సేవలు చేయడమేంటి వదినా? " అంది నొచ్చుకుంటున్నట్టు.

"అదేంటి అఖిలా, నాకు నువ్వయినా, కావ్య అయినా, సుందర్, కార్తీక్‌లు ఎవరైనా ఒక్కటే. పిల్లలకు తల్లి చేయడం తప్పేమీ కాదు"

"మా మంచి వదిన" అంటూ వదిన భుజమ్మీద తలపెట్టి పడుకుంది అఖిల.

అమ్మ ప్రేమ తాలూకు భద్రతాభావం కనిపిస్తోంది.

★ ★ ★

"ఏంటి అగమ్యా, సీరియస్‌గా ఆలోచిస్తు న్నావు? " అగమ్య సీరియస్‌గా వుండడంతో అడిగాడు పాణిగ్రాహి.

"ఏంలేదండీ" అంది అగమ్య.

"లేదు, నువ్వేదో విషయం గురించి వర్రీ అవుతున్నావు" అన్నాడు పాణిగ్రాహి.

అగమ్య తనెందుకు వర్రీ అవుతోందో చెప్పలేదు. పాణిగ్రాహి రెట్టించి అడగలేదు.

ఒక్కోసారి భర్త ప్రవర్తన బాధ కలిగి స్తుంది. ఇంటి విషయాలు కనీసం అప్పుడ ప్పుడైనా పట్టించుకుంటే బావుంటుంది కదా అన్న ఫీలింగ్ వస్తుంది. అయినా అంత లోనే భర్త గురించి అలా ఆలోచించడానికి మనస్కరించదు.

ఆరోజు రాత్రి పడుకునేముందు డిసైడ్ చేసుకుంది. భర్తతో మాట్లాడాలి, అఖిల విషయం ఇంకా నాన్చకూడదని.

కానీ, అంతకంటే ముందుగా అఖిలతో మాట్లాడ్డమే కరెక్టేమోననిపించింది.

★ ★ ★

"అఖిలా" పిలిచింది అగమ్య.

"ఏంటొదినా? " కాలేజీకి వెళ్లబోతోన్న అఖిల ఆగి అడిగింది వదినను.

"ఇవాళ ఇంపార్టెంట్ క్లాసులేమైనా వున్నాయా? "

"అదేంటొదినా? ఏమైనా పని వుందా? "

అవునన్నట్లు తలూపింది అగమ్య.

ఆశ్చర్యపోవడం అఖిల వంతయింది. ఎంత పనివున్నా తనని కాలేజీ మానేయ మని చెప్పని వదిన...

"ఏంలేదులే, కాలేజీకి వెళ్లు" అంది అంత లోనే అగమ్య.

అఖిల వదినను గమనిస్తూ వుంది. రెండ్రోజులుగా వదిన ఏదో విషయంలో మథనపడుతోందని అర్థమైంది.





"పర్లేదు, చెప్పొదినా. పెద్ద ఇంపార్టెంట్ క్లాసులేమీ లేవు" అంది పుస్తకాలని టేబుల్ మీద పెట్టి.

కాఫీ చేసి ఓ కప్పు అఖిలకు ఇచ్చి, తనో కప్పు తీసుకుని కూచుంది అగమ్య.

అఖిలకు అంతా సస్పెన్సుగా వుంది.

"చెప్పమ్మా, అతనెవరు? " సూటిగా అడిగింది అగమ్య.

"ఎవరొదినా? "

"అదే, నువ్వు ప్రేమించిన అబ్బాయి"

"వదినా!"

"అఖిలా! నువ్వు నన్ను వదినగా, అమ్మగా చూశావు. స్నేహితురాలిగా కూడా భావించి చెప్పమ్మా" నిదానంగా అంది అగమ్య.

ఆ మాటల్లో వ్యంగ్యం, కోపం లేవు.

"వివేక్ అని"

"అతనంటే నీకు చాలా ఇష్టమా? "

"అవునొదినా, చాలా మంచతను. అతనికి ముందూ వెనకా ఎవరూ లేరు" చెప్పింది అఖిల.

"అతన్నోసారి మనింటికి లంచ్‌కి ఇన్వయిట్ చేయి" చెప్పింది అగమ్య.

"నిజంగానా వదినా? " సంతోషంగా అడిగింది అఖిల.

"నిజంగా నిజం" చెప్పింది అగమ్య.

"థాంక్యూ వదినా... థాంక్యూ వెరీమచ్. మా వదిన చాలా మంచిది" అంటూ వదిన వెనగ్గా వెళ్ళి చేతులువేసి అల్లరిచేసింది.

"డిగ్రీ అయ్యేవరకూ ఆగుతారా? వెంటనే పెళ్ళి చేసేయనా? " అడిగింది అగమ్య.

"ఇంకెన్ని నెలలు. అలా తిరిగేసరికి అయిపోతుందిగా.. నీ ఇష్టం వదినా, నాకు సిగ్గేస్తోంది" అంది అఖిల.

"సరే... కానీ ఒక్క విషయం గుర్తుంచుకో. అఫ్‌కోర్స్ నీమీద నమ్మకం లేకకాదు. కానీ" అని ఆగి అంది. "తొందరపడకు. ఈ వయసులో తొందరపాటు, కోరికల ఉధృతం సహజం. మనం ఏమాత్రం తప్పటడుగు వేసినా, తిరిగి నిలదొక్కుకోలేం. నా పెంపకం మీద నాకు నమ్మకం వుంది. కాని ఓ అమ్మగా నాకు చెప్పాలనిపించి చెప్పాను"

"వదినా... నేను నీ ఆడపడుచునికాను. నీకు కూతుర్ని. పెద్ద కూతుర్ని. నీ పెంపకంలో పెరిగిన బిడ్డను, నీకు తలవంపులు తెచ్చేపని ఎప్పుడూ చేయను. ప్రామిస్" అంది వదిన చేతిలో చేయివేస్తూ.

"చాలమ్మా... నాకంతకన్నా ఇంకేం కావాలి. అబ్బాయిని లంచ్‌కు ఇన్వయిట్ చేయి. సండేరోజయితే బెటర్. మీ అన్నయ్య కూడా వుంటారు"

"అలాగే వదినా... ఈ విషయం వివేక్‌కు చెబితే ఎంత సంతోష పడతాడో" అంది అఖిల.

నవ్వి వూర్కుంది అగమ్య.

★ ★ ★

తన అనుమానమే నిజమైంది. అఖిల ప్రేమలో పడింది. తను మౌనంగా వున్న కొద్దీ అఖిల మౌనంగానే వుంటుంది. పెద్దవాళ్ళతో ఎలా చెప్పాలో అన్న సందిగ్ధత... టెన్షన్...

తనే ఓ అడుగు ముందుకేసి, వాళ్ళ ప్రేమను అంగీకరిస్తే...

అఖిల క్లాసుల పేరుతో తను ప్రేమించిన వ్యక్తిని కలుస్తోందని అర్థమైంది.

ఎప్పుడైతే అఖిల ప్రేమలో పడిందో అప్పుడే అబద్ధాలు ఆడ్డం ప్రారంభించింది. ఓ విధంగా అలా అబద్ధాలు ఆడ్డానికి ఆమెకి అవకాశం కలిగించినట్టవుతుంది.

మొన్నోరోజు ప్రొవిజన్స్ తీసుకువస్తుంటే బస్టాప్‌లో ఆఅబ్బాయితో కనిపించింది. అప్పుడే అగమ్య నిర్ణయించుకుంది.

అఖిలను ప్రేమ వ్యవహారం గురించి కదపటం ఉత్తమం. వాళ్ల ప్రేమను అంగీకరిస్తే ఏ బాధా వుండదు. వాళ్ళకు ఇష్టమైన పెళ్ళి చేయడం పెద్దవాళ్ళుగా తమ బాధ్యత.



"ఏమండీ.. మీతో ఓ విషయం మాట్లాడాలి" సోఫాలో పడుకుని ఏదో చదువుతోన్న భర్తతో అంది.

"చెప్పు" అన్నాడు బుక్ చదువుతూనే.

"అఖిల పెళ్ళి చేయాలి" చెప్పింది అగమ్య.

"చేద్దాం" అన్నాడు పుస్తకంలోనుంచి తల పైకి ఎత్తకుండానే.

"అఖిల ఎవరో ఓ అబ్బాయిని ప్రేమించిందట"

"అలాగా"

"ఆ అబ్బాయిని సండేరోజు లంచ్‌కు ఇన్వైట్ చేశాను"

"సరే"

"అబ్బాయితో మీరు మాట్లాడండి. నేను మాట్లాడితే ఏం బావుంటుంది"

"నేనా... నేనేం మాట్లాడతాను. నువ్వు మాట్లాడేసెయ్"

అగమ్యకు ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. ఓ పక్క అతని చెల్లెలు పెళ్ళి గురించి మాట్లాడితే ఏమాత్రం పట్టకుండా ఎలా వుండగలడు? ఇది నిర్లిప్తతా? నిరాసక్తతా? అతని మెంటాల్టీయే అంతని తెలుసు.

ఓసారి నిట్టూర్పు విడిచి, వంటగదిలోకి వెళ్ళింది.

★ ★ ★

ఆదివారం రానే వచ్చింది.

చికెన్ తెప్పించింది. లంచ్‌లోకి రెండు కర్రీలు, సాంబారు చేసింది. వడియాలు వేయించింది.

కావ్య, కార్తీక్‌లు స్పెషల్ క్లాసులున్నాయని కాలేజీకి వెళ్ళారు.

లంచ్ అయింది.

వివేక్‌కు చాలా సంతోషంగా వుంది. ముఖ్యంగా అగమ్య ప్రవర్తన అతనికి అమితమైన సంతోషాన్ని కలిగించింది. స్వంత సోదరుడిలా బిహేవ్ చేసింది. కొసరి కొసరి వడ్డించింది.

ఇలాంటి అక్కయ్య వుంటే బావుండనిపించింది అతనికి. అగమ్యను చూస్తోంటే రెండు చేతులెత్తి నమస్కరించాలనిపిస్తోంది.

"మీరు, మా అఖిల ప్రేమించుకున్నారు. ఈ వయసులో ప్రేమ సహజం. ప్రేమ పెళ్ళికి దారితీయాలి. ఆ పెళ్ళి అన్యోన్య దాంపత్యానికి గుర్తుగా మిగిలిపోవాలి. అఖిల డిగ్రీ పూర్తయ్యేవరకూ మీరు ఓపిక పట్టాలి.

ఈలోగా మీరు పార్కుల్లో సినిమా హాల్లో కలుసుకోవాల్సిన అవసరం లేదు. అఖిలతో మాట్లాడాలనిపిస్తే ఇంటికి రండి. ఓ స్నేహితురాలిలా కలుసుకోండి. కొంతకాలం ఓపిక పడితే వైవాహిక జీవిత మాధుర్యం తెలుస్తుంది" చెప్పింది అగమ్య.

ఓ తల్లి బిడ్డకు హితబోధ చేస్తున్నట్టు వుంది.

ఓ తండ్రి తన కొడుక్కి జాగ్రత్తలు చెబుతున్నట్టు వుంది.

ఓ సోదరి తన సోదరుడితో మాట్లాడుతున్నట్లుంది.

"తప్పకుండా... మీ మాటలు నాకు మంత్రాక్షరాల్లా వినిపిస్తున్నాయి. ఒక చిన్న రిక్వెస్ట్. నేను మీకన్నా చిన్నవాడిని. వివేక్ అంటే చాలు" చెప్పాడు వివేక్.

అగమ్యకు వివేక్‌ను చూస్తే ముచ్చటేస్తోంది. తనకు తమ్ముడు వుంటే వివేక్‌లానే వుండేవాడేమో.

వివేక్ కూడా అలానే ఆలోచిస్తున్నాడు. తనకో అక్క వుంటే అగమ్యలానే వుండేదా?

తమ ప్రేమ విషయం విని భర్తతో చెప్పి రాద్ధాంతం చేస్తుందని తను అనవసరంగా భయపడ్డాడు.

కానీ, ఆడపడుచు గురించి ఆలోచిస్తూ తమ ప్రేమ సంగతి వినగానే, ఇంటికి పిలిచి తమ ప్రేమను ఆశీర్వదించి, ఎవరికీ అప్రతిష్ట కలగకుండా ఎవర్నీ నొప్పించకుండా అగమ్య చెప్పిన మాటలు అతన్ని




విపరీతమైన ప్రభావంలో పడవేశాయి.

అగమ్యలాంటి వదిన దొరకడం అఖిల అదృష్టమైతే, అగమ్యలాంటి వ్యక్తి తనకు సోదరి సమానురాలు అవ్వడం, తన పూర్వ జన్మ సుకృతమే.

★ ★ ★

"అబ్బాయి బావున్నాడుకదూ" అడిగింది భర్తని అగమ్య.

"బాగానే వున్నాడు"

"మన అఖిలకు ఈడూ, జోడూ బాగా వుందికదూ"

"అవునవును"

"అఖిలకు ఎగ్జామ్స్ కాగానే పెళ్ళి చేసేద్దా మండీ"

"చేసేద్దాం"

ఓసారి భర్త వంక అనుమానంగా చూసింది తన మాటలు వింటున్నాడా?

"ఏంటి అగమ్యా...ఆశ్చర్యపోతున్నావా? నా నిశ్చింతకు కారణం నువ్వే. నువ్వుండగా నాకే టెన్షనూ వుండదు. నువ్వేం చేసినా బాగా ఆలోచించే చేస్తావు. నీకేది మంచి దని తోస్తే అది చేయి" అని చెప్పి ఆవు లిస్తూ లేచాడు నిద్రపోవడానికి పడగ్గదివైపు కదులుతూ.

ఓ విధంగా సమస్య నుంచిఎస్కేప్ అవు తున్నాడు. దానికి అతను తొడుక్కున్న ముసుగు నువ్వేది చేసినా మంచే చేస్తావన్న పొగడ్త.

భర్త ప్రవర్తన తెలిసిన అగమ్య మరిం కేమీ మాట్లాడలేదు. అఖిల ఎగ్జామ్స్ అయ్యే లోగా పెళ్ళికి కావలసినవి సమకూర్చుకో వాలి.

★ ★ ★

"ఏంచేద్దామనుకుంటున్నారు? " అడిగింది సంగీత.

అగమ్య ఆరోజు ఉదయమే సంగీతను కలిసింది. మాటల మధ్య అఖిల పెళ్లిచే యాలని అనుకుంటున్నట్టు చెప్పింది.

"చూద్దాం... ఆ దేవుడు ఎలా జరిపి స్తాడో" అంది అగమ్య.

"ఇప్పటికే చాలా కష్టపడుతున్నారు. మీ మరిది చదువుకు లోన్ తీశారు. కటింగ్స్ చాలా వున్నాయి. పాణిగ్రాహి గారి సంగతి నాకు తెలియనిదికాదు. నిమ్మకు నీరెత్తినట్టు వుంటారు.

అసలు అతను ఇచ్చే డబ్బుతో మీరెలా సర్దుబాటు చేస్తున్నారో అర్థంకాదు. మన పరిచయం అయి ఇన్నేళ్ళయినా మీరు కొత్త చీర కట్టుకోవడం చూడలేదు. ఎప్పుడడిగినా నాకిప్పుడు కొత్త చీరలు ఎందుకు అంటారు. ఎంతసేపు ఆడపడుచు, మరిది, కొడుకు, కూతురు, భర్త, మీ ప్రపంచంలో వాళ్లేనా?

కనీసం మీ గురించి మీరైనా ఆలోచించు కోవాలిగా. ఎట్‌లీస్ట్ మూరెడు మల్లెలు కూడా కొనుక్కోరు" బాధగా అంది సంగీత.

"అందుకు నేను బాధపడ్డంలేదు. ఎందు కంటే వాళ్ళే నా ప్రపంచం అనుకున్నా. శరీ రంలో కనిపించని మిగతా భాగాలు వాళ్ళే" అంది అగమ్య.

సంగీత ఏం మాట్లాడలేకపోయింది. ఆమెకు ఇదంతా ఆశ్చర్యంగా వుంది. చాలా కొత్తగా, అబ్బురంగా అనిపిస్తోంది.

ఓ మనిషి తనవాళ్ళకోసం ఇంతగా తపి స్తాడా? ఏమనిషి అయినా తననుతాను ప్రేమించుకున్నాక, ఇతరులను ప్రేమించడం మొదలెడతాడు.

కానీ అగమ్యలాంటి వాళ్ళను చూశాక, ప్రేమ అనే మాటకు కొత్త అర్థాన్ని, సరికొత్త పరమార్థాన్ని వెతుక్కోవాల్సి వస్తోంది.

★ ★ ★

"పెళ్ళి సింపుల్‌గా చేద్దామా? " అడిగాడు పాణిగ్రాహి అగమ్యను.

"వద్దు... తన పెళ్లి సింపుల్‌గా చేశారన్న ఫీలింగ్ అఖిలకు కలగకూడదు"

"చాలా ఖర్చవుతుంది కదా..."

"రేపు మన కావ్యకు చేసినా ఖర్చవు తుంది. ఓ బిడ్డకు గ్రాండ్‌గాచేసి, మరో





బిడ్డకు సింపుల్‌గా చేయలేముకదా"

పాణిగ్రాహి ఏమీ మాట్లాడలేకపోయాడు. అగమ్య మనసులోని తల్లి మనసు అతనికి తెలియనిదేమీకాదు.

★ ★ ★

అఖిల పెళ్ళి గ్రాండ్‌గానే జరిగిపోయింది. ఏలోటూ రాకుండా చూసుకుంది అగమ్య. అందుకోసం అయ్యే ఖర్చుకు వెనుకాడలేదు.

అఖిల, వివేక్‌లు తన కాళ్ళకు మొక్కుతుంటే కదిలిపోయింది.

"వదినా... నువ్వు అమ్మవి, నాన్నవి, అన్నవి అన్నీ నువ్వే. నువ్వే కనుక పూనుకోకపోతే మా పెళ్ళి జరిగేదికాదు. మాకు పుట్టే బిడ్డ ఆడపిల్లే పుట్టాలని కోరుకుంటున్నాను. ఆ బిడ్డకు నీ పేరే పెట్టుకుంటాం" కన్నీళ్ళతో అంది అఖిల.

"నీ అభిమానం చాలమ్మా" అంది అగమ్య కళ్ళొత్తుకుంటూ. ఆమెకు చాలా బాధగా వుంది. ఇన్నేళ్ళు పెంచి, పోషించిన బిడ్డలాంటి ఆడపడుచు. ఈ రోజుతో ఈ ఇంటితో సంబంధం తెంచుకుని...

"అగమ్యా... ఏంటి ఏదో కన్నకూతుర్ని అత్తారింటికి సాగనంపినట్టు..." అంది సంగీత ఊరడిస్తూ.

"అది నాకు కన్నకూతురికంటే ఎక్కువే. ఈ ఇంట్లో తొలిబిడ్డ అది" అంది వెక్కుతూనే అగమ్య.

"నిన్నెలా అర్థం చేసుకోవాలో అర్థంకాదు. అగమ్యా... ఆడపడుచుని ఇంత ఇదిగా ప్రేమించేవాళ్ళను నేనెక్కడా చూడలేదు" అంది సంగీత.

★ ★ ★

అగమ్య ముందున్న సమస్య అఖిల కాపురాన్ని సరిదిద్దడం. అప్పటివరకూ వివేక్ వున్న ఇల్లు చాలా చిన్నది. బ్యాచిలర్ వుండే గదిలాంటిది.

వివేక్‌కి వచ్చే జీతం కూడా కుటుంబం గడవడానికి సరిపోదు. అతనికో మంచి ఉద్యోగం దొరికితే తప్ప... వాళ్ళు హేపీగా వుండలేరు.

అదేరోజు పేపర్‌లో ఓ ప్రయివేట్ బ్యాంకు వారి ప్రకటన వచ్చింది. సమర్థుడైన మేనేజర్ కావాలట. జీతం బాగానే వుంటుంది. వివేక్ సమర్థుడు కూడా.

పాణిగ్రాహికి ఈ విషయం చెప్పి కనుక్కోమంది.

"అబ్బ... మనం పెళ్ళి చేశాంకదా. వాళ్ళ పాట్లు వాళ్ళు పడతారులెద్దూ" అన్నాడు పాణిగ్రాహి.

"అలా అంటే ఎలా చెప్పండి. ఆడపిల్లని ఇచ్చినవాళ్ళం ఆ మాత్రం కేర్ తీసుకోకపోతే ఎలా? అయినా ఇందులో పెద్ద కష్టమేముంది? మీకు కుదరకపోతే చెప్పండి. నేను వెళ్ళి కనుక్కుంటాను" అంది ఆఖరి అస్త్రం ప్రయోగిస్తూ.

"నేను కనుక్కుంటాన్లే" అన్నాడు పాణిగ్రాహి.

రెండ్రోజులవరకూ నిమ్మకు నీరెత్తినట్టుగానే వున్నాడు. రోజూ ఉదయం ఓసారి, సాయంత్రం బ్యాంకునుంచి వచ్చాక ఓసారి పోరుతూనే వుంది అగమ్య.

భార్య బాధ పడలేక ప్రయివేట్ బ్యాంకుకు వెళ్ళి కనుక్కున్నాడు.

"విషయం కనుక్కున్నారా?" భర్తని అడిగింది అగమ్య.

"కనుక్కున్నాను" ముక్తసరిగా అన్నాడు పాణిగ్రాహి.

"ఆ బ్యాంకు మంచిదేనా?"

"పర్లేదు. పెద్దపెద్ద బ్యాంకుల్లోని బోర్డ్ డైరెక్టర్స్ కలిసి ఈ బ్యాంకు స్టార్ట్ చేశారు"

"అందులో మన వివేక్‌కు ఏదైనా అవకాశం వుంటుందా?"

"అతను బ్రిలియంటే కాబట్టి వుండొచ్చు"

"మరింకేం ఆలస్యం. రేపు చాలా మంచిది. అప్లికేషన్ పంపించమని వివేక్‌కు చెప్పండి. అలాగే సాయంత్రం డిన్నర్‌కు ఇన్వైట్ చేయండి. కొత్తకాపురం. అఖిల ఎన్ని కష్టాలు పడుతోందో ఏమో" అంది

అగమ్య.

"అబ్బ... రెండ్రోజులకోసారి ఏదో ఒకటి పట్టుకువెళ్తూనే వున్నావు. అయినా నీకింత దిగులు పనికిరాదు అగమ్యా"

"ఆడపిల్ల అత్తారింటికి వెళ్తే వుండే బాధ, మీ మగాళ్ళకేం తెలుస్తుంది. మీరు ఆడపిల్లగా పుట్టి ఉంటే అర్ధమవుతుందిలెండి" అంది అగమ్య.

"నిన్ను పొరపాటున కదిలించాను" అంటూ కామ్‌గా వెళ్ళి సోఫాలో కెరీర్‌బుక్ చదువుతూ కూర్చున్నాడు.

★ ★ ★

ఆరోజు రాత్రి అఖిల, వివేక్ డిన్నర్‌కు వచ్చారు.

అఖిల, వివేక్, కావ్య, సుందర్, కార్తీక్, పాణిగ్రాహి అందరూ కూర్చున్నారు. అగమ్య వడ్డిస్తోంది.

అన్నీ స్పెషల్సే చేసింది. వివేక్ అగమ్య వంటలను మెచ్చుకోకుండా వుండలేకపోయాడు.

"అక్కయ్యా... మీ చేతి వంట తింటుంటే, రోజూ ఒక్కపూటైనా ఇక్కడికి వచ్చి తిని పోవాలని అనిపిస్తోంది" అన్నాడు మనస్ఫూర్తిగా వివేక్.

వెంటనే అఖిల చురచురా చూసింది మొగుడివంక.

అగమ్య అదేమీ గమనించకుండా తన ధోరణిలో...

"అదేం భాగ్యం. రెండ్రోజులకోసారి నేను క్యారేజీ పంపిస్తాను. నీకు వీలయినప్పుడల్లా వచ్చి తిని పోవచ్చు ఇది నీకు అత్తిల్లు, పుట్టిల్లూ రెండూ" అంది.

అఖిల మాట్లాడలేదు.

పాణిగ్రాహి తను తినేసి పడగ్గదిలోకి వెళ్ళిపోయాడు.

"ఏమండీ... వివేక్ వాళ్ళు వెళ్ళిపోతున్నారు. బయటకు వచ్చి సెండాఫ్ ఇవ్వండి" అంది పడగ్గదిలో నిద్రపోతున్న భర్తని లేపి.

"అబ్బ... నిద్రొస్తోంది అగమ్యా... నువ్వున్నావుగా" అంటూ అటు తిరిగి పడుకున్నాడు.

సుందర్ తనకు పని వుందంటూ వెళ్ళిపోయాడు. ఈమధ్య ఎక్కువగా రాత్రిళ్ళు ఇంటికి రావడంలేదు.

కావ్య, కార్తీక్‌లు నోట్స్ తెచ్చుకోవాలని వెళ్ళారు.

"అక్కయ్యా మేమిక వెళ్తాం" అన్నాడు వివేక్ లేస్తూ.

"మీ బావగారికి తలనొప్పిగా వుంది. లేకపోతే తనూ వచ్చి సెండాఫ్ ఇచ్చేవారు" భర్తను సమర్ధిస్తూ అంది అగమ్య.

"భలేవారు అక్కయ్యా... ఈ ఇంట్లో అందరి పెట్టు మీరు ఒక్కరే. అయినా నేను నీ తమ్ముడినేకదా. నాకు మర్యాదలు ఎందుకు చెప్పండి" అన్నాడు వివేక్.

ఆ మాత్రానికే అగమ్య సంతోషపడిపోయింది.

అఖిల మొగుడి చేతిని గిల్లింది అగమ్య చూడకుండా.

"అన్నట్టు చెప్పడం మరిచిపోయాను. మొన్న పేపర్లో పడ్డ ప్రయివేట్ బ్యాంక్ ప్రకటన చూశావా?"

"చూశానక్కయ్యా... కానీ"

"మీ బావగారు వెళ్ళి కనుక్కొచ్చారు. ఓ అప్లికేషన్ ఇయ్యి. తను కూడా బ్యాంకులోనే చేస్తారుకాబట్టి నీ పని సులువు అవుతుంది. అదీగాక, నీకు కాక ఈ ఉద్యోగం ఇంకెవరికి వస్తుంది"

"అది నిజమేననుకోండి అక్కయ్యా. కానీ..."

"ఏదైనా ప్రాబ్లమా?" అడిగింది అగమ్య.

"అదేమిటండీ వదిన దగ్గర సిగ్గుపడతా రెందుకు? మిమ్మల్ని స్వంత తమ్ముడిలా చూసుకుంటుంది. నన్ను స్వంత కూతురిలా చూసుకుంది. ఆ పోస్టుకు యాభైవేలు డిపాజిట్‌గా కట్టాలని చెప్పడానికి మొహమాట





మెందుకు? తనేమైనా పరాయిదా?" అఖిల కల్పించుకుంటూ అంది.

"యాభైవేలు సెక్యూరిటీ డిపాజిట్‌గా కట్టాలా?" అగమ్య అడిగింది.

"అవునండీ... మామూలుగా అయితే లక్ష రూపాయలు. నా సర్టిఫికెట్స్ చూసి ఆమాత్రం తప్పదని అది వాళ్ళ ప్రొసీజర్ అని చెప్పారు. అందుకే మీకీ విషయం చెప్పలేదు"

"అంతమాత్రాన బంగారంలాంటి ఉద్యోగం వదులుకుంటామా?" అంది అగమ్య.

"నాకు తెలుసొదినా. నీ మనసు బంగారమని. నేను చెప్పలేదా. వదిన మనకోసం ఏదైనా చేస్తుందని. మీరు వింటేనా?" అంది మొగుడ్ని అఖిల.

"అదికాదు అఖిలా అక్కయ్యమాత్రం ఎక్కడ్నించి తీసుకువస్తారు? మన పెళ్ళి కూడా గ్రాండ్‌గా చేశారు" వివేక్ ఇంకా ఏదో అనబోయాడు.

అప్పటికే అఖిల చాలా సీరియస్‌గా మొగుడివైపుచూసింది.

"మీకు అన్నీ అనుమానాలే. అయినా మా దేవతలాంటి వదిన గురించి మీకు తెలుసా? నాకు తెలుసా? మాకోసం వదిన ఎన్ని చేసిందనుకున్నారు. ఈమాత్రం చేయలేదా? మా అన్నయ్య ఇంజనీరింగ్ చదవడానికి కారణం మా వదినే. ఆవిడే కనుక పూనుకోకపోతే ఇది జరిగేదికాదు" అంది అఖిల.

"అలా అని..." వివేక్ ఇంకా ఏదో అనబోయాడు.

"పోనీ వివేక్... ఆ యాభైవేల విషయం నేను ఆలోచిస్తాను. మంచి అవకాశాన్ని పోగొట్టుకోవడం ఎందుకు చెప్పు. చీకటి పడుతోంది. మీరిక బయల్దేరండి. మంచి శుభవార్తతో నేను కలుస్తాను" అంది అగమ్య.

"నాకా యాభైవేల డిపాజిట్ విషయం తెలుసు" తాపీగా అన్నాడు పాణిగ్రాహి.

"తెలుసా... తెలిసి నాకెందుకు చెప్పలేదు?" ఆశ్చర్యంగా అడిగింది అగమ్య.

"ఎందుకంటే ఇందుకే. ఇప్పుడా యాభైవేలు మనం ఎక్కడ్నించి తీసుకువస్తాం. ఏదో వాళ్ళ పెళ్ళి చేశాం. అక్కడితో మన బాధ్యత తీరిపోయింది" అన్నాడు బుక్ చదువుకుంటూ పాణిగ్రాహి.

"బాధ్యతలు అనేవి మనం ఏర్పరచుకున్న సరిహద్దులండీ. కాస్త ఆ సరిహద్దు దాటి, అవతలవైపు ఆలోచించండి. వివేక్ తెలివైనవాడు. అతనికి వచ్చిన అరుదైన అవకాశం ఇది. అఖిల, వివేక్‌లు హాయిగా బతకడానికి మంచి అవకాశం ప్లీజ్... నా మాట కాదనకండి" అంది అగమ్య బతిమిలాడుతున్న ధోరణిలో.

"నీ ధోరణి నీదేకానీ నే చెప్పేది విన్పించుకోవు. ఇప్పుడు మళ్ళీ ఏదో ఓ లోను తీసుకోవాలి. ఇలా అయితే మన సంసారం నడిచేదెలా?" అడిగాడు పాణిగ్రాహి.

"ఆ విషయం నేను చూసుకుంటానుకదా. ఇప్పుడు అఖిల, వివేక్ దగ్గరే వుంటుంది. ఒక మనిషి తగ్గినట్లే కదా. ఆ ఖర్చు కలిసొస్తుందిగా. మీరు ఇచ్చేడబ్బులో నేను ఏదోలా సర్దుబాటు చేస్తాను. మీరు మాత్రం ఎలాగోలా ఆ యాభైవేలు సర్దండి"

"నీ ఇష్టం... తర్వాత ఇబ్బంది అయితే నన్ను అడగొద్దు. ఆ ఖర్చుల, ఈ ఖర్చులు అంటే నేనేమీ చేయలేను" నిష్కర్షగా చెప్పాడు పాణిగ్రాహి.

"సరే" అంది అగమ్య.

"పాతికవేలవరకూ సర్దుతాను. మిగతావి కష్టం. ఇప్పటికే లోన్లు ఎక్కువయ్యాయి" అన్నాడు పాణిగ్రాహి.

ఏం మాట్లాడాలో తోచలేదు "సరే" అంది చివరికి.

★ ★ ★

"అదీ సంగతి. మీరు ఎలాగైనా ఓ పాతికవేలు సర్దండి. నేను నెలనెలా కొంత

అడ్జస్టు చేస్తాను. దాంతో మా అఖిల కాపురం కుదుటపడుతుంది" చెప్పింది సంగీతతో అగమ్య.

"నాకు వడ్డీ అక్కర్లేదు. తెలిసినవాళ్ళ దగ్గర ఓ చీటీ ఉంది. పాట పాడి ఆ డబ్బు నీకు ఇస్తాను. నెలనెలా చీటీ కడితే సరిపోతుంది. కానీ ఇరవై అయిదు నెలలు కట్టాలి"

"ఫర్లేదు. నేను నెలనెలా కట్టుకుంటాను"

"మీ ఇష్టం. రెండ్రోజుల్లో అమౌంట్ ఏర్పాటుచేస్తాను" అంది సంగీత.

రెండు చేతులూ జోడించింది కృతజ్ఞతగా అగమ్య.

"వద్దు... నేనే మీక ఋణపడి వున్నాను. ఒకప్పుడు నా కాపురం నిలబెట్టినవారు మీరు"

★ ★ ★

పాణిగ్రాహి ఇరవై అయిదువేలు తెచ్చి అగమ్యకు ఇచ్చాడు.

వచ్చేనెలనుంచి ఇంటి ఖర్చుకు ఇచ్చే మొత్తం తగ్గుతుందని చెప్పి మరీ ఇచ్చాడు.

సంగీత పాతికవేలు ఇప్పించింది.

అదేరోజు సాయంత్రం ఆ డబ్బును తనే స్వయంగా తీసుకువెళ్ళి వివేక్‌కు ఇచ్చింది.

వివేక్ కళ్ళలో నీళ్ళు సుడులు తిరిగాయి.

ఏ జన్మ బంధం ఇది. ఏ జన్మ అనుబంధం ఇది. అతని మనసులో ఏదో బాధ. తనవల్ల అగమ్య ఇబ్బంది పడుతుందన్న బాధ అది.

అఖిల మొహంమాత్రం విప్పారింది.

"థాంక్యూ వదినా... థాంక్యూవెరీమచ్. నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేం" అంది అగమ్య రెండుచేతులూ పట్టుకొని.

"పిచ్చిపిల్లా... మనలో మనకు ఋణాలేమిటి?"

"భోజనం చేసి వెళ్ళండి" అక్కయ్యా అన్నాడు వివేక్.

"వద్దు... తొందరగా వెళ్ళాలి. పిల్లలు వస్తారు"

మాటమాత్రమైనా బలవంతం చేయలేదు అఖిల.

★ ★ ★

వివేక్‌కు ప్రయివేట్ బ్యాంకులో ఉద్యోగం వచ్చింది. ఆరోజే మొదటినెల జీతం అందుకున్నాడు. రెండు స్వీట్ పాకెట్స్ తీసుకువచ్చాడు. రెండుచీరలు కూడా తెచ్చాడు.

"ఇదేంటి? అన్నీ డబుల్ తెచ్చారు" అంది అఖిల.

"ఇవ్వాళే ఫస్ట్ శాలరీ తీసుకున్నాను. ఓ స్వీట్ ప్యాకెట్ చీరా అగమ్య అక్కయ్యకు మరోటి నీకోసం" అన్నాడు వివేక్.

వెంటనే అఖిల మొహంలో రంగులు మారాయి.

"నీకు చెప్పిందా మా వదిన. చీరా, స్వీట్స్ తీసుకురమ్మని?" అంది కోపంగా అఖిల.

"అదేంటి అఖిలా అలా అంటావు? వాళ్ళు చెబుతారా? అయినా ఆవిడ మనకెంత చేసింది?" వివేక్ బిత్తరపోతూ అన్నాడు.

"అలాగా... మరి నాకు తెలియదు. ఇలాంటివన్నీ మా వదినకు ఇష్టం వుండదు. ఏం అక్కర్లేదు. ఇంకోసారి నన్ను అడక్కుండా ఇలాంటి పనులు చేయకండి" అంది అఖిల.

వివేక్ ఏదో అనబోయాడు.

సరిగ్గా అప్పుడే అగమ్య వచ్చింది. వెంటనే అఖిల మొహంలో రంగులు మారాయి. మొహమంతా నవ్వు పులుముకుని.

"రా వదినా... ఇప్పుడే నీ గురించే అనుకుంటున్నాము" అంటూ కుర్చీ తెచ్చిపెట్టింది.

మంచమ్మీద వున్న స్వీట్స్, చీరలమీద అవి కనిపించకుండా దుప్పటి పరిచింది.

"బావున్నావా అఖిలా?" అడిగింది అగమ్య.

"నీలాంటి వదినమ్మ వుంటే నాలాంటి




వాళ్ళు ఎప్పుడూ బాగానే వుంటారు" అంది.

"బావున్నారా అక్కయ్యా... నేనే వద్దామని అనుకున్నా" అన్నాడు వివేక్.

"ఆc... అదే... అదే... ఆయనే వద్దామని అనుకొని నాకు ఇప్పుడే చెబుతున్నారు. అక్కయ్యతో ఎలా చెప్పాలో అర్థం కావడంలేదు. మన పెళ్ళికి ముందు చేసిన అప్పులు అలానే వున్నాయి, ఇప్పుడు అక్కయ్యకు ఇవ్వకపోతే ఏమనుకుంటుందో? అని నా దగ్గర బాధ పడుతుంటే... వదిన అలా ఏమీ అనుకోదు. తనే అర్థం చేసుకుంటుందని చెప్పాను. ఒక్క రెండుమూడు నెలలు ఓపిక పడితే... నెలానెలా నేనే కొంత పొదుపు చేసి ఇస్తాను వదినా" అంది అఖిల.

"ఛ...ఛ... అవేం మాటలమ్మా. అయినా నేనిప్పుడు డబ్బు కోసం రాలేదు. ప్రొవిజన్స్ కోసమని వచ్చాను. అలానే మిమ్మల్ని కలుసుకున్నట్టు వుంటుందని వచ్చాను" అంది అగమ్య.

నిజానికి అగమ్యకు డబ్బు అవసరం వుంది. వివేక్ తన జీతం డబ్బులలోనుంచి కొంతయినా ఇస్తాడని ఊహించింది.

డ్యూటీలో జాయిన్ అయిన రోజు తన బ్లెసింగ్స్ కోసం వచ్చి చెప్పాడు కూడా అలా అని.

"టీ త్రాగుతావా వదినా?" అడిగింది అఖిల.

"వద్దమ్మా, తొందరగా వెళ్ళాలి. మళ్ళీ కలుస్తాన్లే" అంది అగమ్య.

★ ★ ★

"ఏంటది అఖిలా...నువ్వు చేసినపని ఏమైనా బావుందా? ఆవిడ అంత పెద్ద మొత్తం మనకు హెల్ప్‌చేసింది. నెలనెలా కొంత ఇస్తే బాగుంటుంది. మొన్న ఆదినారాయణ కలిశాడు. వాళ్ళావిడే ఓ చీటీ వేయించి అగమ్య అక్కయ్యకు పాతికవేలు ఇప్పించిందట. మనకోసమే ఆ డబ్బు తీసుకుంది. నేను ఆవిడకు నెలనెలా ఇస్తానని చెప్పాను కూడా" నొచ్చుకుంటూ అన్నాడు.

"ఎవరినడిగి చెప్పారు? అయినా అదంతా ఒఠ్ఠి నాటకం. తనే ఆదినారాయణతో అలా మీకు చెప్పించి వుంటుంది. అయినా మీరొట్టి అమాయకులు. ఆడపడుచుకు పెట్టడం తన బాధ్యత. ఇంక మరేమీ మాట్లాడకండి" అంటూ అతని చేతిలోని జీతం కవరు లాక్కొని బీరువాలో పెట్టేసింది.

అక్కడ నమ్మకం అమ్మకమైపోయింది. మానవ సంబంధం ఆర్థిక సంబంధమైంది. కృతజ్ఞత, కృతఘ్నతగా మారింది.

★ ★ ★

రోజులు గడుస్తున్నాయి.

ఆనందం అనుభవైకవేద్యమైనప్పుడు రోజులు, సంవత్సరాలు క్షణాల్లో గడిచిపోతాయి.

ఇష్టాలుగా మార్చుకునే కష్టాలు మనకు తోడైనప్పుడు ప్రతీక్షణం ఓ సంవత్సరకాలం సుదీర్ఘమై బాధిస్తుంది.

అగమ్యకు రోజులు గడవడం కష్టమైంది. ప్రతీనెల ఏదో ఓ సాకు చెబుతోంది అడిగినా, అడగకపోయినా అఖిల.

వివేక్ నిస్సహాయుడైపోతున్నాడీ విషయంలో.

చీటీ డబ్బులు కట్టలేక, ఇంటికి సరిపడా సరుకులు తెచ్చే విషయంలో డబ్బు చాలక ఇబ్బంది పడుతోంది అగమ్య మాత్రమే.

ఈ విషయం గ్రహింపుకు వచ్చినా, తనకు పట్టనట్టు వుండిపోయాడు పాణిగ్రాహి.

ఒకవేళ ఇదంతా ఎలా సర్దుతున్నావని అడిగితే ఏంసమాధానం వినవలసి వస్తుందోనన్న భయం కూడా అతనికి లేకపోలేదు.

అగమ్యకు హెల్త్ సరిగ్గా వుండడం లేదు. మునుపటిలా ఈజీగా పనులు చేయలేకపోతోంది. ఎప్పుడో తనకు తెలిసిన కుట్లు, అల్లి

కలు ఆమెకు కొంత ఆర్థిక ఊరటనిస్తున్నాయి.

సంగీత ద్వారా ఖాళీగా వున్న సమయంలో చీరలమీద డిజైన్స్, కుట్లు వేయడం చేస్తోంది.

తన అనారోగ్యానికి డాక్టర్ ఖర్చులకు పాణిగ్రాహి ఇచ్చిన డబ్బును కూడా ఇంటికే వినియోగిస్తోంది. డాక్టర్ మందులు రాసిచ్చాడని, వాడుతున్నానని చెబుతోంది.

ఏ మందులు వాడుతున్నావు, ఏ డాక్టర్ దగ్గరికి వెళ్ళావని పాణిగ్రాహి అడగలేదు, అగమ్య చెప్పనూలేదు.

ఒక్కోసారి పాణిగ్రాహి ధోరణి బాధ కలిగిస్తోంది. అయినా ఈ బాధలన్నింటికీ అలవాటు పడిపోయింది అగమ్య.

కష్టాలు, కన్నీళ్ళు, బాధలు, సమస్యలు అగమ్యకు కొత్తకాదు. ఆమె ప్రియనేస్తాలు కన్నీళ్ళే.

★ ★ ★

సుందర్‌కు ఇంజనీరింగ్ పూర్తవ్వడం, అతనికి ఉద్యోగం దొరకడం రెండూ ఒకేసారి చకచకా జరిగిపోయాయి. దానిక్కా



రణం రఘుపతి.

అతని కూతురు హేమని సుందర్‌కు ఇవ్వాలని ఆలోచన అతనిది. మంచి కుర్రాడు. ముందు వెనకా బాధ్యతలు లేవు. ఇంతకన్నా ఆడపిల్ల కన్న తండ్రికి ఇంకేమి కావాలి?

అందుకే సుందర్‌కు తనే ఉద్యోగం ఇప్పించాడు. అందుకే కండిషన్ కూడా పెట్టాడు. సుందర్ ఇల్లరికం వుండాలి.

ఉద్యోగం వచ్చిన వెంటనే సుందర్ చేసిన మొదటి పని అగమ్య కాళ్ళమీద పడిపోవడమే.

"ఏయ్ సుందర్, ఏమిటయ్యా నా ఎత్తు పెరిగావు, నువ్వు నా కాళ్ళమీద పడ్డమేంటి! లే... లే..." అంటూ మరిదిని లేవనెత్తింది.

"ఇవి మామూలు పాదాలుకాదు వదినా, బ్రహ్మ కడిగిన పాదాలకన్నా, నీ పాదాలు నాకు పరమ పవిత్రమైనవి. తల్లి జన్మను మాత్రమే ఇచ్చింది. ఈ తల్లి నాకు జీవితాన్నే ఇచ్చింది. ఈరోజు ఈ చదువు, ఈ హోదా, ఈ ఉద్యోగం నువ్వు ప్రసాదించిన అద్భుతవరం. నీకన్నా నాకు ఎవరున్నారు వదినా?" అన్నాడు వదినను చుట్టుకుపోతూ...

అగమ్యకు నోటమాటరాలేదు.

పాణిగ్రాహి కూడా శిలలా వుండిపోయాడు. అలాంటి శిలలో కూడా చిన్న ప్రకంపనం. తను అన్నగా చేయలేని పనిని వదినగా, తల్లిగా అగమ్య చేసింది.

"సుందర్ ఏమిటిది చిన్నపిల్లాడిలా..." అంటూ తన చీరచెంగుతో అతని కళ్ళలోని కన్నీళ్ళు తుడిచింది.

"నువ్విప్పుడు ఇంజనీర్‌వి" అంది గర్వంగా మరిదివైపు చూస్తూ.

"ఢిల్లీకి రాజయినా తల్లికి కొడుకే అని... నేను ఇంజనీర్‌ని అయినా నీకు బిడ్డనేకదా వదినా, ఎప్పుడో చిన్నప్పుడు అమ్మను చూశాను, కానీ... కానీ... ఈ అమ్మను రోజూ చూస్తున్నాను వదినా"

"ఈ వదిన నీకు గుర్తుండేది పెళ్ళయ్యేవరకే... తర్వాత నువ్వు, నీ భార్య, నీ పిల్లలు, నీ సంసారం"

"నిన్ను వదిలిపెట్టి నేను ఎక్కడికీ వెళ్లను వదినా. ప్రామిస్. నాకు నువ్వు, అన్నయ్య, కార్తీక్, కావ్య... మీరంతా కావాలి" అన్నాడు గారాలుపోతూ.

ఆరోజు అగమ్య తన అనారోగ్యాన్ని కూడా మరిచిపోయింది. తనే స్వయంగా రెండు స్వీట్లు, హాటు చేసింది.

మరిదికి దగ్గరుండి కొసరి కొసరి వడ్డించింది.



"ఏమిటి మీరనేది?" అగమ్య గొంతులోనుంచి మాటలు రావటంలేదు.

"బాగా ఆలోచించే చెబుతున్నానమ్మా... సుందర్ నాకు నచ్చాడు,మా అమ్మాయికి నచ్చాడు. సుందర్‌కి పోస్టింగ్ వేయించింది నేనే...ఆ విషయం మీకు అతను చెప్పకపోవచ్చు

అది వదిలేయండి. సూటిగా అసలు విషయం చెబుతున్నాను. నా కూతురు హేమను మీ సుందర్‌కు ఇవ్వాలని అనుకుంటున్నాను. అదీ మీ సుందర్ ఇల్లరికం

ఒప్పుకుంటే... నాకున్నది ఒక్కతే కూతురు. నా తదనంతరం ఆస్తి కూడా సుందర్‌కే దక్కుతుంది. బాగా ఆలోచించుకోండి" అని స్పష్టంగా తన అభిప్రాయం చెప్పాడు రఘుపతి.

"సుందర్ మమ్మల్ని వదిలి వెళ్ళడం జీర్ణించుకోలేకపోతున్నాం" ఆమె మాటలు చాలా బలహీనంగా వున్నాయి.

"నేను నా కూతుర్ని వదిలి వుండలేనమ్మా. నా భార్య నా కూతురిని కని కన్ను మూసింది. అప్పట్నించీ తనే ప్రాణంగా బతుకుతున్నాను. అందుకే ఈ కండీషన్... ఒకవిధంగా రిక్వెస్ట్ అనుకోండి" అన్నాడు రఘుపతి.

అగమ్య భర్తవంక చూసింది.

అతను అభావంగా వున్నాడు. ఏభావమూ అతన్నుంచి బయటకు రావటం లేదు.

"ఏవండీ...మీరేమంటారు?" అడిగింది అగమ్య భర్తను.

"వాడిష్టం...వాడి భవిష్యత్తు" అన్నాడు ఒకేముక్కలో తేల్చిచెబుతూ.

అప్పుడే సుందర్ వచ్చాడు. సుందర్ అభిప్రాయం కూడా కనుక్కుంది అగమ్య.

"నేనసలు ఒప్పుకోనీప్రపోజల్‌కు. ఇల్లరికం వుండడం నాకిష్టంలేదు. పైగా నేను వదినను వదిలి వుండను" అన్నాడు వదిన దగ్గరకు వెళ్ళి.

అగమ్య ఆలోచనలో పడింది.

ఒకవిధంగా ఇది సుందర్‌కు చాలా మంచి అవకాశం. ఇలాంటి అవకాశం మళ్ళీ రాదు. తాము జీవితపు చివరిదశలో వున్నవాళ్ళం. సుందర్ ఎదిగే తొలిదశలో వున్నాడు.

అతని భవిష్యత్తు బావుండాలంటే ఈ ఇల్లరికానికి ఒప్పుకోవాలి.

అగమ్య సుందర్‌ని ఒప్పించింది, అతి కష్టమ్మీద. చిన్నపిల్లాడిలా ఏడ్చాడు సుందర్.

వాళ్ళ పెళ్ళికి ముహూర్తం నిశ్చయమైంది.

సుందరే వెనకవుండి తనక్కాబోయే మామ రఘుపతితో ఈ డ్రామా ఆడించాడని, ఈ ఇంటినుంచి శాశ్వతంగా వెళ్ళిపోవడానికే నిశ్చయించుకున్నాడని అగమ్యకు తెలియదు.

తెలిస్తే ఆ తల్లి గుండె పగిలి చచ్చేది.

★ ★ ★

సుందర్ పెళ్ళయింది.

అతను ఇల్లరికం వెళ్ళిపోయాడు.

పెద్ద బంగ్లా, కారు, మందీ మార్బలం... అతనిప్పుడో గొప్పింటి అల్లుడు.

అగమ్య మనసు శూన్యంగా అనిపించింది. ఒక్కొక్కరు... ఒక్కొక్కరుగా నిష్క్రమిస్తున్నారా?

ఆడించి, లాలించి, లాలిపోసి, జోలపాడి దగ్గరకు తీసుకొని నిద్రపుచ్చిన తన చిన్నారులు తనను విడిచి, తన గూడు విడిచి, రెక్కలొచ్చి వెళ్ళిపోయారా?

అగమ్య ఫీలింగ్స్ గమనిస్తోన్న పాణిగ్రాహిలో ఏ భావమూ కనిపించడంలేదు. అదే అతని ప్రత్యేకత.

★ ★ ★

ఆరోజు ఆదివారం...

అగమ్య వంటింటిపని త్వరత్వరగా పూర్తి చేసింది. రాత్రంతా మేలుకొని సున్నుండలు చేసింది కావ్యకు, కార్తీక్‌కు ఇష్టమని.

అర్ధరాత్రి తర్వాత కూడా మెలకువగా వుండి లడ్డూలు తయారుచేసింది.

అఖిలకు, సుందర్‌కు అవంటే చాలా ఇష్టం. చిన్నప్పుడు తను తన మొదటి సంపాదనతో తెచ్చిన లడ్డూలు గుర్తొచ్చాయి.

వాటిని ఎంత ప్రేమగా తిన్నారు. ఆ దృశ్యం కళ్ళముందు కదలాడి, కంటతడి పెట్టించింది. చిన్నప్పటి జ్ఞాపకాలు, ఇంకా తన మదిలో, తన గుండెగదిలో ఎంత పది

లంగా వున్నాయి.

రెండు డబ్బాల్లో ప్యాక్‌చేసింది.

ఒకటి అఖిలకోసం.

మరొకటి సుందర్‌కోసం.

ఈమధ్య వాళ్ళిద్దర్నీ కలవడం కుదరడం లేదు.

సుందర్ ఎప్పుడూ ఏదో బిజీగా వుంటున్నాడు సుందర్ దగ్గరికి వెళ్దామని ఎప్పుడు ఫోన్‌చేసినా హేమనే ఎత్తుతోంది.

తను ఇప్పుడే బయటకు వెళ్ళాడనో, నిన్ననే చెన్నయ్ వెళ్ళాడనో ఆన్సర్ వస్తుంది. కనీసం మీరు రండక్కయ్యా అని హేమ అని వుంటే వెళ్ళేదేమో.

ఇదంతా సుందర్ చేస్తున్నాడని, అగమ్య రాకను ఎవాయిడ్ చేయడానికే ఈ ఎత్తుగడ అని తెలియదు అగమ్యకు.

ఓరోజు హేమ అడిగింది భర్తను.

"అదేమిటండీ అక్కయ్యకు మీరుండి కూడా లేరని చెప్పిస్తారు. ఏంబావుంటుందని"

సుందర్ నవ్వి "పిచ్చిదానా... నీకేం తెలియదు నువ్వూర్కో" అన్నాడు.

భర్త స్వభావం మెల్లమెల్లగా అర్థమవుతూ వుంది హేమకు. అయినా ఆమె ఈ విషయంలో భర్తని కాదని ఏంచేయగలదు.

★ ★ ★

ఆరోజు రాత్రి పడగ్గదిలో, ఆ భార్యాభర్తలమధ్య సంభాషణ జరిగింది ఘాటుగా.

"మీ పద్ధతేం నచ్చడంలేదండీ. ఆవిడ మీకు వదిన మాత్రమే కాదు, అమ్మ కూడా. మన పెళ్ళి దగ్గరుండి జరిపించింది. నన్నెప్పుడూ స్వంత కూతురిలా చూసుకొని మాట్లాడుతుంది" అంది హేమ.

"అబ్బబ్బ... నీకెన్నిసార్లు చెప్పాలి. ఆ టాపిక్ వద్దని" విసుక్కున్నాడు సుందర్.

"చూడండి... ఎక్కడో చదివాను, ప్రపంచంలో కృతజ్ఞతకు మించిన గొప్ప సంపద మరొకటిలేదట. మీరే మన పెళ్ళికి ముందు ఎన్నోసార్లు అన్నారు వదిన మీకోసం ఎన్నో త్యాగాలు చేసిందని. అలాంటి వదినతో మనసు విప్పి మాట్లాడితే తప్పేమిటి?" అంది హేమ.

"మాటలతో మొదలై, వ్యవహారం మనీవరకు వెళ్తుంది. పొరపాటున వదిన మనీ సంగతి తీసిందనుకో"

"చాల్లెండి... అందరూ మీలా డబ్బు గురించే ఆలోచిస్తారని అనుకోవడం మీ భ్రమ. అయినా ఆవిడకు మనం ఏం చేసినా రుణం తీరదు" స్థిరంగా అంది.

"ఎవరికేం చేయాలో నాకు తెలుసు" సుందర్ చికాగ్గా అన్నాడు.

"అవునవును, తెల్సు బాగా తెలుసు. ఆమధ్య మీ అన్నయ్య కొడుకు బాబాయ్... అని పిలుస్తోన్నా వినిపించుకోకుండా కారు డ్రైవ్‌చేస్తూ వెళ్ళారు కదూ"

వెంటనే తడబడి "ఎప్పుడు... నేనెప్పుడూ అలా చేయలేదు" అన్నాడు.

"బుకాయించకండి. ఆరోజు ఖర్మకాలి నేను మీ పక్కనే వున్నాను. అప్పటికే అతను బాబాయ్, బాబాయ్ అని పిలుస్తూనే వున్నాడు. నా మనసు చివుక్కుమంది"

"ఇలా బాధపడుతూపోతే మనకు చిప్పే మిగులుతుంది"

"ఛ, ఛ... అనుబంధాలను డబ్బుతో తూచేవాళ్ళని మిమ్మల్నే చూస్తున్నాను. ఎందుకండీ మనకు ఇంత డబ్బు వుంది. మీ వదినే పూనుకోకపోతే మనపెళ్ళి జరిగేదేనా?"

"అయితే ఏం చేయమంటావు? వదిన పాదాలమీద పడి కాళ్లు కడగమంటావా?"

"కాదు... ఆవిడ తల్లిలా పెంచినందుకు కనీసం ఓ మనిషిగా రుణం తీర్చుకోమంటాను"

"తీర్చుకుంటాన్లే ఆవిడికిప్పుడు బోల్డు రుణాలు అదే అప్పులు వున్నాయి. మనం కొడుగ్గా రుణం తీర్చుకుంటామని చెబితే




అబ్బే... వద్దులే... నా అప్పుల రుణం తీర్చు మంటుంది"

"మనుష్యుల గురించి ఎంత నీచంగా, హీనంగా వూహించుకుంటారండీ. అందరూ మీలా అవకాశవాదులు వుంటారని అనుకో కండి. అగమ్యగారి వ్యక్తిత్వం అందరికీ తెలుసు.

ఈ ప్రపంచంలో తల్లిదండ్రులే ఒక్కోసారి పరిస్థితులవల్ల పిల్లలను గాలికి వదిలేస్తు న్నారు. కానీ ఆవిడ, తన పిల్లలతో సమా నంగా చూసుకుంది. అందుకు మీరు తీర్చు కునే రుణం ఇదేనా?

మీరు వ్యక్తంచేసే కృతజ్ఞత ఇదేనా? మనకు దేనికీలోటులేదు. పెళ్ళయ్యాక వది నను మనస్ఫూర్తిగా పలకరించారా? మానవ సంబంధాలను పూర్తిగా... పూర్తిగా ఆర్థిక సంబంధాలుగా మార్చకండి.

ఆవిడ మొహం చూడాలంటే నాకు గిల్టీగా వుంటుంది. నేనే తప్పుచేసినట్టు ఫీలవు తాను" అంది హేమ.

"చూడు హేమా, నువ్వు ఏదీ ఎక్కువగా ఆలోచించకు. నాకు వదినంటే ప్రేమ వుంది. కానీ ఆ ప్రేమను ప్రదర్శించి లేని పోని ఇబ్బందులు తెచ్చిపెట్టుకోను.

కార్తీక్, కావ్యలకు ఏదైనా సాయం చేయ మని వాళ్ళు అడిగితే.. అనవసరంగా మనం ఇబ్బందులను కొని తెచ్చుకోవడం నాకిష్టం లేదు. ఈ టాపిక్‌ని ఇంతటితో వదిలేయ్" అన్నాడు అటు తిరిగి పడుకుంటూ.

హేమకు చాలా బాధేసింది.

భర్తలో ఇంతటి స్వార్థపరుడు వున్నాడని ఊహించలేదు.

స్వార్థం, మన బాగుకోసం అయితే ఫర్లేదు. కానీ, స్వార్థం ఎదుటి మనిషిపట్ల కృతజ్ఞతను చంపేస్తే...

భర్తమీద ఆమెకు మొదటిసారిగా అసహ్యం కలిగింది.

మానవ విలువలకన్నా, ఆర్థిక విలువలే గొప్ప అని నమ్మిన ఓ డబ్బు మనిషిని తన భర్తగా చేసుకున్నందుకు మొదటిసారిగా ఫీలయింది.

అగమ్య పట్ల హేమకు గౌరవం రెట్టింప యింది.

★ ★ ★

అగమ్య మూడు ప్లేట్లలో సున్నివుండలు, కారప్పూస పెట్టుకొని హాలులోకి వెళ్ళి భర్తకు ఒకటిచ్చింది.

కామ్‌గా ఓ బుక్ చదువుతూ కూచు న్నాడు. సున్నివుండలప్లేటు చూసి తీసుకు న్నాడు.

రెండు ప్లేట్లు పిల్లల గదిలోకి తీసుకె ళ్లింది. లోపల్నుంచి పిల్లల సంభాషణ విని పిస్తోంది.

"ఒరే అన్నయ్యా, నీ ఇంజనీరింగ్ అయి పోయిందిగా... బుద్ధిగా పెళ్ళిచేసుకో. సుందర్ బాబాయిలా ఇల్లరికం మాత్రం వెళ్ళకురోయ్" అది కావ్య గొంతు.

"సుందర్ బాబాయ్ అదృష్టవంతుడు. హాయిగా డబ్బున్న అమ్మాయి దొరికింది. ఇక్కడ వున్నన్నాళ్ళూ మమ్మీ చూసుకుంది.

ఇప్పుడు మనతో పని తీరిపోయిందిగా. బాబాయే కావాలని నాటకమాడి ఇల్లరికం వెళ్ళిపోయాడు" అది కార్తీక్ గొంతు.

"ఛ... సుందర్ బాబాయ్ అలా చేస్తాడం టావా? "

"నీకేం తెలియదే... నువ్వు చిన్నపిల్లవు"

"నీకన్నా మహ అయితే ఓ పదినిము షాలు చిన్నదాన్ని కావచ్చు. కాబోయే డాక్టర్ని... అయినా సుందర్ బాబాయ్ మీద నీకా డౌటెందుకొచ్చిందిరా" కావ్య అడు గుతోంది.

"డౌట్‌కాదు, నిజం. సుందర్ బాబాయే కాదు, అఖిలత్తయ్య కూడా అలాంటిదే. నువ్వు బాగా అబ్జర్వ్ చేశావా? పెళ్ళయిన ప్పట్నుంచీ అఖిలత్తయ్య మనింటికి రావడం లేదు. పోనీ మనల్ని ఎప్పుడైనా ఇన్వైయిట్ చేసిందా?

మనం పొరపాటున ఫస్టన వెళ్తే ఎక్కడ పార్టీ అడుగుతామోనని బయటకు వెళ్ళడానికి రెడీ అయ్యామని ఓ కట్టుకథ చెబుతుంది.

సుందర్ బాబాయ్ కూడా అంతే. కనీసం పెళ్ళయ్యాక ఒక్కసారైనా వచ్చాడా? ఆమధ్య నాకోసారి హోటల్ దగ్గర కనపడ్డాడు.

నేను బాబాయ్ అని పిలుస్తుంటే వినిపించుకోకుండా కారులో వెళ్ళిపోయాడు. పొగరు... రేపు నేను కారుకొన్నాక చెబుతా"

అగమ్య వాళ్ళ మాటలు వింటూ అలానే వుండిపోయింది. ఆమె మనసంతా బరువుగా మారిపోయింది.

పిల్లల మనసులో ఇలాంటి ఆలోచనలు బలపడిపోయాయా?

అఖిల, సుందర్‌లు నిజంగా అలా ప్రవర్తిస్తున్నారా? తన పెంపకంలో వాళ్ళు అలా తయారయ్యారా?

అలా అనుకోవడానికి ఆమె సంస్కారం అడ్డొస్తోంది.

తల్లి అడుగుల శబ్దం విని ఇద్దరూ కామ్ అయిపోయారు.

★ ★ ★

అఖిల ఇంటికి వెళ్ళేసరికి అఖిల, వివేక్ ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటున్నారు. గృహ ప్రవేశానికి కూడా పిలవలేదు.

అసలు అలాంటి ఫార్మాలిటీస్ పెట్టుకోలేదని, అనుకోకుండా ఫ్లాట్ కొన్నామని చెప్పింది.

అఖిల చెప్పాపెట్టకుండా ఇల్లు ఖాళీ చేసింది. అఖిల కోసం అగమ్య ఆ ఇంటికి వెళ్ళినప్పుడు, ఆ ఇంటి ఓనర్ వాళ్ళు ఫ్లాటు కొనుక్కున్నారని అందులోకి వెళ్ళారని చెప్పాడు.

ఆ అడ్రస్ తనకు కూడా తెలియదని చెప్పాడు. అఖిల మాటమాత్రమైనా తనకు చెప్పకపోవడంతో నొచ్చుకుంది అగమ్య.

దారిలో వివేక్ ఎదురయ్యాడు. అగమ్యను చూసి ఆప్యాయంగా పలకరించి ఇంటికి తీసుకువెళ్ళాడు.

వదినను సడన్‌గా చూసేసరికి షాక్ అయింది అఖిల. భర్తవైపు కోపంగా చూపింది. అంతలోనే సర్దుకొని అనుకోకుండా ఇల్లు మారాల్సివచ్చిందని చెప్పింది.

భర్త తాము ఫ్లాట్ కొన్న విషయం చెప్పాడని తెలియడంతో ఏంచేయాలో తోచక అసలు నిజం చెప్పేసింది. అనుకోకుండా ఇన్‌స్టాల్‌మెంట్‌లో అతిచౌకగా వస్తే తీసుకున్నామని, ఇంకా ఫస్ట్ ఇన్‌స్టాల్‌మెంట్ కూడా కట్టలేదని చెప్పింది.

ఆ రాత్రే వివేక్‌తో వాదులాటకు దిగింది.

"మీకసలు కొంచెమయినా లౌక్యముందా? మనం ఫ్లాట్ కొన్నామని తెలిస్తే మన దగ్గర డబ్బు వుందని అనుకోరూ. పైగా తనకివ్వాల్సిన డబ్బు ఇవ్వకుండా ఇల్లు కొన్నామని ఫీలవుతుంది" అంది.

వివేక్‌కు తల పట్టుకోవడం మినహా గత్యంతరం లేకపోయింది.

★ ★ ★

వదినను చూసి మొహాన్ని చేటంత చేసుకొని "రా... వదినా... ఎన్నాళ్ళకు వచ్చావు? ఈ మరదలు ఇప్పుడు గుర్తొచ్చిందా?" అంటూ నిష్టురాలాడుతూ లోపలికి ఆహ్వానించింది.

"ఆరోగ్యం బావుండటం లేదమ్మా" అంది లడ్డుల ప్యాకెట్ అఖిలకిస్తూ.

"లడ్డులు నాకిష్టమని ఇంకా గుర్తుందా వదినా" అంది అఖిల.

"మరిచిపోలేకదమ్మా" అంది అగమ్య.

"ఏంటో వదినా... అలా వస్తావు. ఇలా వెళ్తావు. కనీసం అన్నం తిని వెళ్ళమన్నా వుండవుకదా"

నిజానికి అన్నం తిని వెళ్ళమని ఎప్పుడూ అడగలేదు.

"అన్నం తిని వెళ్తావా వదినా?" అని మాత్రమే అడిగేది.




"పోనీలే అక్కయ్యా ఇప్పుడు తిని వెళ్తుంది. అంతేకాదు... ఈరోజు ఇక్కడే వుంటుంది. బావగారికి నేను స్వయంగా వెళ్లి చెప్పొస్తాను" అన్నాడు వివేక్.

"మీరూర్కోండి, వదిన సంగతి నాకు తెలి యదా? అన్నయ్యను వదిలి ఒక్కక్షణం వుండదు" అంది అఖిల.

"అవునవునమ్మా" అంది అగమ్య.

ప్రశ్న, జవాబు... అన్నీ తనే చెబుతున్న మరదలి వంక చూసి ఎందుకో అక్కడ వుండబుద్ధికాలేదు.

గుమ్మంవరకూ వచ్చి "అయ్యో వదినా... గ్యాస్ ఆఫ్ చేయడం మర్చిపోయా" అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

"ఫర్లేదులేమ్మా. నేను వెళ్తాను" అంది అగమ్య.

ఇంకాసేపు వెళ్ళేముందు వుంటే డబ్బు ప్రస్తావన ఎక్కడ తీస్తుందోనని అఖిల భయం.

కనీసం వదినకు ఎప్పుడూ బొట్టుపెట్టి, చీరపెట్టి ఎరగదు అఖిల.

అదీ ఆమె సంస్కారం.

రెండు బస్సులు మారి గోల్డెన్‌హిల్స్‌కు చేరేటప్పటికి ఒళ్ళు హూనం అయినట్టు అనిపించింది అగమ్యకు.

కార్లు తప్ప బస్సులు, ఆటోలు ఈ ఏరియాలో తక్కువ. పోష్ లోకాల్టీ.

పెద్ద బిల్డింగ్. గేటు దగ్గర వాచ్‌మెన్ వున్నాడు. అతను అగమ్యను గుర్తుపట్టి గేటు తీశాడు.

★ ★ ★

అగమ్య ఇంటికి వచ్చేసరికి చాలా పొద్దు పోయింది.

కనీసం ఇంత రాత్రయింది కదానని పాణిగ్రాహి కంగారుపడినట్టు కూడా కనిపిం చడంలేదు. హాయిగా నిద్రపోతున్నాడు.

పిల్లలిద్దరూ టీవీ చూస్తున్నారు.

అగమ్య తన గదిలోకి వెళ్ళింది. కుర్చీలో కూర్చుంది. అన్నం కూడా తినాలనిపించడం లేదు.

తను సుందర్ ఇంటికి వెళ్ళి పొరపాటు చేసిందా?

తను సుందర్ ఇంటికి వెళ్ళినప్పుడు సుందర్ మొహంలో సంతోషం కనిపించ లేదు. ఏదో మొహమాటానికి పలకరించిన ట్టుగా మాట్లాడుతున్నట్టుగా అనిపించింది.

హేమే అక్కయ్యా భోంచేసి వెళ్ళండని బలవంతపెట్టింది. తనకే తిన బుద్ధేయ లేదు.

లడ్డుల ప్యాకెట్ సుందర్‌కు ఇచ్చినప్పుడు "లడ్డులా వదినా... డాక్టర్ స్వీట్స్ ఎక్కువ తినొద్దని చెప్పాడు" అంటూ తనముందే టేబుల్‌మీద పెట్టాడు.

కనీసం తన కోసం ఒక లడ్డు అయినా తినొచ్చుగా.

తను ఇంటికి వెళ్తానంటే "కారులో డ్రాప్ చేద్దామంటే, సమయానికి డ్రైవర్ లేడు. నేను ఓ ఇంపార్టెంట్ ఫోన్ కాల్‌ని రిసీవ్ చేసుకోవాలి. పోనీ ఆటోలో పంపించనా వదినా" అని అడిగాడు.

మరింకేమీ మాట్లాడకుండా వెనుతిరిగి బస్సులో వచ్చింది అగమ్య.

ఏమిటిలా జరుగుతోంది. లోపం ఎక్క డుంది? తన పెంపకంలోనా?

బాధగా నుదురుమీద రెండు చేతులతో నొక్కుకుంది.

అరగంట తర్వాత కిచెన్‌రూమ్‌లో సింక్‌లో వున్న వంటపాత్రలు కడిగి, కిచెన్ రూమ్‌ని నీట్‌గా చేసి బెడ్రూమ్‌లోకి నడి చింది.

మంచానికి ఓ చివర పడుకుంది.

'ఏమైంది అగమ్యా' అని భర్త ఒక్కమాట అడిగితే అతని గుండెల్లో తలపెట్టి వెక్కి వెక్కి ఏడ్చి తన బాధ వెళ్ళగ్రక్కాలని వుంది అగమ్యకి.

తన మనసులోని విషాదం కరిగి కన్నీరై పోవాలంటే తను బరస్టవ్వాలి. తన మనసు లోని బాధను కరిగించాలి.

పాణిగ్రాహి గుర్రుపెడుతూ నిద్రపోతు న్నాడు. ఆమె చెక్కిళ్ళమీదుగా కన్నీళ్లు జారి పోతూ నేలమీద పడి తమనుతాము ఆత్మా ర్పణ చేసుకుంటున్నాయి.

★ ★ ★

"వీఆర్ఎస్ తీసుకోవడం మినహా వేరే గత్యంతరం లేదు అగమ్యా" అన్నాడు పాణి గ్రాహి.

బ్యాంకులో పాణిగ్రాహి తీసుకున్న లోన్లు ఎక్కువగానే వున్నాయి. అఖిల పెళ్ళికి; సుందర్ చదువుకూ, కార్తీక్, కావ్యల చదు వులకు కొంత బయట అప్పు చేయాల్సివ చ్చింది.

వాటికి వడ్డీలు కడుతూపోవడం, ఆ వడ్డీలు పెరిగిపోవడంవల్ల ఆర్థిక ఇబ్బం దులు మొదలయ్యాయి.

"కార్తీక్‌కు రేపో మాపో జాబ్ రావడం గ్యారంటీ. వాడివల్ల మన సమస్యలు కొన్న యినా తీరిపోతాయేమో" అంది అగమ్య.

పాణిగ్రాహి బదులివ్వలేదు.

అగమ్య ఆలోచనలో పడిపోయింది.

రెండ్రోజుల క్రితమే కావ్యకు ఓ మ్యాచ్ వచ్చింది. అబ్బాయి స్టేట్స్‌లో వుంటాడు. పైగా డాక్టర్. మంచి సంపాదన. కావ్య అతనికి నచ్చింది. వచ్చిన పేచీ ఏమిటంటే, అబ్బాయి పేరెంట్స్ నాలుగు లక్షలు కట్నం అడుగుతున్నారు.

"ఇది సాధ్యమయ్యే పనేనా? నాలుగు లక్షలు అంటే మాటలా?" అన్నాడు పాణి గ్రాహి.

"మొన్న ఆదినారాయణగారు ఓ మ్యాచ్ గురించి చెప్పారు. విజయవాడలో ధనంజ యగారనే మంచి బిజినెస్‌మేన్. వాళ్ళ అమ్మాయిని కార్తీక్‌కు ఇవ్వడానికి సుము ఖంగా వున్నారట. కట్నం కూడా భారీగా ఇస్తారట.

హోదా, కట్నం కోసమని కాదుగానీ, అమ్మాయి చాలా బావుంటుంది. పైగా పోస్ట్‌గ్రాడ్యుయేట్. కార్తీక్‌కు చక్కని జోడీ. కార్తీక్‌కు వచ్చే కట్నం డబ్బుతో కావ్య పెళ్ళి చేస్తే సరి.

మీకొచ్చే జీతం మనిద్దరికీ సరిపోతుంది. ఇక ఈ అప్పులంటారా? కార్తీక్ ఏదోవి ధంగా మనకు హెల్ప్ చేయకపోడు" అలా అంటున్నప్పుడు అగమ్య గొంతు వణికింది.

పాణిగ్రాహి మాత్రం మౌనంగా వుండిపో యాడు.

ఇది జరిగిన మరుసటిరోజు పిడుగు లాంటి వార్త చెప్పాడు కార్తీక్.

★ ★ ★

"మమ్మీ నీకో గుడ్‌న్యూస్ చెప్పాలి" అన్నాడు దోశలు వేస్తోన్న తల్లి దగ్గరికి వచ్చి కార్తీక్.

"శుభవార్త... ఏమిటది?" అడిగింది దోసెని ఎర్రగా కాలుస్తూ.

"నాకు స్టేట్స్ వెళ్ళే అవకాశం వచ్చింది" అన్నాడు ఉత్సాహంగా కార్తీక్.

"నిజ్జంగా? కంగ్రాట్స్‌రా" దోసె వేయడం ఆపి, కొడుక్కి షేక్ హ్యాండిస్తూ మనస్ఫూ ర్తిగా అంది అగమ్య.

"థాంక్యూ మమ్మీ... కాకపోతే చిన్న లిటి గేషన్"

"ఏంటీ"

"స్టేట్స్‌లో సూర్యనారాయణమూర్తిగారని ప్రొఫెసర్... వాళ్ళమ్మాయి అక్కడే కంప్యూ టర్ ఇంజనీర్‌గా చేస్తోంది. ఆ అమ్మాయిని చేసుకుంటే అక్కడే నాకు మంచి జాబ్ చూస్తాడట"

"ఓహో అలాగా" అంది అగమ్య అన్యమ నస్కంగా.

"మంచి ఆఫర్ మమ్మీ! కాకపోతే ఆయన కట్నంలాంటిది ఇవ్వడు. అంతకన్నా మంచి ఆఫర్ ఇస్తున్నాడు. నేను స్టేట్స్‌లో వుండే అవకాశం కలుగజేస్తున్నాడు.

"నీకు తెలుసుగా మమ్మీ... స్టేట్స్ వెళ్ళా లని అక్కడే ఇంజనీర్‌గా సెటిలవ్వాలన్నది నా యాంబిషన్ అని. ఇంత మంచి ఆఫ




# ఏరినముత్యాలు

☆ జీవితంలో మనకిష్టమైనవి లభించకపోతే, లభించినవాటితోనే మనం ఇష్టపడి బతకాలి.

– శ్రీ గణపతి సచ్చిదానందస్వామి

☆ అనిత్యమైన విషయాలకొరకు కాలాన్ని వృథా చేయకండి, మన జీవితకాలం చాలా స్వల్పమైనది, అల్పమైనది.

– శ్రీ శంకరాచార్యులు

☆ అంతరంగం అందంగా ఉంటే ఆచరణ అర్థవంతంగా ఉంటుంది.

– సోక్రటీస్

☆ అబద్ధాలు చెబుతూ బతికేకంటే మూగవానిగా ఉండటం మేలు, పితూరీలు చెబుతూ బతికేకంటే చావడం మేలు, ఇతరులను మోసగించి బతికేకంటే భిక్షమెత్తుకుని బతకడం మేలు.

– పంచతంత్రం

☆ ఆశకు తృప్తి ఉండదు, అవధులు లేవు, అవసరాలు మనిషిని బంధించవు, ఆశలే మనిషిని బంధిస్తాయి జాగ్రత్త.

– సుందరచైతన్యానంద స్వామి

☆ ఆలోచనాదారిద్ర్యం నుండే పాపచింతన పుట్టుకొస్తుంది.

– హుడ్

☆ అసలు ప్రేమంటే ఏమిటో తెలియని మనసుందంటే అది మనసుకాదు, ప్రేతభూమి.

– కబీరు

☆ ఆదాయం కన్నా ఖర్చు తక్కువ పెట్టడం తెలుసుకున్నవాడు ఎప్పుడూ పేదవాడు కాడు.

– రస్కిన్

☆ అహింసను రక్షించడానికి హింసకు పాల్పడినప్పటికీ అది అహింసే అవుతుంది.

– ప్రాచీనశాస్త్రసూక్తి

☆ అతివాదనలో న్యాయం ఎప్పుడూ ఉండదు.

– టాన్‌క్రెడ్

☆ అందరితో మర్యాదగా మాట్లాడాలి, కానీ సన్నిహితంగా కొందరితోనే ఉండాలి.

– ధర్మసూత్రాలు

☆ అవిద్య, రాగం, ద్వేషం, భ్రాంతి, మోహం అన్న ఐదే మానవ దుఃఖానికి కారణాలు.

– యోగదర్శనం

సేకరణ: జానీబాషా

ర్ట్యునిటీ మళ్ళా దొరకదు. అందుకే నేను వెంటనే సరే అనేశాను" చివరి మాట చెప్పి తల దించుకున్నాడు.

కొడుకు మొహంలోకి చూసింది.

తన నిర్ణయం అడగడానికి రాలేదు. తను కన్‌ఫర్మ్ చేసుకున్న విషయం ఇనఫర్మేషన్ ఇవ్వడానికి వచ్చాడు. ఆల్రెడీ తన సంబంధం తనే చూసుకున్నాడు.

కనీసం తల్లినిగానీ, తండ్రినిగానీ సంప్ర దించకుండానే!

"నా నిర్ణయం కరెక్టే కదు మమ్మీ" అన్నాడు కార్తీక్.

"దోసె మాడిపోయిందిరా..." అంటూ మాడిపోయిన దోసెని తీసి సింక్‌లో వేసింది.

అప్పటిదాకా వాళ్ళ మాటలు వింటోన్న కావ్య సుడిగాలిలా వచ్చింది.

"ఎవర్నడిగి ఈ మ్యాచ్ ఫిక్స్ చేసుకు న్నావ్" అంటూ గయ్యిమంది.

"నా పెళ్ళి... నా స్వవిషయం... అయినా మమ్మీ ఏమనడం లేదు. నాకన్నా చిన్నదానివి నీకెందుకే ఇంత ఉక్రోషం"

"నీ మానాన నువ్వు సంబంధం చూసుకో వడమేనా... నా సంబంధాన్ని నేను చూసు కున్నానా? అయినా నీ డౌరీతో నా మ్యారేజ్ చేద్దామనుకున్నారు. మంచి మ్యాచ్ స్టేట్స్‌లో వుండే అవకాశం తెలుసా..."

"అంటే నువ్వు స్టేట్స్‌లో వుండే అవకాశం వచ్చిందని నేను ఇండియాలో వుండే సంబంధం చేసుకోవాలా? నెవర్... నాకు మంచి అవకాశం. స్టేట్స్ అవకాశం. నేనెలా మిస్ చేసుకుంటాను?"

"అంటే... నాకు మంచి మ్యాచ్ వస్తే నువ్వు దాన్ని చెడగొడ్తావా?"

"అంటే నీ కోసం నేను మంచి మ్యాచ్‌ని మిస్సవ్వాలా?"

అగమ్య అలానే నిలబడిపోయింది.





తరం మారడంతో ఎంత అంతరం వచ్చింది. కనీసం తల్లి వుందన్న ఆలోచన లేకుండా తమ పెళ్ళిళ్ల గురించి ఎలా గొడవ పడుతున్నారు.

ఆమె మాటలురాని చిత్తరువు అయింది. అంతకన్న ఆమెను దిగ్భ్రమకు గురిచేస్తోన్న విషయం, ఇంత జరుగుతోన్నా భర్త ఈ విషయంలో జోక్యం చేసుకోకపోవడం... కనీసం ఏమి జరుగుతోందని అడగకపో వడం...

★ ★ ★

అగమ్యకు ఎటూ పాలుపోవడం లేదు. ఓ పది నిమిషాలపాటు ఇద్దరూ వాదులా డుకుని మొహం మాడ్చుకున్నారు.

ఇద్దరూ టిఫిన్ చేయలేదు.

పాణిగ్రాహి మాత్రం టిఫిన్ చేసి బ్యాంకుకు వెళ్లిపోయాడు.

టిఫిన్ కూడా చేయాలి అనిపించలేదు. ఆ రోజంతా ఆలోచిస్తూనే వుంది అగమ్య.

పిల్లలు కూడా అన్నం తినలేదు. ఎవరి పట్టుదలతో వాళ్లున్నారు.

సాయంత్రం వేళ ఓ నిశ్చయానికి వచ్చింది.

పిల్లలిద్దర్నీ పిలిచింది.

"మీ ఇద్దరికీ మీరు కోరుకున్న వాళ్లతోనే పెళ్లిళ్లు జరుగుతాయి. ఇద్దరూ స్టేట్స్‌లోనే సెటిలవుతారు. సరేనా? హేపీగా వుండండి.

ఒకే తల్లి కడుపున కొద్దిపాటి తేడాతో పుట్టిన మీరిద్దరూ ఇలా పోట్లాడుకోవడం ఏమైనా బావుందా? ఇద్దరూ కలిసి భోంచే యండి. మీ పెళ్లిళ్లు మీకు ఇష్టమైన వాళ్ల తోనే జరుగుతాయి. దిసీజ్ మదర్ ప్రామిస్" అంది అగమ్య.

ఇద్దరి మొహాలూ విప్పారాయి. వెంటనే ఇద్దరూ కలిసిపోయి అన్నం తిన్నారు.

★ ★ ★

"మీరు వీ.ఆర్.ఎస్. తీసుకోక తప్పదు" అంది అగమ్య.

'అలాగా' అన్నట్టు చూశాడు పాణిగ్రాహి.

ఉదయం నుంచి ఇంట్లో జరిగిన విషయాలన్నీ చెప్పింది.

"వీ.ఆర్.ఎస్.తో వచ్చిన డబ్బుతో కావ్య పెళ్లి చేద్దాం. కార్తీక్ కూడా అమెరికా మ్యాచ్ ఫిక్స్ చేసుకున్నాడు. వాళ్లకు నచ్చిన వాళ్లతో వాళ్ల పెళ్లి చేసి మన గౌరవం నిలబెట్టుకుందాం. మిగతా డబ్బుతో అప్పు తీర్చేద్దాం" చెప్పింది అగమ్య.

"చాలా బావుంది. కానీ, నీ భవిష్యత్తు ఏమిటి? ఆడపడుచుకోసం, మరిది కోసం, కూతురికోసం, కొడుకుకోసం... అన్నీ చేశావు. ఇంకా చేస్తున్నావు. నా తదనంతరం నీ ఫ్యూచర్ సంగతేంటి? కనీసం వీ.ఆర్.ఎస్. డబ్బులైనా నీ పేరుతో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేద్దామని అనుకున్నాను" అన్నాడు.

"మీరు వున్నంతవరకు నాకు ఇంకేమీ అక్కర్లేదు. మన పిల్లల భవిష్యత్తు బావుంటే చాలు" అంది అగమ్య.

చాలా ఏళ్ల తర్వాత నీ భవిష్యత్తు ఏమిటని అడిగిన భర్త మాటలు ఆమెను ఒకవిధమైన ఉద్వేగానికి గురిచేశాయి. ఇప్పుడు ఆలోచించే సమయం లేదు. పిల్లల భవిష్యత్తుకన్నా తనకు ఏదీ ఎక్కువ కాదు.

★ ★ ★

ఒకే ముహూర్తంలో కావ్య, కార్తీక్‌ల పెళ్లి జరిగింది. అఖిల, సుందర్‌లు మొక్కుబడిగా వచ్చి వెళ్లారు. ఖరీదైన గిఫ్టులు కూడా తీసుకురాలేదు.

వాళ్లు వస్తే చాలని అనుకుంది అగమ్య. అనారోగ్యాన్ని సైతం లెక్కచేయకుండా అగమ్య అన్ని పనులూ చేసేసింది ఓ యంత్రంలా.

సంగీత అగమ్యకు హెల్ప్ చేసింది. అఖిల ఒక్కరోజైనా ముందుగా రాలేదు. చుట్టంచూపుగా పెళ్లి జరగడానికి ఓ గంట ముందుగా వచ్చింది.

సుందర్ కూడా అంతే. హేమ వెళ్తానంటే వద్దని వారించాడు.

అయినా అవేమీ పట్టించుకోలేదు అగమ్య.

ఆ ఇంట్లో మరో అధ్యాయం ముగిసిపోయింది.



ఇల్లంతా బోసిగా వుంది.

మనసంతా శూన్యంగా వుంది.

బ్రతుకంతా వెలితిగా అనిపించింది.

భర్త బ్యాంకుకు వెళ్లాడు. అతనిలో ఏ ఫీలింగూ లేదు.

కావ్య, కార్తీక్ స్టేట్స్‌కు వెళ్లిపోయారు. పెళ్లికి ముందే పాస్‌పోర్టు తెచ్చుకున్నారు. వీసా కూడా పెళ్లయిన వెంటనే దొరికింది.

వాళ్లు స్టేట్స్‌కు వెళ్లగానే ఇల్లంతా బోసిగా అనిపించింది.

చూస్తుండగానే ఎన్ని జ్ఞాపకాలు? ! గుండె గదిలో పదిలంగా వుండిపోయాయి. ఎన్ని రోజులు, నెలలు, సంవత్సరాలు... ప్రతి క్షణం ఓ జ్ఞాపకంగా తన మనసులో నిలిచిపోయింది.

ఇదే ఇంట్లో అఖిల ఆడుకుంది. ఇదే ఇంట్లో సుందర్ తనకొంగు పట్టుకు తిరిగాడు. ఈ ఇంట్లోనే కావ్య, కార్తీక్‌లు పుట్టారు. ఇక్కడే వాళ్లు తప్పటడుగులు వేశారు. ఏవీ ఆ మధుర స్మృతులు?

పాణిగ్రాహిలో మాత్రం ఏ ఫీలింగూ కన్పించలేదు. అతను ఎప్పటిలానే సోఫాలో కూచోవడం, ఏదో ఒక పుస్తకం చదువుతూ కూర్చోవడం

వీ.ఆర్.ఎస్. డబ్బుతో కావ్య పెళ్లయిపోయింది. అప్పు కూడా తీరింది.

ఇక తమ ముందున్న సమస్య తాము బ్రతకడం. పాణిగ్రాహిలో మాత్రం ఆ చింత ఏమాత్రం వున్నట్టు కనిపించడంలేదు. అగమ్యే దాని గురించి తల్లడిల్లిపోతోంది.

వారానికోసారి స్టేట్స్‌లో వున్న పిల్లలకు ఫోన్ చేసి మాట్లాడుతోంది. అలాగే వారానికోసారి అఖిలను, సుందర్‌ని చూసి వస్తుంది. వాళ్లు సరైన రెస్పాన్స్ ఇవ్వకపోయినాసరే.

★ ★ ★

రోజులన్నీ ఎప్పుడూ ఒకేలా వుండవు. విషాదాలు, విధివశాత్తూ ఉపద్రవాలూ సంభవిస్తూనే వుంటాయి.

విషాదం ఎప్పుడూ చెప్పిరాదు.

బ్యాంకులో వున్న డబ్బును డ్రా చేయడానికి స్కూటర్‌మీద వెళ్తోన్న పాణిగ్రాహిని లారీ గుద్దేసింది. ఆ లారీ నిండా ఇనుప చువ్వలున్నాయి.

ఇనుపచువ్వలు కాలులోకి దిగబడిపోయాయి. ప్రమాదం తీవ్రస్థాయిలోనే జరిగింది.

లారీ డ్రైవర్ కాస్తా లారీ ఆపకుండా పారిపోయాడు. దారినపోయేవాళ్లు ఆ ఏక్సిడెంట్ చూసి హాస్పిటల్లో చేర్పించారు.

★ ★ ★

ఆపరేషన్ థియేటర్ ముందు దిగాలుగా నిలబడివుంది అగమ్య. ఉదయం నుంచి పచ్చి మంచినీళ్లు కూడా ముట్టలేదు.

భర్తకి ఏక్సిడెంటు జరిగిందని తెలిసిన వెంటనే పరుగు పరుగున వచ్చింది.

సమయానికి సంగీత, ఆదినారాయణలు లేరు. ఏదో పెళ్లికి వెళ్లారు.

అగమ్య ఒక్కతే ఆపరేషన్ థియేటర్ ముందు ఉదయం నుంచీ నిలబడివుంది.

"మీరేనా పేషెంట్ వైఫ్?" అనడిగాడు డాక్టర్.

అవునన్నట్టు తలూపింది అగమ్య.

"ఇంట్లో పెద్దవాళ్లు ఇంకెవరూ లేరా?"

"లేరు డాక్టర్"

"మీ పిల్లలు?"

"పిల్లలు స్టేట్స్‌లో వున్నారు. ముందు విషయం ఏమిటో చెప్పండి డాక్టర్... ఆయన ప్రాణాలకు ప్రమాదమేమీ లేదుగా"

"ఆయన ప్రాణాలకు ప్రమాదం లేదుకానీ ఆయన కాల్లో దిగిన ఇనుపచువ్వలు వెంటనే తీసివేయాలి. మీకు తెలుసుగా, ఇది ప్రైవేట్ హాస్పిటల్... ఆపరేషన్ వెంటనే జరగాలి. అందుకోసం మినిమమ్ యాభైవేలయినా ముందుగా డిపాజిట్ చేయాలి. చాలా కాంప్లికేటెడ్ కేసు. ముందు డబ్బు సర్దే ప్రయత్నంలో వుండండి. మరో రెండు గంటల్లో ఆపరేషన్" చెప్పుకుపోతున్నాడు డాక్టర్.

అగమ్య మిగతా విషయాలు ఏమీ వినడంలేదు. యాభైవేలు అనేదొక్కటే ఆమె చెవుల్లో పదేపదే వినిపిస్తోంది.

"డాక్టర్‌గారూ! నేను ఓ గంటలో వచ్చేస్తాను" అంటూ వింటినుండి సంధించిన బాణంలా దూసుకుపోయింది.

హాస్పిటల్‌నుంచి అఖిల ఇంటికి పావు గంట ప్రయాణం మాత్రమే. పరిగెడితే పది నిమిషాల్లో వెళ్లిపోవచ్చు

ఉదయమే పాణిగ్రాహికి ఏక్సిడెంట్ అయిన విషయం తెలియజేసింది. బహుశా ఆ టైంలో వాళ్లు వుండివుండరేమో అనుకుంది.

అడగాలి. అఖిలను, వివేక్‌లను డబ్బు అడగాలి. ఈ సమయంలో వాళ్లు తప్పకుండా సహాయం చేయగలరు. ఆ ఆశే ఆమెను శ్వాసించేలా చేస్తోంది.

★ ★ ★




"నాకు నీ పద్ధతేం నచ్చలేదు అఖిలా. ఓవైపు మీ అన్నయ్య చావుబతుకుల మధ్య వుంటే, నిన్ను పెంచి, పెద్దచేసి, పెళ్లిచేసి, చివరికి ఏ సంబంధమూ, అనుబంధమూ లేని నాకు ఉద్యోగం ఇప్పించిన మీ వదిన నిస్సహాయస్థితిలో వుంటే నిమ్మకునీరెత్తి నట్టు వుండిపోతావేంటి? " కోపంగా అన్నాడు వివేక్.

"మీరు కాస్త నోరు మూస్తారా? ఇప్పుడు మనం హాస్పిటల్‌కు వెళ్తే, అక్కడ అన్నయ్య పరిస్థితి ఎలా వుంటుందో తెలియదు. ఆ బిల్లు మొత్తం మనమీద పడుతుంది. మనం ఇవ్వాల్సిన డబ్బు అయినా ఇవ్వాల్సి వస్తుంది.

రేపొద్దున్నే మనం వూరెళ్తున్నాం. పక్క ఫ్లాటులో వుండే పిన్నిగారికి చెప్పాను. వది నావాళ్లు వస్తే 'నిన్ననే వూరెళ్లారు, మీ ఆయ నకు ఏక్సిడెంటు అయిన విషయం వాళ్లకు చెప్పలేకపోయానని' చెప్పమని. రెండ్రో జులు అయ్యాక, అప్పటి పరిస్థితిని బట్టి వెళ్లొచ్చు"

అఖిల తన ప్లాన్ చెబుతోంది.

వివేక్‌కు అఖిలను చూస్తోంటే కంపరంగా వుంది. కానీ, ఆవిడ నోటికి భయపడి ఏమీ అనలేకపోతున్నాడు. తన తెగింపులేనితనా నికి తనని తానే అసహ్యించుకుంటున్నాడు.

వాళ్లమధ్య జరుగుతోన్న ఈ సంభాషణ అగమ్య విన్నదని, విన్న మరుక్షణమే ఏమీ మాట్లాడలేని స్థితిలో వెనుతిరిగి వెళ్లిపోయిం దనీ వాళ్లకి తెలియదు. అయితే ఆ సంగతి పక్క ఫ్లాటు పిన్నిగారు వచ్చి చెప్పింది.

"వదిన అంతా విన్నదా? హమ్మయ్య... ఇదీ మన మంచికేలే. ఆత్మాభిమానం ఎక్కువైన వదిన ఇక మన జోలికిరాదు" అంది హాయిగా నిట్టూరుస్తూ అఖిల.

అప్పుడు అఖిలవైపు వివేక్ చూసిన చూపు ఎలా వుందంటే ప్రపంచంలోని అస హ్యాన్ని అంతా తన మొహంలో ప్రస్ఫుటప రుస్తున్నట్టుంది. ఒకేఒక్క పదం అతని నోట్లోనుంచి వచ్చింది.

"ఛీ... కృతఘ్నురాలా" అన్నాడు.

ఆ ఒక్క పదం చాలు. భార్య వికృత మనస్తత్వాన్ని అతనెంతగా అసహ్యించుకుం టున్నాడో తెలియడానికి.

★ ★ ★

ఆమె కళ్లు ధారాపాతంగా కన్నీటిని వర్షి స్తూనే వున్నాయి. అయినా ఆమె పరుగు ఆపడంలేదు.

అఖిల సమాధానం ఏమిటో ఆమెకు అర్థ మైంది. అఖిల మాటలు ఓవైపు గుండెను తొలిచేస్తోంటే అవసరం ఆమెను సుందర్ ఇంటివైపు పరుగెత్తేలా చేసింది.

అప్పటికే అక్కడ సుందర్, అవకాశవా దంతో తను తప్పుకోడానికి రంగం సిద్ధం చేసుకుంటున్నాడని అగమ్యకు తెలియదు.

సుందర్ బంగ్లా ముందుకు వచ్చి సుందర్ గది దగ్గరకి వెళ్ళి ఆగిపోయింది.

"ఇదిగో... హేమా నీకిప్పుడే చెబుతు న్నాను. పొరపాటున కూడా ఫోన్ ఎత్తకు. అన్నయ్యకు యాక్సిడెంట్ జరిగిందని తెలి సింది. ఇప్పుడు వెళ్లి పలకరిస్తే హాస్పిటల్ బిల్లేకాదు అన్నయ్య, వదినల బాధ్యత కూడా మనమీదే పడుతుంది.

ఇప్పటికే తెలిసిన ప్రతివాడూ, ఈ వయ సులో మీ అన్నయ్యకు, వదినకూ ఏమైనా చేయండి. వాళ్ళని మీ దగ్గర ఉంచు కోండి... అని సలహా ఇస్తున్నారు.

కావ్య, కార్తీక్‌లు స్టేట్స్‌కు వెళ్ళి హాయిగా తప్పించుకున్నారు. మనమీద పడేలా వుంది.

అఖిలేమో నేను ఆడపిల్లనుకదా... మా ఆయన ఒప్పుకోడు అంటుంది. అంతా నాటకం" చెప్పుకుపోతున్నాడు.

అగమ్య ఇంక అక్కడ వుండలేకపో యింది. సమయంలేదు, మళ్ళీ పరుగు మొదలుపెట్టింది.

నువ్వు వదినవి కాదు... అమ్మవి వదిన

మ్మవి అన్న సుందరేనా? ఇలా మాట్లాడుతున్నది.

మనుష్యులు ఇంత అవకాశవాదులుగా ఎలా మారగలరు? ఆలోచన... మెదడు నరాలు చిట్లిపోయే ఆలోచన.

తల విదిల్చింది. ఇప్పుడు తనక్కావల్సింది తన భర్త ప్రాణాలు కాపాడుకోవడం.

టెలిఫోన్ బూత్ దగ్గర ఆగింది. చేతిలో ఏమీలేదు. హడావుడిలో డబ్బు తెచ్చుకోలేదు.

టెలిఫోన్ బూతులోకి వెళ్ళింది. వెంటనే చెవులకున్న దుద్దులు తీసి టేబుల్ మీద పెట్టి చేతులు జోడించి చెప్పింది.

"రెండు ఐ.ఎస్.డి. కాల్స్ చేసుకోవాలి. డబ్బు ఇచ్చి ఇవి తీసుకువెళ్తాను, ప్లీజ్..."

టెలిఫోన్ బూత్ అతను కదిలిపోయాడు. చేసుకోమన్నట్టు చూశాడు.

"కార్తీక్...నేనురా... అమ్మని" అగమ్యకు దుఃఖం తన్నుకువస్తోంది.

"మీ నాన్నకు యాక్సిడెంటు అయిందిరా. నాకు భయంగా వుంది. నువ్వు, నువ్వు వెంటనే రారా. హాస్పిటల్ బిల్లు కట్టడానికి కూడా డబ్బులేదు" అభిమానాన్ని చంపుకొని చెప్పాల్సివచ్చింది.

"అయ్యో... అలానా మమ్మీ. నువ్వేం వర్రీ అవకు. నేను అర్జంటుగా ఆఫీసుకు వెళ్లాలి. వీలు చూసుకొని వస్తాను. నువ్వు ధైర్యంగా వుండమ్మా. వుంటాను" అటువైపు ఫోన్ పెట్టేసిన శబ్దం. అర్థమైంది. కొడుకుకు మాట్లాడాలనిలేదు. ఇండియా రావాలనీలేదు.

వెంటనే వణుకుతున్న చేతులతో చివరి ప్రయత్నంగా కూతురికి ఫోన్ చేసింది.

"అమ్మా కావ్యా... నేను అమ్మని. నాన్నకి యాక్సిడెంట్ అయ్యింది" గబగబా క్లుప్తంగా చెప్పింది.

"అయ్యో... ఎంత ఘోరం జరిగిందమ్మా. ఈయనకు తీరిక వుంటుందో, లేదో. పోనీ నేను వద్దామంటే ఈయన ఏమంటారో... నువ్వు నాన్నని జాగ్రత్తగా చూసుకోమ్మా. అయినా నీకు చెప్పాలా అమ్మా... నువ్వే నాన్నని జాగ్రత్తగా చూసుకుంటావు. ఆ... అన్నట్టు వీలైతే అఖిలని పిలువు. సుందర్ బాబాయ్‌కి చెప్పావా?

ఉంటానమ్మా. మళ్ళీ వీలు చూసుకొని నేను ఫోన్ చేస్తాన్లే" అంటూ మరో మాటకు అవకాశం ఇవ్వకుండా ఫోన్ పెట్టేసింది.

అయిపోయింది. అంతా అయిపోయింది. హితుల్ సుతుల్... సన్నిహితుల్... అంతా అంతా చెల్లాచెదురయ్యారు.

తమ్ముడు, చెల్లెలు, కూతురు, కొడుకు... అందరూ అందరూ ఎవరికి వారు తప్పుకున్నారు.

ఆమె హాస్పిటల్‌వైపు పరుగెత్తింది.

★ ★ ★

"సారీ మిసెస్ అగమ్యా... పరిస్థితి విషమించింది. మేం మాగ్జిమమ్ ప్రయత్నించాం. మనిషిని అయితే కాపాడగలిగాం కానీ అతని కాలుని... తొలగించాం. వెరీ సారీ" డాక్టర్ చెప్పాడు.

అగమ్య కుప్పలా కూలి కిందపడబోయి నిలదొక్కుకుంది. కన్నీళ్ళు కాలువలయ్యాయి. దేవుడి ముందు మోకాళ్ళమీద కూలబడిపోయింది.

"దేవుడా... ఈ ప్రపంచంలో నాకున్న చిట్టచివరి ఒకే ఒక ఆత్మీయుడు నా భర్త... ఆయన్ని బతికించు స్వామీ" వేడుకుంది.

ఈ సమయంలో తనను ఆదుకునే వారెవరు? అప్పుడు గుర్తొచ్చింది.

రతన్‌లాల్...!

తనను కూతురిగా చూసుకున్న గొప్ప వ్యక్తి. ఆమె మరోక్షణం ఆలోచించలేదు.

పరుగెడుతూనే వుంది.

వెంటనే రతన్‌లాల్ దగ్గరకు బయల్దేరింది.





తన సమస్యకు పరిష్కారం దొరకబోతోంది.

రతన్‌లాల్ తనకు తప్పకుండా సాయం చేస్తాడు.



ఆ ఆశే ఆమెను పరుగు పెట్టేలా చేస్తోంది. ఆ ఆశే ఆమెకు ఊపిరి అవుతోంది.

వచ్చేసింది. రతన్‌లాల్ ఇల్లు వచ్చేసింది.

రతన్‌లాల్ ఇంటి ముందుకు వచ్చేసరికి ఆమె కాళ్లు ఆగిపోయాయి.

అక్కడంతా జనం గుమిగూడి వున్నారు. ఆమె మనసేదో కీడు శంకించింది.

ఆ గుంపును చీల్చుకుంటూ లోపలికి అడుగు పెట్టింది.

లోపల రతన్‌లాల్, అతని భార్యా కూడా ఐసు ముక్కలమీద పడుకోబెట్టబడి వున్నారు. ఇద్దరూ చనిపోయారు. ఒకే సారి... ఒక ఆత్మగా మారి ఈ ప్రపంచాన్ని విడిచి వెళ్లిపోయారు.

అతని కొడుకు, కోడలు ఆ శవాలమీద పడి ఏడుస్తున్నారు.

కాదు... ఏడుపు నటిస్తున్నారు, ఆ ఏడుపు చూసి నిజమా అనే భ్రమ కలిగేలా

అగమ్యకు దుఃఖం తన్నుకొచ్చేసింది.

"బేటా! నీకే కష్టమొచ్చినా ఈ అమ్మా నాన్నలను మరిచిపోవద్దని చెప్పి, కనిపించని లోకాలకు వెళ్లిపోయారు.

ఒక్క క్షణం కళ్లు మూసుకుంది.

తనకు అత్యంత ఆత్మీయులైన వ్యక్తులు చనిపోయినందుకు బాధపడాలా...

మరోపక్క తన భర్త పరిస్థితి చూసి తల్లడిల్లిపోవాలా? !

అగమ్యా! కంట తడిపెట్టకే...

అగమ్యా! నువ్వు బెదిరిపోకే...

అగమ్య రెండు కన్నీటి బొట్లు నేలరాల్చి వెనుతిరిగింది.

★ ★ ★

మూడ్రోజులు మూడు యుగాలుగా గడిచాయి. అఖిల కానీ, సుందర్‌కానీ రాలేదు. రారనీ తెలుసు.

కావ్యగానీ, కార్తీక్‌గానీ ఫోన్ చేయలేదు. ఫోన్ చేస్తే వెంటనే బయల్దేరి రావల్సివస్తుందన్న భయం.

ఆరోజే పాణిగ్రాహిని డిశ్చార్జి చేస్తున్నారు.

★ ★ ★

అగమ్య మంగళసూత్రం తీసి టేబుల్ మీద పెట్టింది. ఆమె మెడలో పసుపు కొమ్ము వేలాడుతోంది.

రెండు చేతులు జోడించి "ప్రస్తుతం నా నిస్సహాయ పరిస్థితిని అర్థం చేసుకోండి. ఎప్పటికైనా మీ రుణం తీర్చుకుంటాను." అంది. అగమ్య ఇంకా కృతజ్ఞత అనే పదాన్ని మరిచిపోలేదు. "దయచేసి నా మాటలను నమ్మండి" అని ప్రాధేయ పడింది.

డాక్టర్ కదిలిపోయాడు.

"ఈ మూడ్రోజుల్లో మీ వ్యక్తిత్వం అర్థం అయింది. ఆపదలో వున్న నా సోదరికి సాయం చేశానని అనుకుంటాను. ప్లీజ్, దాన్ని తీసుకోండి" అంటూ మంగళసూత్రం తీసి ఇవ్వబోయాడు డాక్టర్.

"వద్దు డాక్టర్! నన్ను రుణగ్రస్తురాలిని చేయొద్దు, ప్లీజ్" అని వెనుతిరిగింది అగమ్య.



వీల్ ఛెయిర్లో కూర్చుని వున్నాడు పాణిగ్రాహి.

దాన్ని తోసుకువెళ్తోంది అగమ్య.

పాణిగ్రాహి ఏడుస్తున్నాడు. మొదటిసారిగా ఏడుస్తున్నాడు. గుండెలు పగిలేలా ఏడుస్తున్నాడు.

తను ఓ కాలు కోల్పోయినందుకు కాదు. అగమ్య ఒంటరిగా మిగిలినందుకు.

తనను పెళ్లి చేసుకుని, తనతోపాటు ప్రయాణం మొదలెట్టింది.

తను కేవలం ప్రయాణీకుడిలా మిగిలి వుంటే, అగమ్య మాత్రం బ్రతుకుబండిని నడిపించింది.

దారిలో సమస్యల పట్టాలు తప్పినా, ఉప్పెనలాంటి ఉపద్రవం ఎదురైనా వెరవక నిలబడింది అగమ్య.

ఆమె బ్రతుకు పోరాటంలో నిరంతర యోధురాలు. తనను పెళ్లి చేసుకున్నప్పటి నుంచీ ఆమెకు మిగిలినవి కష్టాలు... కన్నీళ్లు... విషాదాలు... అంతే.

తనకోసం ఏనాడూ నోరుతెరిచి అడగని అగమ్య అందరికీ తల్లయింది. చివరికి తనకు కూడా...

"అగమ్యా! నన్ను క్షమించగలవా?" చిన్న పిల్లాడిలా అడిగాడు.

"భర్త బాధ్యతను భార్య పంచుకుంటుంది. బిడ్డ తప్పును తల్లి గుండెలో దాచుకుంటుంది. మీరెప్పుడూ నా కంటిపాపే. నా గుండెలో వుండే మీరు, నాకు బాధేసినప్పుడు, కన్నీటిచుక్కగా మారినా కనుకొలకుల్లోకి వచ్చి 'నీకు నేనున్నాను సుమా!' అని చెబితేచాలు

నా చివరి శ్వాసవరకూ మీకు నేను తోడుగా వుంటాను. ఒట్టు... మీమీద ఒట్టు" అంది అతని తలను తన గుండెలకు హత్తుకుంటూ.

పాణిగ్రాహి వీల్ ఛెయిర్లోనుంచి లేచాడు. కింద పడబోయాడు.

అగమ్య వచ్చి భుజం ఆసరాగా ఇచ్చింది.

"నువ్వున్నావు అగమ్యా! నాకిక ఏ ఊతమూ అక్కర్లేదు" అంటూ ఆ వీల్ ఛెయిర్ని పక్కకి నెట్టాడు.

అగమ్య భర్తను నడిపించుకుంటూ వెళ్తోంది.

'రేపే సూపర్‌మార్కెట్‌కు వెళ్లాలి. అక్కడో సేల్స్ ఉమన్ జాబ్ వుందని తెలిసింది. భర్తను పోషించడానికి ఆమాత్రం ఆదాయం చాలు' అనుకుంది అగమ్య.

'తమసోమా జ్యోతిర్గమయ' అన్నట్టు నడుస్తోంది అగమ్య, భర్తకు ఆసరాగా మారి.

ఆమె ప్రయాణం అనంతం. ఏ క్షణాన ఆమెకు అగమ్య అని తల్లిదండ్రులు పేరు పెట్టారోగానీ ఆమె పయనం అగమ్యగోచరం. అయినా ఆమెకు భయం లేదు, బాధ లేదు. తొణికిసలాడే కొండంత ఆత్మవిశ్వాసం తప్ప.









## సచిత్ర విచిత్రం

# అతిఖరీదైన వర్ణచిత్రం!

**12**సం॥రాల బాలుడు బింగ్‌హామ్‌బ్రయింట్ స్కూల్ లైబ్రరీలో గంటలకొద్దీ కూర్చుని ఎన్నెన్నో పుస్తకాలు చదువుతూ, గ్రంథాలయం నలుమూలలా తిరుగుతూ, అక్కడ వున్న వస్తువులు ఆసక్తిగా చూస్తూ ఉంటాడు. ఒకరోజు ఓ పెయింటింగ్ అతని కళ్ళబడింది. ప్రాచీన గ్రీకు కథలకు సంబంధించిన అత్యద్భుతమైన వర్ణ చిత్రం అది. 70 సంవత్సరాలనుంచీ లైబ్రరీలో కొలువుతీరి ఉన్న ఆ చిత్రాన్ని ఎవ్వరూ పట్టించుకోలేదు.

బింగ్‌హామ్ తన తండ్రి క్రిస్టోఫర్‌కు ఆ చిత్రాన్ని చూపించాడు. ఆయన ఆ వర్ణ చిత్రం గురించి రీసెర్చ్ చేశాడు. అది విఖ్యాత చిత్రకారుడు వాల్టర్‌క్రేన్స్ 1878వ సంవత్సరంలో చిత్రించినది. ఈ విషయాన్ని వెలుగులోకి తెచ్చి సుప్రసిద్ధ వేలం పాటదారులైన క్రిస్టీసంస్థకు తెలియపరిచాడు క్రిస్టోఫర్. ఆ చిత్రానికి 1 మిలియన్ డాలర్లవరకూ వేలం పాటలో లభిస్తాయని క్రిస్టీసంస్థవారు భావిస్తున్నారు.

# 'స్వాభిమానం' పై సమీక్షలు

జనవరి చతురలో ప్రచురితమైన డా॥ అల్లూరి రాజకుమారి నవల 'స్వాభిమానం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## యుక్తియుక్తం

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

దిగజారిపోతున్న మానవతా విలువల్ని, సామాజిక విలువల్ని పునరుద్ధరించ వలసిన ఆవశ్యకతను ప్రధానాంశంగా తీసుకొని రచించిన స్వాభిమానం నవల చదువరులను ఆకట్టుకొంది. నేడు విద్యాలయాల్లో నెలకొన్న కలుషిత వాతావరణాన్ని విశ్లేషిస్తూ దానికి ప్రధాన కారణం ఎక్కువ మంది అధ్యాపకుల్లో లోపిస్తూ ఉన్న ఆదర్శ వాదం, నైతిక ప్రవర్తన అని వక్కాణించటంలో ఏమాత్రం అసత్యం లేదు. అధ్యాపకులలోనే వృత్తియెడల నిబద్ధత, ఉదార దృష్టి, ఆదర్శాలు లేకపోతే వారు విద్యార్థులకు ఏ విధంగా ఆదర్శం కాగలుగుతారు? విద్యాసాగర్ వంటి మంచి అధ్యాపకులు విద్యాలయాల్లో స్వల్ప సంఖ్యలో ఉన్నా వారిని అపఖ్యాతి పాలు చేయటానికి నవ్వుల పాలు చేయటానికి తోటి అధ్యాపకులే ప్రయత్నిస్తున్నారు. అయితే పట్టువీడని సాగర్ వంటి అధ్యాపకులు సమాజంలో ఉన్న అభ్యుదయ వర్గాన్ని వృద్ధతరం నాయకుల మద్దతును సమీకరించి తమ విద్యాలయాల్లోను, చుట్టూ ఉన్న వాతావరణంలోను మార్పు తెచ్చేందుకు కృషి చేయాలి. విద్యాసాగర్ వంటి మంచి పాత్రను సృష్టించి ఒక ఉదాత్త సందేశాన్నిచ్చిన రచయిత్రిని అభినందించాలి.

ఇంకా ప్రేమలు, వివాహాలు, స్త్రీవాదం మొదలైన సమస్యలపై రచయిత్రి చేసిన వ్యాఖ్యలు సముచితంగా ఉన్నాయి. కేవలం బాహ్య ఆకర్షణ మాత్రమేకాక పటిష్టమైన వివాహబంధానికి జీవిత లక్ష్యాలు, సామాజిక దృక్పథం, ఇష్టానిష్టాలలో సామ్యత అవసరం అని చెప్పటం యుక్తియుక్తంగా ఉంది.

పట్నంలో పుట్టి, పెరిగిన సాగర్‌లో పల్లెల పట్ల, ప్రకృతిపట్ల అంత గాఢమైన అనురక్తి అలవడటం కొంత అసహజంగా ఉంది. పల్లెల్లో పుట్టి పెరిగిన యువతరం సహితం నేడు పట్నవాసపు ఆకర్షణలకు, మెరుపులకూ వెర్రెత్తుతున్న రోజులివి. సాగర్‌లో ఇలాంటి ఆకర్షణ కలిగించిన సంఘటన ఏదైనా కల్పిస్తే బాగుండేది.

మొత్తం మీద నేటి సమాజానికి అమూల్యమైన సందేశం ఇచ్చే మంచి నవల అనటంలో సందేహం లేదు.

– కె.పురుషోత్తం

హైదరాబాదు-500038

## తెలుపు నలుపు సినిమా

*(రెండవ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

"కొత్తపంటకి అంతరించిపోతున్న పాత పంట ఎరువు కావాలి. అది వ్యవసాయ ధర్మం. కొత్త తరానికి పాత తరం ఆలంబన కావాలి. ఇది సమాజధర్మం"

డా॥అల్లూరి రాజకుమారిగారి నవల





'స్వాభిమానం' ఔన్నత్యాన్ని తెలిపేందుకు రచయిత్రి సృష్టించిన పాత్ర బలరామయ్య నోట వెలువడిన ఆణిముత్యాల్లాంటి పై మాటలు చాలు. ఈ పాత్రను ఉదాత్తంగా మలచిన తీరు స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ వావిలాలగారిని గుర్తుకు తెస్తుంది. సామాన్యుల జీవితాల్ని సామాన్యుల భాష లోనే చిత్రించి ఎందరో అసామాన్య పాఠకు లను అలరించిన ఈ నవల విద్యాసాగర్ అనే వ్యక్తి అనుభవానికి అటూ ఇటూ జరి గిన ఆత్మకథ. ఊరి కాలేజీలో మంచి పరి ణామం, సుధలో పశ్చాత్తాపం, తుపాను తర్వాత స్వాభిమానంతో ఊరి కట్టుబాటు. ఇలా కొన్ని సంవత్సరాల వ్యవధిలో నడిచిన కథలో కృష్ణమోహన్‌దాసుగారే కథా నాయ కుడుగా నిలుస్తారు.

కథ కల్పితమే అయినా జీవిత రచనగా మలచి యధార్థ జీవితాల్ని అదే దృష్టితో అధ్యయనం చేసి దానికి ఓ చక్కని రూపం ఇచ్చారు రచయిత్రి. సంఘటనలన్నీ వాస్తవి కబద్ధంగా చిత్రీకరించబడ్డాయి. ఉభయ గోదావరి జిల్లాల ప్రాతః స్మరణీయురాలు డొక్కా సీతమ్మగారిని గూర్చి కథాపరంగా ప్రస్తావించడం నవలకు పైడి వన్నె తెచ్చింది. ప్రాసకోసం ప్రాకులాడక, తనూ ఏ పాత్రలోనూ పరకాయ ప్రవేశం చేయక సంభాషణల నిర్వహణలో రచయిత్రి కృత కృత్యులయ్యారు. అర్థంకాని సంస్కృతప దాలు ఎక్కడా వాడలేదు.

"వెక్కివెక్కి ఏడుస్తున్న ఆమెను కన్నీళ్లతో ఓదార్చింది అమ్మ"

"అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్య పెళ్లయిన అయిదేళ్ల తర్వాత కూడా... ఏమగాడికైనా అంతకంటే దురదృష్టం ఏముంటుంది?" లాంటివి మచ్చుకి కొన్ని. కుక్కతోక వంకరలా కొందరి బుద్ధులు మారవు అనేం దుకు వీలుగా భుజంగరావు, రంజిత, బోసు పాత్రలు, కాస్త ఆసరాతో మల్లె తీగలా పైకి పైపైకి ఎదిగి డా॥జ్ఞానేశ్వర్‌గా మారిన బుల్లి హీరో సిసింద్రీలాంటి పాత్రలూ గుర్తుండిపోతాయి. పల్లెటూరిలో మొద లయి ఆ ఊరిలోనే ముగిసిన నవలలో అంతర్లీనంగా ఉన్న మహాత్ముని నినాదం 'గ్రామం దేశానికి వెన్నెముక' అని నేటి యువత గుర్తించినప్పుడే రచయిత్రి సందేశా నికి సార్థకత చేకూరుతుంది. సుధ ప్రవర్తిం చిన తీరుకి, సాగర్ మీద జాలి కలుగక రచ యిత్రి కొన్ని పాత్రలద్వారా చెప్పించినట్లు అతని చేతకాని తనానికి పాఠకులకు కూడా కోపం వచ్చినా, భళ్లున తెల్లవారింది, నల్లేరు మీద నడకలాంటి అరిగిపోయిన రికార్డు లాంటి పదాలు చోటు చేసుకున్నా నవల సాంతం చదివాక నా చిన్ననాట ఎడ్లబండి మీద వెళ్లి ఆపాతమధురాలైన ఓ నలుపు తెలుపు సినిమా సకుటుంబసమేతంగా చూసి ఆనందించినట్లు హాయిగా ఉంది.

**– మేడా మస్తాన్‌రెడ్డి**

*పూణె-25*

## తృప్తి-ఆనందం

***(మూడవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)***

సమాజంలోని లోపాలను ఎత్తిచూపటంతో రచయిత(త్రి) బాధ్యత తీరిపోదు. ఆ లోపా లను సరిచేసి సమాజంలోని ప్రతి వ్యవస్థ ఎలా ఉండాలో చెప్పవలసిన బాధ్యత కూడా రచయిత(త్రి)దే. 'స్వాభిమానం' రూపకల్పనలో రచయిత్రి డా. అల్లూరి రాజ కుమారిగారు సామాజిక బాధ్యతను ఎక్కడా విస్మరించలేదని స్పష్టంగా కనిపిస్తుంది. స్టూడెంట్స్‌తో కలిసి తాగుతూ ప్రేమ వ్యవ హారాలు సలుపుతూ లెక్చరర్స్ ఎంత నీచ స్థాయికి దిగజారిపోయారో చెపుతారు. నేటి యువతను రేపటి దేశ బంగారు భవిష్య



త్తుకు మార్గదర్శకులను చేయటంలో ఉపాధ్యాయుల బాధ్యత ఏమిటో విద్యాసాగర్ ద్వారా తెలియజేస్తారు. ఊరి పెద్దగా భుజంగరావులాంటి స్వార్థపరుడు, అవినీతి పరుడు కాక దాసుగారి లాంటి త్యాగి, నిస్వార్థపరుడు కావాలి. ఒక కులంలో ఒక వ్యక్తి పైకివస్తే కులంపట్ల అతని బాధ్యత ఏమిటో తన ఉన్నతికి దోహదం చేసినవారి పట్ల ఎలాంటి కృతజ్ఞత చూపాలో జ్ఞానేశ్వర్ పాత్ర మనకు చెపుతుంది. దాసుగారి పట్ల జ్ఞానేశ్వర్ ప్రవర్తన ఏరు దాటగానే తెప్ప తగలేసే మనస్తత్వం ఉన్న నేటి సమాజంలో వ్యక్తులకు కనువిప్పు. కొంత మందిని పరిస్థితులే మార్చాలి తప్ప మన ప్రయత్నాలు వృధా ప్రయాసే అవుతాయని సుధలో కలిగిన మార్పువల్ల తెలుస్తుంది.

ఈ నవల చదివినపుడు ఒక మంచి నవల చదివాను అనే తృప్తి కలిగింది. ఒక పుస్తకం చదివినప్పుడు మనకు తెలియని విషయాల గూర్చి తెలుసుకుంటే కలిగే ఆనందం వేరు. ఈ నవలలో గ్రంథాలయ ఉద్యమం గూర్చి రచయిత్రి రాసిన విషయాలు చదివినప్పుడు ఆ ఆనందం కలిగింది. ప్రైవేట్ ఛానల్స్ ప్రభంజనంలో కొట్టుకుపోతున్న యువతకు సాహితీ అవగాహన కలిగించటానికి రచయిత్రి చేసిన ప్రయత్నం హర్షించతగింది.

నాయకులు తమ ప్రజలలో స్వాభిమానాన్ని పెంపొందించాలి. కాని నేడు అందుకు భిన్నంగా పదవులకోసం అధికారం కోసం శృతిమించిన ప్రజాశ్రేయస్సు కార్యక్రమాల పేరుతో నాయకులు స్వాభిమానం అన్నది ఎలా ఉంటుందో తెలియని దుస్థితికి ప్రజలను దిగజార్చారు. ఇప్పటికైనా ప్రభుత్వం ప్రజాశ్రేయస్సు కార్యక్రమాలపై ఎంత అవసరమో అంత మేరకు ఖర్చుపెట్టి మిగిలిన ధనాన్ని ఉత్పత్తి రంగంలో పెట్టుబడి పెట్టటానికి ప్రయత్నిస్తే సమాజం ప్రగతి పథంలో ముందుకు సాగుతుంది.

– గోపరాజు జయశ్రీ

జగ్గంపేట-533435

## కత్తిమీద సాము

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

మంచి, మానవత్వం మృగ్యమైపోతున్న ఈ రోజుల్లో 'స్వాభిమానం' వంటి చక్కటి సామాజిక ప్రయోజనం గల నవలను అందించినందుకు చతుర సంపాదకులకు ధన్యవాదాలు. రచనను ఒక యజ్ఞంలా భావించినపుడే రచయిత దానికి సార్థకత చేకూరుస్తాడు. ఈ విషయంలో రచయిత్రి డాక్టర్ అల్లూరి రాజకుమారి అభినందనీయురాలు. టీనేజ్ లవ్, వెకిలి కామెడీ ట్రెండ్ రాజ్యమేలుతున్న ప్రస్తుత పరిస్థితులలో ఇటువంటి సబ్జెక్టును ఎన్నుకుని నూటికి నూరు శాతం న్యాయం చేకూర్చడం కత్తిమీద సాము వంటిది.

స్వాతంత్ర్యం వచ్చి 50 సంవత్సరాలు దాటిపోయినప్పటికీ ఎన్ని ప్రభుత్వాలు మారినా, ఇంకా అంటరానితనం నిర్మూలించకపోవడం మనం చేసుకున్న దౌర్భాగ్యం. ప్రతి ఊరికి దాసుగారు, విద్యాసాగర్ వంటి చైతన్యవంతులు ఉంటే మనదేశం స్వర్ణయుగంలా మారుతుందనడంలో అతిశయోక్తి లేదు. ప్రకృతి మనకు ప్రసాదించిన వరం పల్లెలు. సహజమయిన గాలి, కనుచూపు మేర పచ్చని చెట్లు, పొలాలు వాటినన్నింటిని కాదని, పట్టణ మోజులో దూరపుకొండలు నునుపు అనుకొని పల్లెలను అసహ్యించుకునే వారికి సుధ పాత్ర చెంపపెట్టు.

సిసింద్రీ లాంటి ఎంతోమంది సరైన అవకాశాలు లేక వెట్టి చాకిరి చేస్తూ తమ ప్రతిభను మరుగుపరచుకుంటున్నారు. దాసు





గారు, విద్యాసాగర్‌ల పర్యవేక్షణలో వారి ప్రోత్సాహంతో సిసింద్రీ వజ్రంలా తయార వడం చాలా బాగుంది. జన్మ ఇచ్చిన తల్లి దండ్రులను, మాతృభూమిని కాదని కేవలం ధనార్జనే ధ్యేయంగా విదేశాలకు వలస వెళ్లే వారికి సుభాష్‌చంద్రబోస్ ఉదాహరణ. యవ్వనంలో ఉన్న ప్రతి ఆడపిల్ల ఆలోచన లకు దర్పణం రంజని.

తుపానులో సర్వం కోల్పోయినప్పటికీ చలించక అంత వయసులోనూ ఎటువంటి ప్రతిఫలం ఆశించక, తమ ఊరిని పునర్ని ర్మించడంలో దాసుగారు చూపిన చొరవ, చేయూత అభినందనీయం. దాసుగారి స్వచ్ఛమైన మనసు, విద్యాసాగర్ కార్యదీక్షత హృదయాన్ని కదిలించింది.

ఒక మంచి నవలను చదివిన అనుభూతి కలిగించిన చతురకు హృదయపూర్వక అభి నందనలు.

– షేక్‌భాష

నరసరావు పేట-522601

## దిశానిర్దేశం

**(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

ఉద్యోగం చేస్తున్న ఊళ్లోనే నివసించాలని చట్టాలు చేస్తున్న ఈ రోజుల్లో తమ వూర్లో ఉద్యోగం చేసే ఉద్యోగస్తులను గ్రామస్తులు తమ ఊళ్లోనే నివాసం ఉండాలని మేళతా ళాలతో అభ్యర్థిస్తున్న ఈ రోజుల్లో నగరని వాసాన్ని వదలి గ్రామ జీవనాన్ని ఎంచు కొన్న ఓ తెలుగు మాస్టారి ఆగమనంతో ఆరంభమై హాస్యవస్తువులుగా పరిగణిస్తున్న తెలుగు మాస్టార్‌లు కూడా పట్టుదలతో స్వాభిమానంతో అనంత చైతన్యాన్ని ఆవి ష్కరింపచేయగలరనే సందేశంతో ముగు స్తుందీ నవల.

నేటి యువతకు శక్తియుక్తులున్నాయి. విజ్ఞాన సముపార్జనా సోపానాలున్నాయి. కొరవడింది కేవలం దిశానిర్దేశం మాత్రమే! త్రిమూర్తులతో సమమైన గురువుకు మాత్రమే దిశానిర్దేశం చేసే శక్తి ఉంది. ఆసక్తి ఉంటే ఈ యువశక్తిని ప్రజ్వలింప చేసి మరో ప్రపంచాన్ని మన కళ్ల ముందుం చవచ్చు. క్షణికావేశంతో క్షణభంగురమైన విలాసాల మోజునుంచి యువతను రక్షించ గలిగిననాడు భరతమాత నిజంగా రత్న గర్భ అవుతుంది.

కథానాయకుడు సాగర్ పల్లెటూరి జీవన యాత్ర నల్లేరుపై నడకలా సాగిపోలేదు. కన్న తల్లిదండ్రుల నుండి కట్టుకున్న భార్య వరకూ ప్రతి ఒక్కరూ సాగర్ లక్ష్యాన్ని నిరుత్సాహపరిచినా మొక్కవోని పట్టుద లతో గమ్యంవైపుకు సాగిపోయిన తీరును అతిశయోక్తులకు తావులేకుండా మలచడం రచయిత్రి నైపుణ్యానికి నిదర్శనం. జనావా సాల్లో భుజంగరావులూ ఉంటారు, కృష్ణ మోహనదాసులూ ఉంటారు. విద్యార్థుల బలహీనతలను తమ స్వార్థపు నిచ్చెనలుగా మలుచుకొనే జగదీషులూ ఉంటారు. అయితే నిస్వార్థతత్వంతో యువతలో మార్పుకోసం అలమటించే ఒక్క సాగ రున్నా గ్రామసీమల్నుండి వేలమంది సిసిం ద్రీలు ఉద్భవిస్తారని చెప్పడంలో రచయిత్రి కృతకృత్యులైనారు. జన్మభూమి కార్యక్రమా లకన్నా అభివృద్ధి ఆలోచనతోసాగే వ్యక్తులే మిన్న అనే అంశాన్ని రచయిత్రి నొక్కి వక్కాణించారు. బలరామయ్య కృష్ణమోహ నదాసుగారి సహకారంతో సాగర్ లక్ష్యాన్ని అధిగమించిన తీరును రచయిత్రి హృద్యంగా మలిచారు.

– ఆర్.వి.యస్.ప్రసాద్

నెల్లూరు-524002



# చతుర ప్రపంచం

## ఇగ్లూ! ఇగ్లూ!

విపరీతంగా మంచు కురిసే ప్రదేశాల్లో నివశించేవారు తమాషాగా కనిపించే ఇళ్ళను నిర్మించుకుంటారు. ఆ గృహాలను వారు 'ఇగ్లూ' అని పిలుస్తారు. చిత్రమేమిటంటే, ఎటు చూసినా ఐస్ గడ్డలతో, పెద్ద పెద్ద ఐస్ దిమ్మలతో నిండి ఉండే ఆ ప్రదేశాల్లో వారు ఇళ్ళను సహితం ఐస్‌తోనే నిర్మించడం.




అటువంటి గృహాలు నిర్మించడంలో చెయ్యి తిరిగిన పనివానికి వాటిని రూపొందించడానికి కేవలం ఒక గంట సమయం మాత్రమే పడుతుంది. అందులో ఇరువురు మనుషులు హాయిగా ఉండవచ్చు అయితే ఆ ఇంటిని నిర్మించే పనివానికి ఎదురయ్యే ముఖ్య సమస్య ఏమంటే, అతను ఆ నిర్మాణానికి అవసరమైన చక్కటి ఐస్ దిమ్మలను ఎన్నుకోవడమే. ఆ దిమ్మలు గట్టిగా ఉండాలి. మెత్త మెత్తగా వుండి కరిగిపోకూడదు.

ఇగ్లూను నిర్మించడం కొరకు పనివాడు ఒక పెద్ద కత్తితో పెద్దపెద్ద ఐస్ దిమ్మలను తనకు అనువుగా కోస్తాడు. ఆ ఐస్ దిమ్మలతో అతను ఓ వలయాకారాన్ని తయారు చేస్తాడు. అది ఇగ్లూకు పునాదివంటిది. తాను సేకరించిన ఇతర ఐస్ దిమ్మలను ఆ వలయాకారం లోపల పెట్టి వాటిని ఓ డోమ్ ఆకారంలో రూపకల్పన చేస్తాడు. మధ్యమధ్యలో వున్న ఖాళీలను అన్నిటినీ మెత్తటి మంచుతో కప్పివెయ్యడం జరుగుతుంది. లోనికి వెళ్ళడానికి వీలుగా ఒక గుమ్మం ఆకారంలో ఐస్‌ను కట్ చేస్తారు. పిమ్మట దానికి ఒక బిగువైన తలుపు ఏర్పాటు జరుగుతుంది. ఇగ్లూ లోపలవైపు,

బయటవైపు ఐస్‌తో కప్పుతారు. అది గట్టిగా ఉండడంకోసం లోపల ఒక నూనెదీపాన్ని వెలిగించి పెడతారు. చిత్రమేమిటంటే ఆ దీపంనుంచి వచ్చే వేడివల్ల ఐస్ కరిగిపోవ డానికి బదులు, ఆ వేడివలన ఇగ్లూకు మరింత బలం కలిగి, అది ఇంటికి చక్కటి ఇన్సులేషన్ ఇస్తుంది.

కరుగుతున్న మంచు విషయంలో ఇగ్లూ గోడలు ఓ బ్లాటింగ్ పేపర్‌వలే వ్యవహరి స్తాయి. కరిగినమంచు బయటకు వెళ్ళి బయట గోడలకు గట్టిదనాన్ని ఇస్తాయి. గడ్డకట్టి ఇగ్లూ కప్పుపై ఓ చిన్న రంధ్రం చెయ్యబడుతుంది. వేడిగాలి కప్పుపై నున్న రంధ్రం గుండా పోతుంది. పరిశుభ్రమైన గాలి లోనికి వస్తుంది.

జాగ్రత్తగా నిర్మించిన ఇగ్లూ ఇల్లు లోపల ఎంతో వెచ్చగా ఉంటుంది. ఇద్దరు వ్యక్తులు అందులో సుఖంగా కూర్చోవచ్చు ఆ సమ యంలో వారు వెచ్చదనంకోసం స్వెట్టర్ ధరించవలసిన అవసరంలేదు. వెలుపల చలి గడగడలాడిస్తూ ఉంటుంది. మైనస్ 50 డిగ్రీల ఫారన్‌హీట్‌తో.

---

## లోటస్ దేవాలయం

మతం అనేది నేడు మారణహోమానికే ఉపయోగపడుతోందిగానీ, మానవమేథో వికా సానికి గానీ, జ్ఞానాభివృద్ధికిగానీ తోడ్పడటం లేదు. మనం ఏంచేస్తున్నాం, ఎలా బతుకు తున్నాం, లేకపోతే ఎలా ప్రవర్తిస్తున్నాం, ప్రవర్తించాలీ..... అనే విషయాల్ని పక్కన పెట్టి ఎదుటివాడు ఏంచేస్తున్నాడు? ఎలా బతుకుతున్నాడు? అనే ఆలోచన, తపన ఎక్కువవడంతో మనిషి చేయరాని పనులు చేస్తూ మృగంలా మారిపోతున్నాడు. ప్రతి మనిషికీ తన స్వంత మతం, బతికేవి ధానం... మొదలయిన విషయాల్లో స్వేచ్ఛ ఉంది. అలాగే స్వేచ్ఛగా మనం బతుకుతూ ఎదుటివారిని బతకనిద్దాం అని ప్రతి మనిషీ అనుకుంటే సర్వమానవ సౌభ్రా తృత్వం హస్తామలకం అవుతుంది.

బాబ్ అనే పర్షియన్ యువకుడు ప్రపం చవ్యాప్తంగా జరుగుతున్న మతకలహాలు, మారణహోమాలూ చూసి నిరంతరం చలించి పోయేవాడు. చివరికి అతను 1844 వ సం. మే 23 వ తేదీన ఓ కొత్త మతాన్ని స్థాపించాడు.

సర్వమత సమ్మేళనానికి, సౌభ్రాతృత్వానికీ అది ప్రతీక. ఆ మతమే 'బహాయ్' మతం. ఈ సంస్థ ప్రపంచంలో పలుచోట్ల ఆవిర్భ వించి అన్ని మతాలవారిలో సోదరభావాన్ని నెలకొల్పుతోంది. ఆయా మతాల ప్రాచీన మతగ్రంథాల పరిరక్షణకు, సాంప్రదాయాల పునరుద్ధరణకు తోడ్పాటు ఇస్తోంది.

మన దేశంలో ఈ బహాయ్ మతం 1872 లో నెలకొల్పడం జరిగింది. పర్షియన్ పండి తుడు అయిన ఓమెల్ ఎఫెండా ఈ సంస్థను మనదేశంలో స్థాపించాడు. తదాది భారతదేశంలో 20 లక్షలమంది బహాయి న్‌లు ఆ సంస్థలో సభ్యులయ్యారు. వారంతా కలిసి 1986 డిశెంబర్ 24 న వారి నిశ్శబ్ద ప్రార్థనలకు అనువుగా, సమావేశాలకి వీలుగా ఒక అద్భుతమైన భవనాన్ని ప్రారంభించారు.

అదే ఢిల్లీలోని లోటస్ టెంపుల్ అనే కమలం దేవాలయం. 27 ఎకరాల్లో సువి శాల స్థలంలో, 27 కమలం రేకులవంటి డోమ్‌లతో, 9 సరోవరాలతో కూడిన ఆ సుందరమైన ఆలయం నయనానందక రంగా తీర్చిదిద్దబడింది. అనేక మతకలహా లతో అట్టుడికిపోతున్న మహాగ్నిజ్వాలల నగరిలోని ప్రజలు అనుభవిస్తున్న ఎడారి జీవితానికి లభించిన చల్లని ఒయాసిస్‌లా సేదదీర్చే ఆలయం ఇది.

విఖ్యాత ఇరానియన్ శిల్పి పరిభర్కసభా రూపకల్పన చేసిన సుందరమైన దేవా





లయం అది. ఆ భవనానికి కాంక్రీటు, డోలోమైట్ రాళ్లు వినియోగించబడ్డాయి. అవి రాజస్థాన్‌లోని అల్వాల్ నుంచి రవాణా చేయబడ్డాయి. ఆ ఆలయానికి అవసరమైన పాలరాయి గ్రీస్‌దేశం నుంచి, తెల్ల సిమెంటు కొరియా నుంచి రప్పించబడ్డాయి.

20 వ శతాబ్దపు తాజ్‌మహల్‌గా శ్లాఘించబడుతున్న భవనమిది. భిన్నత్వంలో ఏకత్వానికి ప్రతీక అయిన కమలం ఆకారంలో రూపుదాల్చిన ఆ ఆలయంలో 1300 మంది హాయిగా కూర్చుని నిశ్శబ్దంగా ప్రార్థనలు చేసుకోవచ్చు. వారి మతాల ప్రకారం పూజలు, వేడుకలు సహితం అక్కడ నిర్వహించవచ్చు.

## పెంటగాన్ పరిజ్ఞానం

అమెరికా రక్షణ వ్యవహారాలను చూసే ఆఫీసు పెంటగాన్. ఇందులో సివిల్, మిలిటరీ ఉద్యోగులు మొత్తం 23,000 మంది పని చేస్తున్నారు. అమెరికన్ రాజధాని వాషింగ్‌టన్ డి.సి శివార్లలో ఉందిది.

పెంటగాన్ మూడు లక్షల డెబ్భయ్ వేల చదరపుటడుగుల విస్తీర్ణంలో ఉంది. ఈ బిల్డింగ్‌నే ఓ చిన్న పట్నంగా పేర్కొనవచ్చు. ఎనిమిదివేల ఏడువందల ఏభై కార్లను పార్కుచేసుకోవడానికి రెండువందల ఎకరాల స్థలాన్ని ఉద్యోగులకు కేటాయించారు. అక్కడినుంచి బిల్డింగ్‌లోకి చేరడానికి పంథొమ్మిది ఎస్కలేటర్లున్నాయి. ఇందులోని ఇంటర్‌కమ్ కోసం లక్షలమైళ్ల టెలిఫోన్ కేబుల్‌ని ఉపయోగించారు. రోజుకి సగటున రెండు లక్షలసార్లు ఆ ఇంటర్‌కమ్‌ను వినియోగిస్తారు. పెంటగాన్ డిఫెన్స్ పోస్టాఫీసు రోజుకి సగటున పన్నెండు లక్షల ఉత్తరాలని బట్వాడా చేస్తుంది. ఆర్మీ లైబ్రరీ కోసం మూడు లక్షల పత్రికలు ప్రపంచంలోని వివిధ దేశాలనుంచీ అందుతుంటాయి.

పెంటగాన్ బిల్డింగ్ కారిడార్ల పొడవు పదిహేడు చదరపు మైళ్లు. 41,492 స్తంభాలను ఉపయోగించి కట్టిన ఈ భవంతి




నిర్మాణం రెండవ ప్రపంచ యుద్ధానంతరం జరిగింది. ఆరు లక్షల ఎనభైవేల టన్నుల ఉక్కును ఉపయోగించారు. ఇంత పెద్ద బిల్డింగ్‌ని పదహారు నెలల వ్యవధిలోనే నిర్మించడం అమెరికన్ల ప్రజ్ఞకు నిదర్శనం.

దీనికి 1941 సెప్టెంబర్ 11 న శంకుస్థాపన జరిగింది. 1943 జనవరి 15 న పూర్తయింది. మొత్తం ఇరవైతొమ్మిది ఎకరాల విస్తీర్ణంలో ఈ భవంతిని నిర్మించారు. అప్పట్లో ఇరవైతొమ్మిది లక్షల నలభై అయిదువేల డాలర్లు దీని నిర్మాణానికి ఖర్చయింది. పెంటగాన్ కాంప్లెక్సు మొత్తం అయిదువందల ఎనభైమూడు ఎకరాల్లో ఉంది. మొత్తం నిర్మాణానికి ఎనిమిదికోట్ల ముప్పై లక్షల డాలర్లు ఖర్చయింది. ఆరు వందల తొంభై వాటర్ ఫౌంటెన్లున్నాయి.

అయితే ఇంత ఖర్చు తోటీ గట్టిదనంతోటీ కూడుకుని, అమెరికన్ రక్షణవిభాగంగా అత్యంత గౌరవనీయ స్థానంలో నిలబడిన పెంటగాన్ సెప్టెంబర్ 11, 2001 న టెర్రరిస్టుల దాడులకు గురికావడం ప్రపంచప్రజలందరినీ విస్మయపరిచింది. ఈ దాడిలో భవనంలో కొంతభాగం దెబ్బతినడమే కాదు, అమెరికా ప్రెస్టేజ్ కూడా దెబ్బతిందని చెప్పక తప్పదు.




## మాజిక్ ఆఫ్ ది మాస్క్

మనిషి జీవితంలో అప్పుడప్పుడు కొన్ని దురదృష్టకర సంఘటనలెదురవుతూ ఉంటాయి. వాటికి తట్టుకుని తిరిగి తమ జీవనగమనాన్ని సాఫీగా చేసుకునే ధైర్యశాలులు కొందరు మాత్రమే ఉంటారు. వారి లిస్టులో లోయిసీ ఆవ్‌బై పేరు కూడా వస్తుంది. ఆమె పేరుపొందిన మోడల్ నటి. అమెరికాలో లాస్‌ఏంజిల్స్‌లో కారు నడుపుతుండగా హఠాత్తుగా ఒక కారు అమితవేగంగా వచ్చి ఆమె కారుని బలంగా ఢీకొట్టింది. ఆమె ముఖం విండ్‌స్క్రీన్‌కి గుద్దు

కుంది. వెంటనే లోయిసీని హాస్పటల్‌లో చేర్చారు. అక్కడి డాక్టర్లు 12 గంటలపాటు ఆమెకు ఎమర్జెన్సీ ఆపరేషన్ చేశారు. లోయిసీ నాలుగ్గంటలపాటు కోమాలో ఉంది. పిమ్మట 24 గంటలపాటు ఆమెకు సర్జరీ చేశారు డాక్టర్లు.

తర్వాత లోయిసీ హాస్పటల్‌నుంచి డిశ్చార్జి అయింది. అయితే ఆమెకు ఓ కన్ను కనిపించడంలేదు. ఏ పదార్థం తిన్నా రుచి




తెలియడంలేదు. వాసనలు కూడా గ్రహించ లేని స్థితిలో ఉంది. అంతేకాక ఒకప్పుడు ఎంతో అందంగా ఉన్న ఆమె ముఖం వికారంగా, ఓ పగిలిన అద్దంలా రూపొందింది.

"నా మొహాన్ని అద్దంలో చూసుకున్నప్పుడు ఉలిక్కిపడ్డాను. నేనొక రాక్షసిలా ఉన్నాననిపించింది" అంది లోయిసీ.

సినిమాతారగా మంచి అవకాశం వస్తున్న సమయంలో, మోడల్‌గా పేరు, ప్రఖ్యాతులు లభిస్తున్నప్పుడు ఆమె స్థితిలో వేరెవరైనా అయితే తీవ్ర నిరాశకు గురయి, తమ వృత్తికి స్వస్తి చెప్పి మూటా ముల్లే సర్దుకునేవారు. లోయిసీ మాత్రం పట్టు వదలక తన కలలను సాకారం చేసుకుందుకు ప్రఖ్యాత ప్లాస్టిక్ సర్జన్ డాక్టర్ కవామోటోను కలిసింది. ఆయనకు తన వేదనను వినిపించింది.

కవామోటో ఎంతో కృషి చేసి, ఆమెకు ప్లాస్టిక్ సర్జరీ చేశాడు. మొత్తం సర్జరీ పూర్తి కావడానికి చాలాకాలం పట్టింది. ఆమె మొహానికి పూర్వపు అందమైన రూపం తీసుకురావడానికి కవామోటో 238 అతి చిన్న మెటలు ముక్కలను ఉపయోగించాడు. ఆపరేషన్ సమయంలో ఆమె ఎంతో ఓర్పు వహించడంవల్ల డాక్టరు నేర్పుగా ఆ శస్త్ర చికిత్స చెయ్యగలిగాడు.

చివరకు లోయిసీ సౌందర్యరాశిగా రూపొందగలిగింది. ఆమె ఎంతో ఉత్సాహంగా తిరిగి కెమేరా ముందు నటిగా నిలబడగలిగింది. మంచి నటిగా పేరు తెచ్చుకోవడమే కాక మోడల్‌గా కూడా ఎంతో ధనాన్ని ఆర్జించింది. తన అనుభవాన్ని "మాజిక్ ఆఫ్ ది మాస్క్" అనే ఓ పుస్తకం రాసి ప్రచురించింది.



# ఏరిన ముత్యాలు

❖ వయసులో నేర్చుకున్నది రాతిమీద చెక్కిన చెక్కడంతో సమానం

– ఎమ్.సి.గుప్త

❖ ఆత్మరక్షణ ప్రకృతి సూత్రాలలో మొదటిది.

– ఎస్.బట్లర్

❖ ఉద్గ్రంథాలకంటే ఉత్తేజమైనది నిశ్శబ్దం.

– జె.బి.హడ్సన్

❖ తెలివికి మించిన పుస్తకాలు చదివినవాడు శుష్కపండితుడు.

– సంస్కృత సూక్తి

❖ తన కూత వినే సూర్యుడు ఉదయించాడనే కోడిలాంటి వాళ్ళు కొందరుంటారు.

– జార్జి ఇలియట్

❖ మనల్ని గురించి నలుగురూ అనుకునేదే నిజం అని తెలియడం ఎంత బాధాకరం.

– ఎల్.పి.స్మిత్

❖ గొప్ప అంశాలు రూపొందే కర్మాగారం మౌనం.

– కార్లైల్

❖ సుష్టు అయిన భోజనం కావాలంటే వంటవాణ్ణి కసురుకోకు.

– చైనా సామెత

❖ ఇంటి శత్రువు ఒక్కరి కంటే బయటి శత్రువులు వందమంది నయం.

– అరబ్బీ సామెత

❖ భూమిమీద ప్రకృతిసిద్ధంగా ప్రతి మనిషికీ కావలసినంత హక్కుంది.

– సర్ థామస్ మోర్

❖ అందరినీ నమ్మేవాడూ నష్టపోతాడు, ఎవరినీ నమ్మనివాడూ నష్టపోతాడు.

– బ్రెజిల్ సామెత

❖ భూలోకంలో నరకం చూడాలంటే పిసుగుపోట్లువాని హృదయంలోకి చూడు.

– బర్టన్

❖ తనకు అర్థంకాని విషయంలో మనిషికి భలే నమ్మకం.

– సత్యకామ

❖ జీవితలక్ష్యాన్ని ఎరిగి ఉండటమే మనం జీవితంలో తెలుసుకోవలసిన ప్రశస్తమైన విషయం.

– లూయిస్ స్టీవెన్సన్

సేకరణ: పి.వి. రమణకుమార్

